# ఆంధ్రనవలలు

హేమలత:—చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే రచియింపబడినది — వెల రు 0-12-0

అహల్యాభాయి:—పైవారిచే రచియింపబడినది — 0-12-0

రాజరత్నము:—ఇదియు పై వారిచే రచియింపబడినదే. వివాహములలోఁగల సాధకబాధకములు స్వభావముగ వర్ణింపబడినది — 0-12-0

కర్పూరమంజరి:—ఇదియు పంతులవారిచే రచియింపబడినదే. ఇందలి కథాచమత్కారము అత్యద్భుతము ఇట్టినవల ఆంధ్రమున లేదనియే చెప్పవచ్చును.

ప్రథమ భాగము — 1- 0-0
రెండవ భాగము — 1- 8-0

పేటికాంతరశవము:—ఇది ఆంధ్రదేశసంబంధమై స్వకపోలకల్పితమైన మహాద్భుతమగు నవల — 1- 8-0

నీవేనా, డిటెక్టివునవల — 0-12-0
నలపులరాణి. శృంగారము — 1- 0-0
మృణాళి. అత్యద్భుతకల్పన — 1- 0-0
బుగ్గిరాముడు. అద్భుతసాహసకథ — 0- 8-0
నవ్వులగని. రెండవభాగము హాస్యరసము — 0-12-0
బారిష్టరు పార్వతీశము, చమత్కారముగ నుండును. — 1- 4-0

---

వలయువారు:—

మాదేటి సన్యాసయ్య అండు సన్సు, ఆంధ్రాబుక్కు-డిపో,
రాజమండ్రి.

శ్రీరస్తు.

# అపూర్వమనోహరచిత్రకథలు.

పూడిపెద్ది లింగమూర్తిగారిచే

రచియింపబడినది.



ప్రథమకూర్పు 1000 ప్రతులు.



ప్రకాశకులు:—

మాడేటి సన్యాసయ్యా అండ్ సన్సు,

ఆంధ్ర బుక్కు డిపో,

రాజమండ్రి.

కాకినాడ:—పట్టమట్టు శేషగిరిరావుగారి బార్జి ప్రెస్ యందు ముద్రింపబడియె.

1932.

[illegible]

[illegible]] [వెల రు. 0-8-0.



శ్రీరస్తు-శ్రీశారదాంబాయైనమః.

శ్రీమద్రమారమణపరబ్రహ్మణే నమః

# అపూర్వ మనోహర చిత్రకథలు

## మొదటికథ.

### కలలోఁ జూచినవస్తువును బ్రత్యక్షముగాఁ జూపుట.

ఒకయూరిలో నొకరాజు గలఁడు. అతఁడు సర్వజనరంజకముగా రాజ్యపరిపాలనంబు సేయుచుండును. అతని కిద్దఱు భార్యలు వారిలో పెద్దభార్యయం దిష్టము లేక యామెకు నుద్యానవనములో నొకయొంటిస్తంభపుటిల్లు (అనఁగా చుట్టుగుడిసె) గట్టించి యందు దినదినము మూఁడుసోలలు మొక్కజొన్నలు బత్తె మిచ్చుచుండెను. ఆమె మహాపతివ్రతాశిరోమణి. తనయేడువారములనగలతోడను దాసీపరిజనంబులతోడను వనమునఁ గాఁపురముండి ప్రతిదినము భర్త తనకిచ్చు మూఁడుసోలలు మొక్కజొన్నలే దాసిచేతఁ దెప్పించుకొని యవి దంచి జావకాఁచుకొని తాఁదిని పరివారమునకుఁ దనయొద్దనున్న ద్రవ్యముతో సన్నబియ్యముగొని తగినరసవర్గములతో భోజనము పెట్టుచుండును. పతివ్రతగనుక భర్త ఆజ్ఞ శిరమునఁదాల్చి తా జొన్నయన్నమె దినుచుండెను. చిన్నభార్య రాజుతో సకలభోగముల ననుభవించుచు నైశ్వర్యంబునఁ దులఁదూఁగుచు రాజును దనవలలోఁ జిక్కించుకొని తా గీచినగీటు దాఁటక సంచరించునటులఁ జేసికొని మహోన్నతపదవియందుండెను.

అట్లు కొంతకాలము జరిగెను. రాజునకుఁ సంతానము లేకపోయెను. మంత్రులంబిలిచి భూపతి వారలతో నిట్లనెను. "మంత్రులారా! యెంత రాజ్యమున్నను వైభవ మెంత యున్నను నిర్విచారముగా రాజ్యసుఖ మనుభవించుచున్న నాకు మనోగతక్లేశ మొకటి తీఱకయున్నది. అది యేమన సంతానరాహిత్యము. చంద్రుఁడు లేని

యాకాశనక్షత్రసంపదయు, దీపములేని యింటిలోని వింతపదార్థసంపత్తియు తావిలేని పూవులమనోహరత్వమును రాయంచలేనికొలఁకులయందలి పద్మవికసమును, విద్యలేనిదేహసౌందర్యమును సుతుఁడు లేని మానవుని యఖండసామ్రాజ్య రాజ్యాధిపత్యములును వ్యర్థములే కదా! పసితనంబునఁ బొత్తిళ్లలోను పిమ్మట నెలలుముదిరినకొలఁది నుయ్యేలలలోను బరుండఁబెట్టి లాలి జోలలు పాడుచు ముద్దులాడుచు నావెనుక నేఁడాదియీడువచ్చినదిమొదలు పంచాబ్దంబుల వయస్సు వచ్చుదనుక త్రోయుబండ్లలోఁ గూర్చుండఁబెట్టి గాలిషికారులు త్రిప్పుచుఁ బ్రక్కలోఁ బండఁబెట్టుకొని ముద్దుమాటల కానందించుచు కౌఁగిటఁ జేర్చి తద్దేహస్పర్శసుఖం బనుభవించుచు, నవ్వించుచు నేర్పించుచు నోదార్చుచు నీవిధమున నాటలాడుకొనుచు నాపైని బదియారుసంవత్సరముల వయఃపరిమాణమువఱకు విద్యాభ్యాసమును, దేహపరిశ్రమయు, నాయుధాభ్యాసమును దుష్టమృగంబుల వేఁటాడుటయు మొదలుగాఁగల పయివిద్యల నేర్పించుచు తనుపరిసవయస్కురాలును సుందరరూపవంతురాలును విద్యావంతురాలును వ్యావహారిక లోకజ్ఞానవంతురాలును నగునొకభార్యను వానికిఁ బెండిలి సేసి, వారలు బిడ్డలఁ గన నామనముల నెత్తికొనుచుఁ బౌత్రభాగ్యమును గని కడతేరినవారిదే సార్థకజన్మము గాని "అపుత్రస్య గతి ర్నాస్తి" యను పురాణంబుల వినుము. నావంటి యనపత్యులజీవనము భూమియందు వ్యర్థమేకదా? కావున నేనరణ్యంబునకుఁ బోయి తపమాచరించి సంతానము గలుగునుపాయము దేవవరంబునఁ బడసి వచ్చెద. మీరలంతదనుక ప్రజలను బిడ్డలవలెఁ గాపాడుచు రాజ్యపరిపాలనంబు సేయుచుండుఁడు." అని మంత్రులకుఁ జెప్పి చిన్నభార్యనొడంబఱిచి తపశ్చరణంబునకు నడవికి నేగెను.

అట్లు పోవఁబోవ నొకసమీపారణ్యంబునఁ దపంబాచరించుచు మౌనముద్రఁ దాల్చియున్న యొకమునిని జూచి యాతఁడు మాటలాడకుండుటచే నుపాయంబున మాటలాడించుటకు నాలోచనంబు సేసి తానొకసరస్సున స్నానము చేసి దర్భాసనము మునీశ్వరుని కట్టెదుట, బఱచి రెండుయామములవఱకుఁ దపంబు సేసి మాధ్యాహ్నికకృత్యం

బులం దీర్చుకొని స్వయంపాకము సేయువాఁడై పుడమిఱేఁడు రెండు రాళ్ళను తనమోఁకాలును ప్రొయ్యిగా నమర్చి దానిపైనికడిగిన బియ్య మన్నమువండుట కొకపాత్రలో నెసటినీటితో నుడుకఁబెట్టుటకు నగ్నిఁ దగిల్చి కట్టెలు దోపి మంటబెట్టెను. మోఁకాలు చుఱికినది. బాసి వైచెను. ఎసరు కాలిపోయి పాత్ర విఱుగఁబడెను. బియ్యము నేలపాలయ్యెను. ఎదుటనున్న ముని యదిగని "వెఱ్ఱిరాజా ! మూఁడవదికూడా తాయియే పెట్టఁగూడదా" యని యనియెను. అందుకారాజు "స్వామీ ! నేనెఱుఁగక యిట్లు సేసితిని. మీచేత మాట్లాడించి మీయనుగ్రహంబున సంతానంబు నడయనెంచి యీయుపాయంబు పన్నితి" ననెను. మునీంద్రుండు కనికరించి "ఈప్రక్కనున్న తియ్యమామిడిచెట్టెక్కి యొక్కపండు గోసికొని పోయి నీభార్యచే నది తినిపించుము. నీకుసంతానము గలుగును. పొమ్ము" అనెను.

రాజు మిగుల సంతసించి మునివర్యునకు నమస్కరించి యాచెట్టెక్కి యొడినిండ ఫలములుగోసి దిగినచ్చునరికి నొడిలోనొక్కపండే యుండెను. ఇట్లెన్నిసారు లట్లుచేసినను పండొక్కటెయుండుచువచ్చెను. "దైవలబ్ధ మింతియె మనకు ప్రాప్తములభించును గాని యధికము కోరినను రా"దని మనోనిశ్చయంబు సేసికొని కడువేగమున బయనమై నింటికి నర్ధరాత్రముసరికిఁ జేరి నిదురించుచున్న చిన్నభార్యను లేపి "ఇదిగో! నీకొఱకొక ఫలము దెచ్చితి. దీనిఁ దిన్న నీకుఁ జిన్నికొమరుఁడువొడమును" అనిచెప్పి పండందిచ్చెను. ఆమెకంట్లునలుపుకొనుచు నిదురగదుర "సరిసరి ! ఇంత కాలము తపస్సుచేసి జీడిమామిడికాయయా తెచ్చితి" రని జీడిపిడకమె యాపండు చప్పరించి బైటఁ బాఱవైచెను.

తెల్లవాఱునంతలో యథాప్రకారముగా పెద్దభార్యదాసి బత్తెమునకుంబోయి యాపండుదీసి చిన్నభార్యను "అమ్మా ! మామిడిపండేలపాఱవైచితి" రని యడిగెను, ఆమె "దీసి దాసీ ! మీరాజుగారు తపస్సుచేసి యాజీడికాయ తెచ్చి "యిది తిన్న సంతానముగలుగు" నని నాకుఁ జెప్పియిచ్చిరి. ఇంతకాలము కాఁపురముజేసినను గలుఁగని పుత్రసంతతి నేఁడు దీనితోఁ గలుగునా ? ఛీ యేమిమాట ? పాపము!

మీరాణిగారికి మగనితోఁ గాఁపురము లేదు. నీ వీపండుఁ గొనిపోయి నే నిచ్చితినని చెప్పి యామెకిమ్ము. ఇది మీసవతి యెంగిలిచేసినది. నీకిష్టమున్నఁ దినవచ్చునని చెప్పుము" అని భత్యముకొలిపించి పొమ్మనెను. దాసియు వేవేగఁ బరుగుపరుగున వనమున కేగి యావార్త దన యేలికచానతో విన్నవించి ఫల మందిచ్చెను. ఆమె యాఫలమును పాలతోడను, నేతితోడను గడిగి యామీఁద పంచామృతంబుల శుద్ధి చేసి పంచగవ్యములతోఁ బవిత్రపఱచి దానుశుద్ధోదకమున స్నానము జేసి పట్టుచీరఁగట్టి సకలాభరణాలంకృతయై పసుపుఁ బూసినమేన సుగంధద్రవ్యంబులఁ బూసుకొని నుదుటఁ గస్తూరికుంకుమంబులు దిలకంబు విడి తులసికోటయొద్ద పద్మాసనంబునఁ గూర్చుండి పంచరంగుల ముగ్గు రంగవల్లియొనర్చి యందు నొకబంగారుపళ్ళెరంబున నాపండు నునిచి దానికి ధూపదీపనైవేద్యంబు లొసఁగి "యోఫలరాజమా! నాకు నీవంటి మనోహరమగు దేహకాంతిగల పుత్త్రునిఁ బ్రసాదింపుము" అని ప్రార్థించి నమస్కరించి పిమ్మట లేచి సూర్యభగవానునకుఁ బరమాన్నంబునివేదించి పండ్రెండునమస్కారములు గావించి "యోప్రత్యక్షదైవమా! అసహాయజనసహాయా! లోకబంధూ! జగన్నేత్రమా! త్రిమూర్త్యాత్మక స్వరూపవిగ్రహా! యీఫలము నాభర్త కష్టపడితపంబుఁ గావించి తెచ్చిరి. ఇది పుత్త్రజనకమఁట. నీవే సాక్షివి. నిరవద్యపాతివ్రత్యంబు నాయందుఁ గలదేని నీవేనిజముగ జగంబులకు ప్రత్యక్షదైవంబవేని నీవంటి తేజః ప్రతాపశాలియు చతుష్షష్టికళావిద్యాసంపూర్ణుఁడును వంశోద్ధారకుఁడును నన్ను నాపతిని పున్నామనరకంబునుండి యుద్ధరించువాఁడు నగుసుతునిఁ బ్రసాదింపుము" అని యాఫలమును దాఁ దిని మిగిలినది దాసి కిచ్చెను. అది పూర్తిగాఁ దిని దానిపైతో లక్కడమేయుచున్న యొకయాఁడుగుఱ్ఱమునకు, నందలి టెంక దానుపెంచిన యొకయాఁడుకుక్కకును బెట్టెను అంతటఁ జిన్నభార్యయు, పెద్దభార్యయు నామెదాసియు, గుఱ్ఱంబును, కుక్కయు గర్భంబులుదాల్చిరి. మాసక్రమంబున ఫలమును నిరాదరణ చేసి లక్ష్యములేక చప్పరించినకారణమున చిన్నభార్యకు నొక కన్ను గ్రుడ్డిగలవాఁ డొకఁడును కాలొకటి కొంచెము పొట్టిగాఁ గలవాఁ

కొకఁడును గా నిద్దఱుపుత్రులు జనించిరి. పెద్దభార్యయు నామెపాతి వ్రత్యంబునకును భక్తి విశ్వాసములకును దగినవాని నొకానొకని సూర్యచంద్రుల మించుపరితాపకీర్తులు గలిగెడువాఁడును నవమన్మథాకారుఁడును సూతికాగృహదేదీప్యమానుఁడై యొక పుత్రరత్నమును గనెను. దాసి కొకకొడుకు పుట్టెను. గుఱ్ఱమున కొకయుత్తమజాతి యాజానేయం బగు దేవమణికంఠాభరణము మొదలగు మంచిసుడులు గల యింద్రునియుచ్చైశ్రవమువంటి గుఱ్ఱపుపిల్ల కలిగెను. కుక్క కొక మంచి వేఁటకుక్కజాగిలము కలిగెను. రాజపుత్రులును, దాసీసూనుండును తమతమవిభవములకొలఁది గారాబములఁ బెరుఁగుచుండిరి. పెద్ద భార్య తనతనయునకు తండ్రి దగ్గఱలేఁడనులోపముదప్ప మఱి యేలోపమును లేకుండ మహావైభవముతోఁ బెంచుచు, దాసీపుత్రుని గుఱ్ఱపుపిల్లను కుక్కపిల్లను గూడ ముద్దుగాఁ బెంచుచుండెను. చిన్న భార్యకొడుకులవైభవము జెప్పనక్కఱలేదు.

ఇట్లుపెరుఁగుచున్నపిల్లలు క్రమముగ నైదేసియేండ్లు వయస్సు గలవారుకాఁగా చిన్నభార్య బిడ్డలకు రాజు తగినగురువుచే నక్షరాభ్యాసముఁ జేయించి చదివించుచుండెను. పెద్దభార్య తనబిడ్డకు తానే యక్షరాభ్యాసము జేసెను. మహాపతివ్రత గనుక నాసమయమందా సరస్వతి యామెయందావేశించి యామెసుతునకు తన్మాతృరూపమునఁ బంచాక్షరీమంత్రోపదేశముఁ జేసెను. అంత పెద్దభార్యకొడుకును, తనపుస్తకములు దాసీపుత్రుఁడు వెంటగొని వచ్చుచుండఁగా గుఱ్ఱపుపిల్లపై నెక్కి కుక్కపిల్లకూడ వెంట వచ్చుచుండ చిన్నభార్య బిడ్డలు చదువుగురువునొద్దనే విద్యాభ్యాసము చేయుచుండెను. పదు నైదుసంవత్సరములువయస్సువచ్చుసరికిపెద్దభార్యకొడుకుసకలవిద్యలు గ్రహించి, యఱువదినాలుగుతంత్రములు నరువదినాలుగువిద్యలు నేర్చి పశుపక్షిమృగాదుల హృదయంబులు సైతముఁ దెలిసికొనువాఁడై సర్వజ్ఞుఁ డనిపించుకొనెను. చిన్నభార్యకొడుకు లప్పటికిఁ గొంచెము భాషాజ్ఞానము గలవారై తమంతటఁ దాము పుస్తకము జదివెడిశక్తి గలవారయిరి. ఈనడుమ నప్పుడప్పుడు పెద్దభార్యకొడుకు తనతల్లితో “అమ్మా మాయయ్య యెవ్వరు? మనమీయడవి నొంటిమీఁదు

టకుఁ గారణమేమి ? నీవు రాజాగ్రమహిషివిగాఁ గనఁబడుచున్నావు" అని యడుగుచుండెను. గాని, తల్లి యావృత్తాంతముఁ జెప్పక దాఁచుచుండెను. పదిపది యొకనాఁడు చెప్పకతప్పదనిపట్టుబట్ట "నాయనా ! ఈపట్టణ మేలెడురాజే నీతండ్రి. నే నాతనిపట్టమహిషిని. రాజు మఱి యొకభార్యను వివాహమాడి దానిమరులలోఁ బడి నన్నుఁ దృణీకరించి నాయేడువారములనగలుతో .నీయరణ్యంబున నీకుటీరమున నుండనియమించి నాసవతిచే నాకు మూఁడుసోలలు మొక్కజొన్నలు బత్తెము కొలిపించుచున్నవాఁడు. భర్తయొక్క యాజ్ఞను నిరసింపఁ గూడదు గనుక నేనాజొన్నకూఁడె తినుచుంటిని. నీకును నీనాపరివారమునకును శాల్యన్నమిడుచుంటిని. సమయము వచ్చినప్పుడు తండ్రి యొద్దకుఁ బోవుదువుగాని యిప్పు డావూసు మఱచిపొమ్ము" అనిబ్రతిమాలుకొనెను. అంతఁ గుమారుఁడు సైతము శాంతముతో నూరకుండెను.

ఇట్లుండ నొకానొకదినమున రాత్రి రాజు చిన్నభార్య పండుకొనియున్నగదిలోనికేగి నిద్రించుచున్నయామెను తమకముతో లేపెను. ఆమె నిదురలేచి రాజుపై మిగులనాగ్రహించి "నానిదుర భంగము గావించుటయే గాక, యిప్పుడు నిద్రలో నాకుఁగనఁబడుచున్న మంచి స్వప్నమొకటి భంగమైనది. ఆస్వప్నమున నేఁ గాంచినపదార్థమును నాకుఁ బ్రత్యక్షముగాఁ గనబఱచనిచో నే నీక్షణముననే ప్రాణత్యాగముఁ జేసెద"ననెను. అందుకా రాజు మిగుల భయపడి "నీస్వప్నమేమని" యడిగెను. "రజితస్కంధమును, సువర్ణశాఖలును, (వెండి మొదలు, బంగారుకొమ్మలు) మరకతపత్రములును (ఆకులుపచ్చనివి) గలయొకచెట్టును చూచితిని. దానికొమ్మలుపై నొక పంచరంగులుగల యొకపిట్టమిట్టిమిట్టిపడుచు|గంతులువైచుచు నఱచుచు పాడుచునాడుచు నొకకొమ్మనుంచిమఱియొకకొమ్మకు దాఁటుచుండెను.ఇంతవఱకుఁజూచితిని. ఆపయి నేమగునో తెలియదు. కాఁబట్టి నాకిప్పు డగఁపడిన యా వృక్షమును, దానిపై నాడుచుండెడిపిట్టను, గనఁబఱచినఁ జాలును. ఆపయిసంగతి నాకవసరములేదు. ఇది మాత్రము చూచి సంతసించెదను." అనిచెప్పఁగా రాజు "మంచిదే ! తెల్లవాఱనిమ్ము. పట్టణ

ములో చాటించి తెప్పించెదను" అని సమాధానపఱచి యామెతో నిష్టోపభోగముల నానందించెను.

మఱునాఁడుదయమున రాజు సభకువిచ్చేసి మంత్రులగావించి "పయినజెప్పినచెట్టును, పిట్టనుదెచ్చి చూపించినవారికిఁ దా నర్ధరాజ్య మిచ్చెద" నని చాటించెను. ఆచాటింపు పెద్దభార్యకొడుకు విని తల్లి యొద్దకుఁ బోయి "అమ్మా! ఇంతకన్న మఱి సమయమేమున్నది? నే నీసందర్భమున రాజదర్శనము జేసి చెట్టును, పిట్టను దెచ్చెదనని యొప్పుకొని యర్ధరాజ్యమును స్వీకరింతు" ననెను. తల్లియెంత వలదని చెప్పినను మానక యదేపట్టు బట్టినందున నెట్టకేలకు నంగీకరించి వెడలిపొమ్మనెను. ఆబాలుఁడు తండ్రియొద్ద కేగి యర్ధాసనమునఁ గూర్చుండెను. వానినిజూచి తండ్రి "నీవెవ్వడవు? శంకలేక నాయర్ధా సనమునఁ గూర్చుంటివి?" అనిన నాయువరాజు "నేనర్ధాసనార్హుఁడ నగు యువరాజు" నని బదులుచెప్పెను. రాజదివఱకు పెద్దభార్యయు దాఁ దెచ్చినపండువలన నొకకొడుకును గనెనని చారులవలన విని యున్నవాఁడు గావున తనయుని మనముననె గౌఁగలించుకొని పైకి మాత్రము లాతివానిఁగనే భావించినటుల నటించుచు సభాసదులు వినుచుండ "నీవేల వచ్చితి" వని యడిగెను. "నీవెందుకు చాటించితివో నే నందుకే వచ్చితి"నని జవాబిచ్చెను. రాజదివిని సభాసదులం గని "వీఁడే నేను కోరినిచెట్టు, పిట్టలం దెచ్చినవాఁ డయ్యేనేని నా యర్ధరాజ్యము కాదు సకలరాజ్యసంపదలును వీనివశముగావించి వీఁడు పోసినగంజి నేను త్రాగుచు నాయిరువురుసుతులతోడను చిన్నభార్య తోడను వానిక్షేమముఁ గోరుచు వానివశమున నుందు" ననియెను. పెద్దభార్యకొడుకు వల్లే యని సెలవుదీసికొని తల్లియొద్దకు వచ్చి ప్రయాణమయ్యెను. తల్లియు వాని కనేకదీవన లిచ్చి "నిన్ను పగటి యందు సూర్యుఁడును, రాత్రులందు చంద్రుఁడును రక్షించుచుందురు. భూతప్రేతపిశాచాది భయంబులేక సింహశార్దూలాది భయంబులేక యేఁకలిదప్పులులేక, నిరామయుండవై సుఖముగా నతివేగమునమరలి రావలయు" నని చెప్పి రక్షాబంధముఁగట్టి కార్యసిద్ధి కాఁగలదని

దీవించి గుఱ్ఱముపై నెక్కించి పంపెను. దాసీపుత్రుని యుండు మని రాజపుత్రుఁడొక్కఁడె బయలుదేఱి పోవుచుండెను.

చిన్న భార్య యంతఃపురముననుండియు సభలో జరిగినప్రసంగ మంతయు విని యున్నదిగావున తనకొడుకుల నిద్దఱనుబిలిచి పెద్ద భార్యకొడుకుయొక్క యౌదార్యమునకు మెచ్చి "మీరు వానికాలి జోళ్లు మోయుటకయినను చాల"రని దూషించినందున వారును తండ్రియొద్దకుఁ బోయి "బాబయ్యగారూ! సెలవైనచో మేముఁ గూడఁ బోయి తెచ్చెద" మనిరి. అట్లయినఁ బొండని తండ్రి సెల విచ్చెను. వారిద్దఱుఁ జెఱియొక గుఱ్ఱము నెక్కి కత్తులు చేతఁదాల్చి పయనమై వలయుద్రవ్యముఁగొని బయలువెడలి యూరిపొలిమేరకు వచ్చుసరికి పెద్దభార్యకొడు కప్పుడెయచ్చటికిఁ జేరెను. అచ్చట నొక్కక్షణము నిలుచుండి కాఁగలకార్యక్రమమును దలపోయుచున్న యాతనిం గని చిన్నభార్యకొడుకులు చేరఁబోయి గుఱ్ఱముల దిగి వానికి సాఁగిలఁబడి దండము బెట్టి "అన్నయ్యా! మేమును నీవెంట వచ్చెదము. మాయమ్మచే చీవాట్లు తినలేక నీధైర్యమున నీయొద్దకు వచ్చి నీపాలఁబడితిమి. మమ్మును పాలముంచినను నీట ముంచినను నీదేభారము. నీపాదములు వదలము" అని మొఱవెట్టుచున్న వారలఁ గనిరండని కూడఁ బిల్చుకొనిపోయెను.

ఇట్లు ముగ్గురుఁ గలిసి పోను పోను సమీపమున నొకనగరముఁ గనుపడెను. ఆపట్టణమునకుఁ బోయి ముగ్గురు నొకపేదరాశిపెద్దమ్మ యింట బసచేసి భోజనముచేసి మార్గాయాసముఁ దీర్చుకొని నాఁ డూరకుండి మఱునాఁడు రాజసభకుఁ బోయి రాజదర్శనముఁ జేసిరి. ఆపురమేలెడు రాజువారల ముఖ్వర్తంగాంచి "మీ దేయూరు? ఇం దేల వచ్చితిరి" అని యడిగెను. పెద్దభార్య కుమారుఁడు లేచి నిల చుండి సగౌరవముగా నిట్లనియె. "భూపతీ! మేము క్షత్రియులము. మానివాసము మీ కనతిదూరముననుండు సౌందర్యనగరము. మేము ముగ్గుర మన్నదమ్ములము. మాతండ్రిగారి యనుమతిని దేశాటనము సేయవచ్చితిమి. "దేశాటనం పండితమిత్రతా చ వారాంగనా రాజ సభాప్రవేశః" అన్నమాట మీ రెఱింగినదేకదా! మే మమానుష

ప్రజ్ఞ గలవారము. కొంతకాల మిటనుండి మాచాకచక్యము మీకుఁ గనఁబఱచవలసినయవసరము దటస్థించినపుడు కనఁబఱచి మీవలన బహూకరింపఁబడి పోయివచ్చెదము" అని విన్నవించునంతలో రాజు మిగుల సంతసించి "మీరు మాకు సముఖస్థులై ప్రతిదినమును మా సభకు వచ్చి సామంతరాజులువలె మాకు మాన్యులై యుండుడు. మీకు మాపూలతోఁటలో బసయిచ్చితిమి. మానౌకరులు మీకు వలయువులపలు (భోజనసామగ్రి) దెచ్చి యిచ్చుచుందురు. మీ కెప్పు డెంతద్రవ్యము గావలసినను మాప్రత్యేకసెల వక్కఱలేకయే మా భాండాగారకుఁడు మీకిచ్చుచుండును." అని చెప్పి వారలకు బసయే ర్పాటుచేసి పూలతోఁటకుఁ బంపెను. వారునుబ్రతిదినము రాజసభకుఁ బోవుచు సామంతాది బంధుజనంబులతోఁబాటు రాజవల్ల గౌరవింపఁ బడుచుండిరి.

అంత నాయూరి కొకసమీపారణ్యమున నిగియున్న తస్కరులు కొందఱు రాజభవనమున దొంగతనముసేయ నిశ్చయించుకొని యావనదుర్గకు నమస్కరించి "మోతల్లీ! మా కీరాజుగారికోటలో దొంగతనము సాఁగెనేని రాజుపెద్దకూఁతును నీకు బలియిత్తు" మని మొక్కుకొనిరి. క్షుద్రదేవతలకు బలులే ప్రధానముగాని వానిలో తారతమ్య మక్కఱలేదు. దొంగలకు కన్నము సాఁగినది. రాజుగారి ద్రవ్యము చాలామట్టుకు దొంగిలించి మేడపయిని నిద్రించుచున్న రాజుగారి పెద్దకూఁతురిని పందిరిమంచముతో నెత్తుకొనిపోయి కాళికా దేవిగుడిలో భద్రపఱచిరి. నాటికి తెల్లవాఱుజామయినందున పగలంతయు డాఁగియుండి రాత్రికాఁగానే మఱల కాళికి "ఓతల్లీ! నిన్నటి దినము మాదొంగతనమునందడిని ఆలస్యమైనది. దానికి ప్రాయశ్చిత్తము రాజురెండవకూఁతురిని నేఁడు తెచ్చి యిడఁగిని రేపు బలియిచ్చెదము" అని మొక్కుకొని మరల మఱికొంతధనముతో రెండవ కూఁతురిని సైతము గొంపోయి దుర్గగుడిలో దాఁచి తాము తమవిడి దెలకుఁ బోయిరి. పగలంతయు డాఁగియుండి రెండవనాఁడు దుర్గ గుడిఁకిబోయి యందుభయముచేత నేడ్చుచున్న నాచబిడ్డలఁగని వారల నోదార్చి "తెల్లవాఱఁగానే మీయిద్దఱకు మిమ్ము దిగఁబెట్టుదుము

మిమ్ము నెవరో దొంగలు బలియిచ్చుటకుఁ దెచ్చిరి. మీకేమియు భయములేదు. మే మిచ్చటనే మీకు కాపుందుము. బైటఁ బందుకొందుము. మీరు ధైర్యముతోనుండుఁడు. భోజనము చేయుఁడు" అని వారలనిమిత్తము తాము వంటచేసి శాల్యన్నము, మంచికూరలు, మాంసాహారములు తీసికొనిపోయి యిచ్చి "అమ్మా! మీరు క్షత్రియులు, మేము శూద్రులము, మావంటవాళ్ళు శూద్రులే. నాఁడు విరాటరాజునొద్ద భీముఁడు శూద్రుఁడ ననిచెప్పుకొని వంటలవాఁడై యజ్ఞాతవాసము గడుపుకొనలేదా? కనుక మీజాతి పోదు. లెండు. భుజింపుఁడు" అని బోధగలిచి వారికి నమ్మకముఁ బుట్టించి భోజనము చేయించి "పండుకొండు" అనిచెప్పి తల్పుపయిని తాముగొలుసు తగిలించి బసలకుఁ బోయిరి. మఱునాఁడుపగలు వారికిఁ గనఁబడి "అమ్మా! మీతండ్రిగారికి వర్తమానమంపితిమి. ఈరాత్రికిమీనౌకరులువత్తురు. రేపు మీరు పోవచ్చును" అని చెప్పివారలకు భోజనసదుపాయములు చేసి తెల్లవాఱుజామున వచ్చెదమని చెప్పిపోయిరి.

అంత నక్కడ రాజుగారికోటలో తొలినాఁడు కన్నముపోవడము మఱునాఁడే వారు తెలిసికొని ద్రవ్యముపోయినందున కంతగా విచారింపక పెద్దకుమార్తె కనఁబడనందుకు తలిదండ్రులు మిక్కిలి యేడ్చి యారాత్రి దుఃఖముతో వారు స్మారకములేక పడియుండిరి. నౌకరులందఱును దుఃఖముతో స్మారకములులేనివారయి యెక్కడివారక్కడనె పడి నిద్రించుచుండిరి. మఱునాఁడురాత్రి మఱింత సులభముగా కన్నముపాఱినది రెండవకూఁతురునుసైతము దొంగలించుకొనిపోయిరి. మూఁడవనాఁడు రాజును నౌకరులును రెండవకూఁతురుసైతము పోయినందుకు దుఃఖించుచుండఁగా, మూఁడవకూఁతురు తనయక్క లిద్దఱు నొక్కసారి యదృశ్యులయినందుకు మిక్కిలి యేడ్చియేడ్చి సాయంకాలమగునప్పటికి బెంగపెట్టుకొని చనిపోయెను. రాజు మిగుల విచారగ్రస్తుఁడై యారాత్రి యాపిల్లశవమును కాపాడుట దుర్లభమని, బ్రహ్మరాక్షసిని గెలుచువాఁడు గాని కాపాడలేఁడని యెంచి రాచకొమరుల రావించి బ్రహ్మరాక్షసియొక్క వృత్తాంతము వారితో చెప్పి వారలకు శవము నప్పగించిన వారు కాపాడఁగలరని

యిట్లు పలికె—“వింటిరా! రాకొమరులారా! మాపట్టణములో నొక దురాచార మున్నది. ఒక బ్రహ్మరాక్షసి యీగ్రామము నాశ్రయించి రాత్రిపూఁట నెక్కడ శవమున్నను తినిపోవుచుండును. దానికి వెఱచి యీపురమందలిజనులు రాత్రి మరణించినవారి శవముల నప్పటికప్పుడె పదిమంది సంఘముగాఁ గూడి పోయి శవదహనము సేయుచుందురు ఈబిడ్డ సాయంకాలము మృతిబొందినను, రాత్రి దహించుట శాస్త్రదూష్యము. కావున నీశవమును బ్రహ్మరాక్షసి బారిఁబడకుండ మీరు కాపాడి తెల్లవారక మా కప్పగింపవలెను. బ్రహ్మరాక్షసి తొలిజామున రాదు రెండవజాముననో మూఁడవజామువనో యెప్పుడు నేవేళవచ్చునో తెలియదు.” అని చెప్పి యూరుబైట నొకడేరా వేయించి యాశవము నందుంచి వారల కప్పగించి వారలకు కావలసిన పాలు మొదలుగాఁగల ఫలహారముల నొసంగెను.

అంత నాయన్నదమ్ములు వరుసగా రెండు మూఁడు నాలుగు జాములు వంతులువేసికొని చిన్నభార్యచిన్నకొడుకు రెండవజామునను పెద్దవాఁడు మూడవజామునను పెద్దభార్యకొడుకు నాల్గవజామునను కాచువారుగా నిర్ణయించుకొనిరి. అట్లు రెండవజామున చిన్నభార్యకొడుకు ఫలహారముచేసి పాలుత్రాగి పహరా టలాయించుచుండఁగా తక్కినవారిద్దరు నిద్రపోవుచుండిరి. కొంతసేఁపటికి బ్రహ్మరాక్షసి యాపిల్లతల్లివలె నాకృతిధరించి రోదనముచేయుచు డేరాసమీపమునకు వచ్చి లోనికిఁబోవుటకు యత్నించుచుండ పహరానిచ్చుచున్నపిల్లవాఁడాటంకపెట్టెను. ఆమె “నాయనా! నాకడసారికూఁతు రిబిడ్డ. అకాలమరణము నొందెను. పోయినపిల్లలిద్దఱును పోఁగా నున్నదాని చావైనను కన్నులారఁజూచి దుఃఖముతీర నేడ్చి పోఁదలంచి వచ్చితిని. రాచవారము. పగటిపూఁట శవముమీఁదఁబడి యేడ్చుట కవకాశము లేదుకదా? ఒక్కపర్యాయము బిడ్డమొగముమీఁద మొగముబెట్టి యేడ్చి ముద్దుబెట్టుకొని పోదును. కన్నకడుపుగనుక యింతగానేడ్చుచుంటిని. సెలవిమ్ము” అని యడిగెను. ఆపిల్లవాఁడు నిజమనుకొని లోనికి వెళ్లుటకుఁ సెలవిచ్చి తా నొకప్రక్కనుండి చూచుచుండెను. నిజముగా నేడ్చుదానివలె ముఖముమీఁద ముఖముంచి యేడ్చి

యాశవము నాలుకనోటబట్టి లాగబోయెను. అదిచూచిపిల్లవాఁడు తన చేతనున్నఖడ్గముతో భుజముమీఁద నఱికెను. ఆవ్రేటుతో చెయి తెగి క్రిందఁబడెను. అంతబ్రహ్మరాక్షసియు నదృశ్యమయ్యెను. రెండవ జామును ముగిసెను. తనయన్నను లేపి జరిగినవృత్తాంతమంతయు జెప్పిన భయపడునేమో యని చెప్పక తాను నిద్రింపఁజొచ్చెను.

చినభార్య పెద్దకొడుకట్లు లేచి కత్తి చేతఁబూని డేరాచుట్టుఁ దిరిగి చూచి లోనికిఁ బోయి శవముప్రక్కను తెగిపడియున్న చేతిని జూచి కనుంగను నాశ్చర్యముపడి మిక్కిలి జాగరూకతతోనుండెను. అంత బ్రహ్మరాక్షసి నిజభీకరాకారముతో నెత్తిమీఁద నొక గండదీపముతో నొంటిచేతితో నొకశూలముఁ ద్రిప్పుచు "నరవాసన కొట్టుచున్నది. మ్రింగుదునా, తన్నుదునా? పొడుతునా?" అనుచు పెద్దగొంతుకతో డేరా సరిహద్దులోనికి రాఁగానే యాపిల్లవాఁడు కత్తితోడను, బ్రహ్మరాక్షసి శూలముతోడను నొండొరులు కొంత సేపు ద్వంద్వయుద్ధము చేసిరి. పోరు ఘోరంబయ్యె. తుట్టతుదకు బ్రహ్మరాక్షసి రాచకొమరునిచే నఱుకఁబడి నడుమువద్దకు సరిగా రెండుతునుకలై పడిపోయెను. ఆనేలయంతయు వారి యడుగులచే నుమ్మ దట్టముగారేఁగి యిసుకనేలవలె నయ్యెను. ఇంతలో తన జాము ముగిసెను. అన్నను లేపి, జరిగిన వృత్తాంతమతనితోఁ జెప్పకయే తాను నిద్రించెను.

పెద్దభార్యకుమారుఁడు లేచి పాలుపండ్లు భుజించి కత్తి చేతఁ బట్టుకొని డేరాచుట్టుఁ దిరిగి తాటిచెట్టుప్రమాణముగా పడియున్న మొంటిచేతి బ్రహ్మరాక్షసి కళేబరమును జూచి విస్మితుఁడై లోనికేగి యందు తెగిపడియున్న చేతిని జూచి యీరెండుపనులును తనతమ్ములిద్దఱు చేసిరని గ్రహించి "బ్రహ్మరాక్షసి చచ్చినది. ఇఁక భయము లే"దని తనపక్కమీఁద తాను పరుండి నిద్రబోక కన్నులరమోడ్చి జాగ్రత్తగాఁ జూచుచుండెను. అంత నిద్దఱు నాగకన్నియలు వెండిబెత్తమొకటెయు, బంగరుబెత్తమొకటెయు చేత బట్టుకొని వచ్చి తమ చెలికత్తెయగు నా చిన్నదానిని బంగరుబెత్తమున తాఁకిరి. ఆ చిన్నదియు నిద్రమేల్కొనినట్లు లేచి మొడలు విఱుచుకొని కూర్చుం

డెను. అట్లు ముగ్గురు గూడి కొంతసేపు సొగటాపాళీ లాడుకొనిరి. పిమ్మట వెండిబెత్తముతోఁ దాఁకిరి. మరల నాచిన్నది మరణించెను. ఆకన్యకలు లేచి పోవుచుండిరి. పెద్దవాఁడది చూచి వెంటనంటి యందుకొని "ముం దాబెత్తములు రెండు నక్కడ బెట్టి పిమ్మట మాట్లాడుఁ" డని చెప్పి కత్తి ఝళిపించెను. వారును బెత్తము లక్కడ నుంచి "అయ్యా! యీపిల్ల తొలిజన్మమున మాచెలికత్తియ, నాగ కన్యక అష్టావక్రమహాముని మా నాగలోకమునకువచ్చి మారాజుతో మాట్లాడుటకు జూచుచుండఁగా నాతనిఁజూచి యీమె నవ్వినది అంత నాతఁడు కోపగించి "నీవు మనుష్యాంగనవై పుట్టు" మని శపించెను. అతని యడుగుఁదామరలపైఁబడి క్షమించి శాపవిమోచనమునకు నవధి నేర్పఱచుమని యడిగెను. ఆతఁడును కరుణాళుఁడై—"మొదట నీ వొక రాచబిడ్డవై పుట్టి, చచ్చి మరల బ్రిదికి యొక్క పొట్టరాజునకు భార్యవై వానితోఁ గొంతకాలము కాఁపురముచేసి యిద్దఱుబిడ్డలను గని, మనుష్యపరిమిత శతాబ్దము లందుండి మరల నీలోకమునకు రమ్ము" అని యాజ్ఞాపించెను. ఆకారణమున నీబిడ్డ జన్మించి మరణించినది. తిరిగి నీవల్ల బ్రతుకునని మాకు తెలుసును. కనుకనే నీ కీసాధనముల నిచ్చిపోవుటకే మేము వచ్చినాము. ఈచిన్నది నీతమ్మునికి భార్యయగును" అని చెప్పి వెడలిపోయిరి. అతఁ డాబెత్తములు రెంటిని జాగ్రత్తపఱిచి యావైపులనున్న యరణ్యమును జూడఁబోయెను. పోఁగాపోగా నచ్చట నొకకాళికాదేవిగుడి కనఁబడెను. ఆగుడిలో దీపము వెలుఁగుచుండెను. ఇద్దఱాఁడుపిల్లలగుసగుసధ్వనులు వినఁబడుచుండెను. అతిశీఘ్రమున నాగుడిసమీపమునకేగి గుడితలుపులువిడిపోవునట్లు లొక్కతాపుతన్ని యందున్న యారాచకూఁతుల నిద్దఱిని జూచెను. వారు భయపడి "రక్షింపు" మని శరణుజొచ్చిరి. మీరెవ్వరని యడుగ తాము రాచబిడ్డలమని యుత్తరముచెప్పి తమపూర్వోత్తర మానుపూర్విగ నెఱింగించిరి." సరే మీరు నిర్భయముగ నుండుఁడు. దొంగ లిపుడు వచ్చి మిమ్ము నొకసరసికిఁ గొనిపోయి యందుస్నానముచేయుమందురు. "మాకు దాసీలు జలకమాడింతురు. మేముస్వయముగాస్నానముచేయ లేము. మీరందఱు స్నానములుచేసి

చూపండి" యని చెప్పను. వారలట్లుచేయఁగనే మీరును గుటుకులిడి లెండు. మిమ్ములను మరల నీయాలయమునకుఁ దెచ్చి దేవికి మ్రొక్క మందుగు. మాకితరులు మ్రొక్కుదురుగాని మేమెవరికిని మ్రొక్కము మీరందఱొక్కసారి మ్రొక్కి చూపించుఁడు. మేము మ్రొక్క దముఅనుఁడు," అని వారితో చెప్పి—తానాయమ్మవారి నుద్దేశించి "తల్లీ! దొంగలు పండ్రెండుమంది రాజసొమ్ము దొంగలించుటయే గాక పసిగోలలగు రాచబిడ్డల నిరువురిని దెచ్చి బలియియ్యఁబోగా తగుదునమ్మా యని బలిగ్రహించుటకు సిద్ధముగా నున్నావా? నీవు దేవతవని సహించితినిగాని లేనిచో నాచేతి ఖడ్గము నీశిరంబు ఖండిం చునుగాన నిప్పుడయినను నీ వింతటినుంచి నరబలి గ్రహింపనని ప్రమా ణము చేయుము. ఆఖరున నీ కాపండ్రెండుగురుదొంగల నేకకాలమున బలియిచ్చెదను." అని చెప్పఁగా దేవి ప్రత్యక్షమై "నాయనా! నీవు హరిశ్చంద్రునిపుత్త్రుఁడు లోహితాస్యుఁడవు కాలవశమున నీజన్మ నీకు వచ్చినది. తనతండ్రి నరమేధము సేయఁబోఁగా శునశ్శేపుఁడను బ్రాహ్మణుఁడు పశువుగా దొరికి విశ్వామిత్రునిదయవలన మరణిం చక వరుణదేవునిచే విడిపింపఁబడెను. నాఁటనుండి నరబలులు నరమే ధములు భూలోకములో లేకుండఁ జేయవలెనను కోరిక గలవాఁడై యది నెఱవేఱకముందె కాలగతి నొంది "అంతే గతి స్సాగతిః" యను న్యాయమును నీవై జన్మించెను. ఇక భూలోకములో నరమేధములు నర బలులు నవుమనినను చేటగు. ఈయిద్దఱుపిల్లలలో పెదదానిని నీవు వివాహమాడుదువు. ఇదిగాక నీకుమఱినలుగురు నాగకన్యకలు భార్య లగుదురు. ఈయైదుగురు భార్యలతో నీవు నూఱేండ్లు రాజ్యమేలి ప్రజారంజకుఁడవయి తుదకు నింద్రునియర్ధాసనము నలంకరింతువని చెప్పి యూరకుండెను. తానాయమ్మవారివిగ్రహమునకు వెనుక ప్రక్కను డాఁగియుండి దొంగలువచ్చి యీ రాచకూఁతులనిద్దఱను తోడ్కొని సరస్సునకుఁబోయి పైనఁ జెప్పినతీరున వారును తామును స్నానములుచేసి మరల గుడికివచ్చి రాచబిడ్డలకు చూపించుటకుసు దుగా దొంగలు సాష్టాంగదండము లేక కాలమున కాళికాదేవి కాచ రింప విగ్రహముచాటునడాఁగియుండిన రాచబిడ్డడొకలఘువున చంద

హాసము ఝళిపించి వచ్చి "జయ ! మాతంగతనయె, జయ ! పరమే శ్వరీ ! జయ ! కాళీ, యీహంతకులగురుదొంగలను నీకు బలియిచ్చు చున్నాను. ఒక్కవేటున వీరలశిరస్సులు ఖండించి యీపిల్లలగాఁపా డు"మని యమ్మవారి కప్పగించి తాను డేరాకు వచ్చి యెప్పటియట్లు నిద్రించుచుండెను. అంతఁ దెలవారెను.

రాచపీనుఁగు తోడులేనిది కాలదనునట్లు తెల్లవారగానే రాజును పరివారమును పిండిబొమ్మను చేయించి పట్టుకొని దహనము నకు వలయుసామగ్రులు శ్మశానమునకుఁ బంపి యీపిల్లను దహించు టకు సన్నాహముతో వచ్చిరి. రాఁగానే వారుముందుగా డేరాయొద్ద బైటఁబడియున్న యొకచేతిని మఱియొకచోటపడియున్న యొకతుండె ము రెండు ముక్కలను జూచి యాశ్చర్యపడిరి. ఇదియేమని రాజ డుగ చిన్నభార్యకొడుకులలో చిన్నవాఁ డిట్లనియె. "అయ్యా ! నేను పహరాగాయుచుండఁగా బ్రహ్మరాక్షసి యీపిల్లతల్లివలె నాకారము వహించి తల్లి పిల్లలకొఱకె ట్లేడ్చునో యట్లు రోదనముసేయుచు వచ్చి నందున నాకుఁ గనికరముజనింప లోనికిరుగ ననుజ్ఞనిచ్చితిని. అట్లు లోనికిఁబోయి పిల్లముఖముపైముఖముఁ బెట్టి కొంతతడ వేడ్చి జంహ్వ లాగుచుండెను. అది నేను కనిపెట్టి రాక్షసియని గుర్తించి యొక్క నఱుకు నఱికితిని. వెంటనే దానిచేయి తెగి పడిపోయెను. వెంటనే రక్కసియు పారిపోయెను. అంత నా జాముయి పోయి నందున మాయన్నను లేపి నేను నిద్రించితిని." రాజు విని పరమానందము నొంది "హా ! నేనెంతటి నిర్భాగ్యుఁడను. ఈపిల్ల జీవించియున్న యెడలవీనికిచ్చివివాహముసేతు"నని యనుకొనునంతలో చిన్నభార్యపెద్దకొడుకు వచ్చి యిట్లు విన్నవించె. "ప్రభువా ! నా తమ్ముఁడు నన్నులేపినతోడనే నేను పహరా టలాయించుచుండఁగా బ్రహ్మరాక్షసి నిజాకృతితో వచ్చెను. దానిని రెండుతునకలుగా ఖండించి మాయన్నను లేపి నేనునిద్రించితిని." రాజదివిని "నేటితో మనపట్టణమునకు బ్రహ్మరాక్షసిభయమును వీరుతొలఁగించిరి. రెండవ కూఁతురైన జీవించియున్న వీనికిచ్చి వివాహముసేతును. నిజముగా వీర లమానుషకృత్యమునే గావించిరి. ఇఁక పెద్దవాఁడు పెద్దవాఁడె.

హాయిగాఁ బండుకొని నిద్రించుచుండు’’నను నంతలో—పెద్దవాఁడది విని యదరిపడి లేచి “భూజానీ! నాతమ్ములపరాక్రమమును చూచితిరా? మీపట్టణమునకు మఱి బ్రహ్మరాక్షసివలన భయములేదు. వీ రమానుషకృత్యములను జేసిరని యొప్పుకొందురు. నే నగస్త్య భ్రాత నన్నటుల వీరల కగ్రజుఁడను. వీరిపరాక్రమమువలన నాకును గొంతప్రతిష్ఠ రావచ్చును. ఇంతకును మీరు సంకల్పసిద్ధులు మీ యాచిన్నదియు, రెరిడవకొమరితెయు బ్రతికియున్నచో వీరల కిచ్చి వివాహముసేసియుందురు గదా? మీసంకల్పమున కన్యథా యేల కలుగును? ఇదిగో నీమూఁడవ పిల్లను నాచిన్నితమ్మున కిండు. తెండు. పిండిబొమ్మను దహించుఁడు. వానితో పీడాపరిహారమగును’’ అని చెప్పి తనయొద్దనున్న బంగరుబెత్తము దీసి “మరదలా! లెమ్మని దానితోఁ గొట్టెను. ఆపిల్ల నిద్రమేలుకొనినట్లు లేచెను. రాజునువిస్మితుఁడై మిక్కిలిసంతోషించి దానిని చిన్నవానికిచ్చుటకు సంకల్పించెను అంతట దేవలయమునకు రాజును, మాతులనుదీసికొనిపోయి యందు నిష్ఠాగోష్ఠి సంభాషణసేయుచుండు నక్క-సెల్లెండ్రి నిద్ధఱినిజూపెను. తెగిపడిన పంద్రెండుగురు దొంగలశిరంబులను చూపెను. ఇఁక రాజు సంతోషమునకు మేరలేకపోయెను. సంతోషసముద్రమున మునిఁగె. రాజును గొంతసేఁపు నిశ్చేష్టుఁడై యనంతరమాయిద్దఱు పిల్లలఁదోడ్కొని దేరాకడకువచ్చి మూఁడవపిల్లనుజేర్చుకొని యామువ్వరనుగొనిపోయి మంచిముహూర్తమున ముగ్గుఱకు ముగ్గురినిచ్చి వివాహముసేయించెను. అట్లన్నదమ్ములు వరుసగా నక్క-సెల్లెండ్రను వివాహమాడి మహావైభవముతో నూరేగి కొంతకాలమచ్చట శ్వశురగృహమున సుఖులై పరమసుఖమున్నటుల తమతమ భార్యలతోసంసారసుఖమనుభవించుచుండిరి.

ఇట్లుండఁగా నొకనాఁడు పెద్దభార్యకొడుకు చిన్నభార్యకొడుకుల నిద్దరినిచేరబిలచి “తమ్ములారా! మనమిట్లు వచ్చినపనిమఱచి విషయలోలురమై కాపురములుసేయుచు నుండుటతగదు. మీరిచట నుండుఁడు. నేఁబోయి చెట్టును, పిట్టనుబట్టుకొని శీఘ్రింబవచ్చెదను. అంతనందరము కలిసిపోవుదము’’ అనిచెప్పెను. అందుకు మేముకూడా

వత్తుము'' అనిరి. అంతనొకనాఁడు పెద్దభార్యకొడుకు రాజసభకుఁబోయి రాజుతోనిట్లు విన్నవించెను. "మామయ్యగారు! మేమెన్ని దినములిచ్చట నయున్నను మీకేమియు భారము లేదు. వచ్చిన కార్యము వెనుక బెట్టుకొని మేమిచ్చట భార్యలతో సుఖించు చుండుటతగదు. మాతండ్రియాజ్ఞ నయిని మే మొక కార్యము సాధింపఁబోవుచుంటిమి. మాకు సెలవొసంగిన యెడల మాచేయవలసిన కార్యము పూర్తి చేసికొని యొక్క మాసములో తిరిగివచ్చెదము" అని చెప్పి మామగారియొద్ద సెలవుపుచ్చుకొని ముగ్గురు రాకొమరులు మూఁడుగుఱ్ఱములపై నెక్కి వలసినధనముఁగొని బైలుదేరిపోవసాఁగిరి. అట్లుపోయిపోయి యొకపట్టణము శేరిరి. అంత పెద్ద భార్యకొడుకు తమ్ములఁబిలిచి యిట్లనియె. "వినండి! తమ్ములారా! ముగ్గురుపట్టినకార్యము ముక్కలయ్యెనన్నటుల మనమొంతదూరమిట్లు కలసిపోయినను కార్యము కలసిరాదు. ఇక్కడనుంచి ముగ్గురము మూఁడు దిక్కులకుఁబోదము. ఎవరు ముందు వచ్చినను తక్కినవారి కొఱకాఁగవలసినది." అని యొకకోమటి దుకాణమునకుఁబోయి యాశెట్టితో తమయుదంతమంతయు చెప్పి మాలో నెవరుముందువచ్చినను తక్కినవారువచ్చువఱకు నీయొద్ద కాపుచేయ వలయుననికోరిరి. సెట్టి యునట్లెయని యొప్పుకొనెను. అనంతరము ముగ్గురు మూఁడుదిక్కులకుఁ బోయిరి.

చిన్న భార్యకొడుకులలో పెద్దవాఁడు (............) దక్షిణముదిక్కునకుఁబోయి పదునైదుదినములలో సొమ్మంతయు నోలుపోయి చేత నొక్కకానిమైనను లేక తిరిగి కోమటియొద్దకు రాఁగా నతండు మూఁడుదినములుచూచి యాయూరనొక తెలుకలవానిగానుగ తోలుటకు నప్పగించెను. వాఁడా గానుగాడుచు వాఁడిచ్చెడిబత్తెము నందుకొని తినుచు కాలక్షేపముచేయుచుండెను. రెండవవాఁడువచ్చి పడమరదిక్కునకుఁబోయి యన్నవలెనే సొమ్మంతయు వ్యయముచేసి చేతదమ్మిడియైన లేక శెట్టియొద్దకువచ్చెను. శెట్టియు మఱిమూఁడురోజులుచూచి యొకమంగలివానియొద్ద నప్పగించెను. రాజకుమారుఁడును మంగలివానితోఁగలసి చిన్న చిన్న బుఱ్ఱలనుగొరుగుచు వాఁడిచ్చుబత్తెము బుచ్చుకొని వంటచేసికొని భుజించుచు కాలక్షేపము సేయుచుండెను.

ఇఁక పెద్దభార్యకుమారుఁ డుత్తరదిక్కునకుఁ బయనమయి పోవుచుండెను. అట్లు పోగాపోగా నొకనాఁడు సాయం సమయమగు చుండెను. అచట నొకసరోవరము కనిపించెను. గుఱ్ఱముదిగి సరసు జొచ్చి స్నానముచేసికొని గుఱ్ఱమును నీరుద్రావనిచ్చి విశ్రమించిమరల గుఱ్ఱము నెక్కి పోవుచుండెను. అప్పుడా చెఱువుగట్టున నొక పాముఒక కప్పను మ్రింగుచుండెను. కప్పయఱుపువలన నారాజ కుమారుఁడు పామున్న ప్రదేశమును గుఱుతుపట్టిపోయి యాపామునుజంపి కప్పను బ్రతికించెను. మృత్యుముఖమునుండి రాజకుమారుని దయవలన వెలువడి యాకప్ప మనుష్యవాక్యములతో నిట్లువక్కాణించెను—"రాజ కుమారా! నీకాపదవాటిల్లినప్పుడు నన్నుఁ దలఁచుకొనుము. నేను మండూకంబను. నీకు మేలుచేయుటకే యిటు లేతెంచితిని." అనిచెప్పి యదృశ్యమయ్యెను. రాచకొమరుఁడును చీఁకటిపడునంతకొక మఱ్ఱి చెట్టునొద్దకు చేరుకొని గుఱ్ఱముదిగి యశ్వము నొక యూడకుఁగట్టి బారిజామాపఱుచుకొని పరుండెను.

ఆమఱ్ఱివృక్షముమీఁద రెండు భరద్వాజపక్షులుండెను. అందు మగపక్షి యాఁడుపిట్టతో నిట్లుచెప్పఁదొడఁగెను. "అయ్యో! పాప మీరాచకొమారుఁడు నేఁ డీచెట్టుక్రింద పండుకొనినాఁడు. ఆయెదుటి చెట్టుక్రిందనున్న పుట్టలోనుండి నూఱుశిరస్సులుగల నాగుబాముడవచ్చి బుస్సుబుస్సుమని విషముగ్రక్కుచు నీప్రదేశమంతయు సంచరించును. దాని విషపువేఁడిమికి చెంతనున్న చీమ సైతము మాడిపోవును. నేల నున్న పచ్చిక సైతము మాడిపోవును. ఏజీవియైనను భస్మము కాకపోవునది లేదు. పాప మితఁడు నిద్రాశక్తుఁడై యున్నాఁడు. గుఱ్ఱముమఱ్ఱియూడకు దృఢముగాఁ గట్టబడియున్నది. వీరు నేఁడు పామువాతఁ బడుదురనుట నిశ్చయము. ఆపాము నాగేంద్రుఁడు. ఒక్కొకరోజొక్కొకదిక్కు బైలుదేరును. నేఁడీదిక్కువచ్చును" అదివిని యాఁడుపులుఁగు కరుణవొడమ దయార్ద్రసహృదయయై మగ పులుగుతోనిట్లు దయనీయమైన వాక్యములవిన్నవించెను. "పాపమీ రాచకొమరుఁడు బ్రతుకునుపాయ మేమయినచెప్పుము" అనిన మగ పిట్ట యిట్లు చెప్పఁదొడఁగె:— "ఇతఁడు బహుపరాక్రమ శాలియైన

రాకొమరుఁడువలెఁ గనఁబడుచున్నవాఁడు. దీర్ఘప్రయాణమున నలసి యీచెట్టుక్రింద నొడలుమఱచి నిద్రించియున్నవాఁడు. దైవానుగ్రహమున నితఁడునిద్రమేల్కొనియుండిన రాత్రిసగముగడచుసమయమున పాముపుట్టలోనుండి బైటికివచ్చును. పాముబైటవచ్చుసరికి పుట్టప్రక్క నితఁడు దాఁగియుండి పాము శిరస్సులునూఱును బైటికివచ్చిరావడములో తనవాఁడిఖడ్గముతో నొక్కవ్రేటువేసి నూఱుపడగలు నూఱుముక్కలగునట్లు ఖండించిన తానుబ్రతుకుటయేగాక తానింతదూరము శ్రమపడివచ్చిన కార్యమును సానుకూలమగు విషయమును సైతమా నాగేంద్రునివలనఁ దెలియఁగలఁడు. కార్యసాఫల్యము నొందఁగలఁడు."

రాకుమారుఁడా మాటలువిని తాను పక్షిమాటలు తెలిసినవాఁడుగనుక వెంటనే చేతచంద్రాయుధముబట్టి పక్షి చెప్పినపుట్టకడకుఁ బోయి వెనుకప్రక్కనుడాఁగి పాము రాక కెదురు చూచుచుండెను. భుగభుగమని పొగలెగయువిషముతో నాగేంద్రుఁడు పుట్టలోనుండి బయటికిరా తననూఱుశిరస్సులు పయికి కనబడీ కనబడకుండునంతలోనే రాజకుమారుఁడు చంద్రాయుధముతో నొకేవ్రేటున నూఱుపడగలను ఖండించెను. అందు ప్రధాన శిరస్సు రాచవానిని జూచి "నాయనా! నీపరాక్రమమునకు మెచ్చితిని. నేను పాతాళలోకమున నొకదేశమునకు రాజును. ఒకానొకముని శాపవశమున నిట్లు జీవహింస చేయుచు సంచరించు చున్న దానను. నాతనయుండు నాకుమారుగ రాజ్యమేలుచున్నవాఁడు. నీమూలమున నాకు శాపవిముక్తియగునని యాముని వచించియున్నాఁడు. నీవు వచ్చినకార్యము నాకు తెలియును. నీవీపుట్టలో నీగుఱ్ఱముతోఁడ దూఱుము. కావలసినంత వైశాల్యముగా బాటయున్నది. ఒక యామడ దూరమున నొక పట్టణమగుపడును. ఆపట్టణములో నొక పెద్ద మేడమీఁద నాకూఁతురున్నది. ఆ చిన్నది నీ నిమిత్తమెదురు చూచు చున్నది. నీవు చనిన వెంటనే నిన్ను మహావైభవమున వివాహ మాడఁగలదు. నీవచ్చిన కార్యమును నెఱవేఱఁ గలదు. నేను పంపితినని చెప్పుము. ఈ నీచేతదెగిన శిరములన్నియు పురల నామొండెములకు జేర్పుము. అవి యతుకుకొనును. నేను సజీవుఁడనగుదును. నీవు తిరిగి

వచ్చువఱకు నిక్కడనేయుండెద. నిన్నీమార్గముననే బైటికి పంపించెద. నారాజధానికిఁ బోయెద. కాన నీవు వేగముగఁ బోయిరమ్ము." అనెను. రాకుమారుఁడును సర్పము చెప్పినట్లు తెగినశిరముల మొండెములకు జేర్చి యొక్కమణిని మాత్ర మానవాలుగాఁగొని గుఱ్ఱముతోఁగూడ పుట్టలోదూరి లోనికిఁబోయెను. అట్లొక యామడ దూరముకడచిన తోడనే యొకసుందరమయిన పట్టణమొండుకాన్పించె. అట్లాపట్టమునఁ బోయిపోయి యొక గొప్ప మేడను గాంచెను. ఆమేడమీఁదఁ నొక సర్వాంగసుందరియగు చిన్నదియుఁ గనబడెను. ఆచిన్నదియు దూరమునను రాకొమరునిఁగాంచి తనదాసినిబిలిచి శీఘ్రముగఁబోయి యాచక్కనయ్యను దీసికొనిరమ్మని చెప్పిపుచ్చెను. దాసియు మహాప్రసాదమని రాకొమరుని కెదురుజని యతనిందోడ్కొనిపోయెను. అతనికి సకలసదుపాయములు సపర్యలుగావించి యతనివరించి గాంధర్వవిధిని వివాహంబై చెప్పనలవిగాని మహాసుఖము ననుభవించుచుండెను.

అట్లు నాలుగునెలలుగడిచెను. ఒకానొకదినమున రాజకుమారుఁడు తనలోనిట్లు విచారింపఁదొడఁగెను "నేనువచ్చినపనికాలేదు సరే గదా వేఱుపనులుచేయుట తటస్థించుచున్నది" ఆమాటలువిని యాచిన్నది "నీవువచ్చినపని నాకుఁదెలుసును. నేను నాప్రయత్నములోనే యున్నాను. ఇప్పుడెబయలుదేఱుదము. ముందఱ నొకయామడదూరములో నాచెల్లెలున్నది. దానిసాయమున మనపనినెఱవేఱును." అని చెప్పెను. అంతనిద్దఱును పయనమై చెల్లెలున్నయూరికిఁజనిరి. అక్కను బావను దూరమునుండిచూచి చెల్లెలు తనదాసిని వేగముగబంపి వారల దోడ్కొనిదాసిరావారలకుచితసత్కారములఁగావించికుశలప్రశ్నలడిగి గాంధర్వంబున తానును వానిని వరించి యచ్చట మఱినాలుగుమాసములు సుఖముగానుండి యిష్టమైనకష్టములఁదేలి యనంతరము రాకొమరుఁడు "నావచ్చినపనికాలే"దన నచటికామడదూరముననున్న మఱియొక చెల్లెలినివాసమునకు మువ్వురుపయనమై పోయిరి.

అట్లు వచ్చుచున్నయిద్దఱక్కలను బావను చూచి యాచెల్లెలు తన దాసిని బిలిచి వారల కుచిత సత్కారముల జరిపి మంచి

ముహూర్తమున గాంధర్వమున తాను వానివరించి వానితోడను తన యక్కలిదలతోడను నెడతెగని సుఖాంబుధినోలలాడుచు మఱినాలుగు మాసములుండి రాకొమరుని ప్రార్థనముపైని ముగ్గురక్కసెల్లెండ్రను రాకొమరుడును మఱియొక యామడదూరమునను్న మఱియొకచెల్లెలి యూరికిం బోయిరి. తనయొద్దకి వచ్చుచున్న ముగ్గురక్కలను శావ గారిని దూరమునుండి చూచి యా కడసారపుచెల్లెల దాసిని వేగం బిలిచి "వారల నుచిత సత్కారముల సంతుష్టాంతరంగులం గావించి శీఘ్రంబ తోడితె"మ్మని పంచి రావించి సుముహూర్తంబునం దానును వరించి యక్కలతోడ చెప్పదరముగాని సుఖ పారవశ్యంబున నోలలా డుచుండెను. అంత నక్కడ నాల్గుమాసములు గడచెను.

రాకొమరుం డొకనాడు "నామాట మఱచితిరి. మీమీసు ఖంబులం జూచుకొనుచున్నారు. ప్రతిజ్ఞాభంగము క్షత్రియు లోర్వంద గినదిగాదు. శీఘ్రంబ నావచ్చినపని నెఱవేర్చుకొని పోవలయు"నని మందలించెను. నలువురక్కసెల్లెండ్రను కూడం బలుకుకొని యింక బంగారుబరిణయు పచ్చని యక్షతలయు నింకొక వెండిబరిణయు తెల్ల నియక్షతలను నిలిపి యారెండుబరిణలు పట్టుకొని రాచకుమారుడెక్కి వచ్చినగుఱ్ఱముపైననె యైదుగురు నధిరోహించి పయనమై తండ్రికాచి యున్న వల్మీక ముఖద్వారముకడకు వచ్చి తండ్రికి వినయసంభ్రమం బులుగదుర ప్రణామంబు జేసి నిలిచిరి. రాకొమరుడును మామకు నమస్కరించెను. నాగేంద్రుడును వారల దీవించి బిడ్డలను చేరంబిలిచి "తనయలారా! యీ రాచబిడ్డం డలోకసామాన్యుడు. బహుపరాక్ర మవంతుడు. ధర్మస్వరూపుడు. సకల కలావిశారదుడు. దయాస్వ రూపి. దుష్టశిక్షకుడు. ఆశ్రితపక్షపాతి. ధర్మనిష్ఠుడు. సత్యవ్రతుడు అతిసాహసుడు. ఇంతయేల! నా శాపవిమోచనము నితనిమూలము ననె యైనది. నేనే వీనిని నా యానవాలిచ్చి పంపితిని. మీరు సుఖ ముగాం బోయి యాతని కోరికదీర్చి మీ కోరికలు సఫలపఱచుకొని మీకిష్టమయినంతకాలము నాతనితో సకలసౌఖ్యముల ననుభవించి బిడ్డలు లేక మీకన్యాత్వమునకు భంగములేక మరల యథాప్రకార ముగా నతడు సెలవిచ్చి మిమ్ముపంపునఱకు నతనిని సంతుష్టిపొందిం

చుచు నుండి పిమ్మట మనలోకమునకు రండు. పొండు. సుఖం బగుం గాక !" యని పిల్లలతోఁ జెప్పి రాజసూనునితో "నాయనా! నీవు వచ్చినపని నాతనయులకుఁ దెలియును. వా రందుకుఁదగిన సాధనసామగ్రితో వచ్చిరి. నీవు వేగంబ పోయి నీసవతితల్లి కా చెట్టును, పిట్టను చూపి యీబిడ్డలతో నీయిష్టమువచ్చినంతకాలము కామోపభోగసౌఖ్యముల ననుభవించి వీరిని మరలఁ బాపుము. నీ రెంతకాలము నీతోఁ గాపురముసేసినను వీరికిమాత్రము సంతానముండదు. వీరికన్యాత్వము నాఁడిపోదు. వీరు మరల కన్యకలుగానే నాయొద్దకు వత్తురు నీము నుపటి భార్యయందు నీకు నీవంటి బాహుపరాక్రమ విద్యాశీలవంతుం డగు కుమారుండు గలుఁగును. వానివలన నీకు బహుకీర్తి వచ్చును. మఱియు నూఱశ్వమేధము లొనరించియిందుంద్రనియర్ధాసనం బెక్కుము నాలోకమునకును నీవు మరల వచ్చెదవు. నీవు రాజ్యమేలుచుండ నే నొకదివ్యవిమానము నీకు బంపెదను. దానిపై నాబిడ్డలతోఁగూడి నీవు సకలలోకములు యిష్టానుసారము చరింపుడు నీకు స్వచ్ఛందమరణముగలుగునటుల నేను వరమిచ్చితిని. ఎప్పుడు నీ కీ మర్త్యలోకమున నుండుట కేవజనించునో యప్పుడ నీవు నీమానవ తనువునువిడిచి దేవతనువుం దాల్చి యీ విమానమున స్వర్గలోకమున కేగుము. నాబిడ్డలును నీతోవత్తురు. అందు కొంతకాలముండి నాబిడ్డలతో నాపాతాళలోకమునకు వచ్చి శాశ్వతముగా వారితోఁ గాఁపురముసేయుచు సుఖింపుము. నిన్ను స్వర్గమున విడిచి నాబిడ్డలు నాయొద్దకు వత్తురు. నీవు స్వర్గమందు నూఱు దివ్యవర్షములుండి దేవతాస్త్రీలతో హాయిగా నుండి పిమ్మట నాలోకమునకు వచ్చి నాబిడ్డలతో సుఖింపుము. అంతవరకు వారు కన్యకలయి యుండి దేవదేహధారివగు నిన్ను మరల వివాహమాడి నీతో పారములేని కామసౌఖ్యముల నోలలాడుదురు." అని చెప్పి యల్లుని, కూఁతుండ్రను బంపి తాను తన లోకమునకు వేంచేసెను.

ఇట్లు నాగకన్యకలతో రాకొమరుఁడు భూలోకమున ప్రవేశించి తొలుతటి యరణ్యమార్గమునుబట్టి పోవుచు నొక్క సరోవరముఁ గాంచి యందు జలకమాడి యమృతప్రాయమగు నందలినీరమును

గ్రోలి కొంతకాలమచట విశ్రమించి యంతట రాచకొమరుఁడు నాగ కన్యకలం జూచి "మీరు వచ్చితిరి గాని నాచెట్టు, పిట్ట యెక్కడ? అవి లేనిదే నేనెట్లు పోదును" నని యడుగ వారు నవ్వి తమ చేతిబరిణలు రెండు నతనిచేతికిచ్చి నలుగురు నొకచోటఁగూర్చుండి "మాపై నొక దుప్పటిమూసి యీ పచ్చని యక్షతలు చల్లి ముసుఁగుదీయుము. చెట్టు పిట్ట నీకు కనపడును. ఇట్లనే నీతండ్రి యాస్థానమున కనబరచి రాజ్యము చేకొమ్ము" అని చెప్పిరి. రాచకొమరుఁ డట్లుచేసి మిక్కిలి యానందించి వారలతో బైలుదేరి రానురాను తమ్ములిద్దఱును, తానును విడిపోయిన పట్టణమునకుఁ బోయి యచ్చట శెట్టిని గాంచి "తమ్ములు వచ్చినారా" యని యడిగెను. అందుకతఁడు "వచ్చినారు. చూపుదును ర"మ్మని తనతోఁ దీసికొనిపోయి మంగలివాని యింటికి వెళ్ళి యొకనిని దేవతెలుకులవాని యింటికడ నొకనిని కనబఱుప నెంతయు విషాదాక్రాంతమనస్కుఁడై వారలకు తైలాభ్యంగనములు గావింపించి వారలను తనవెంటఁబెట్టుకొని తొలుతటి యత్తవారియూరునకేసి పోవుచుండెను.

అట్లు పోవఁబోవ మార్గమధ్యమున నొక తోఁటలో గుడారములు వేసికొని తన నలుగురు భార్యలు తనకుఁ బరిచర్యసేయుచుండ వారలతో వచ్చిన నౌకరులు దాసీజనము సేవలుసేయుచుండ తన తమ్ములను చేరఁదీసి వారలకుఁ గావలసిన భోజనభాజనముల సమకూర్చి యిట్లనియె:—"తమ్ములారా నేఁటికి మనము ధన్యులమయితిమి. చెట్టు, పిట్ట దొరకినవి. ఇఁక మనయత్తవారింటికిఁ బోయి భార్యలను వెంటబెట్టుకొని మనము మనరాజధానికి బోవుదము. పోయి మన యమ్మకు చెట్టు-పిట్ట కనబఱచి నాయనగారియందునామెకుఁగల కోపమును దీర్చి బాబయ్యగారి యాజ్ఞానువర్తులమై మనరాజ్యమును మన మేలుకొనుచు సుఖంబున నుందము. ఇక నాలుగయిదుదినములలో మనదేశమును మనము చేరఁగలము. సమీపములో నున్నాము." అనుటయు తమ్ములు "అన్నయ్యా! నమస్కారము. చెట్టు పిట్ట నొక్కసారి మాకు చూపవా? మేమునుచూచి యానందింపఁ గుతూహలులమై యున్నారము. నీవు సాధించుకొని రాఁబట్టె మా ప్రాణములు

దక్కినవి. లేనియెడల మేము ప్రాణములు విడువవలసినవారమే. బొబయ్య గారికి, మనయమ్మలిద్దఱికి పనికివచ్చునట్టి ఆనందదాయకుఁడవైనట్టి కుమారుఁడవు నీవొక్కఁడవే. మేము జీవన్మృతులము. అమ్మకడుపున బుట్టియు బుట్టనివారమేను. తల్లికోరిక నెరవేర్పఁజాలని యసమర్థులము. నప్రయోజకులము నగు మేము బ్రతికియుండి యున్నంతమాత్రమునఁ బ్రయోజనమేమి? శ్లో॥ "ఏకోపి గుణవాన్ పుత్రో నిర్గుణేన శతైరపి ఏకచంద్రప్రకాశేన నక్షత్రైః కింప్రయోజనమ్" అన్నట్లు గుణవంతుఁడగు నొక్కకొమారుడు నీవంటివాఁడు జీవించుటేజీవించుట. చంద్రుఁడు ప్రకాశమానుఁడైయుండ నక్షత్రములతో నేమి? మాబ్రతుకు నిరర్థకము" అనితమ్ముదామే నిందించుకొనుచుండ తమ్ములంగని పెద్దభార్యకొడు కిట్లనియె. "తమ్ములారా! మీరట్లు తలంపజనదు. నేను మీరు నొక్కటియేగదా? ఒకేదీపము మూఁడువత్తుల వెలుఁగుచున్నది. ఫలములు వేఱుగాని మనతేజస్సొకటియే. ఇందావంతయు సందియము లేదు. నేను సాధించిన నది మీరు సాధించినట్లు గాదా? రాజసభలో మీరే తెచ్చితిరని చెప్పుదము. ఖిన్నపడవలదు. నేను నట్లె వెల్లడిసేతును." అనిచెప్పి తమ్ములనోదార్చి భార్యలతో నాసంగతి జెప్పెను. వారెంతయు వలదని పట్టుబట్టిరి. తమ్ములపైఁగల గాఢానురాగముచే భార్యలు వలదన్నను వారిమాటలు సరకుసేయక త్రోసిపుచ్చి తమ్ములకు చెట్టు-పిట్ట చూపుటకు సిద్ధపడినవాఁడయ్యెను. రాఁగలవిపత్తును వారు గ్రహించి వలదువలదని మిక్కిలిగ భర్తను మందలించిరి. అట్లు ప్రియురాండ్రు కఠినముగ మందలించినను పెడచెవిని బెట్టి తమ్ముల కవి చూపక తప్పదని చెప్పి వారిని బిలిచి బలవంతబెట్టి కూర్చుండబెట్టి తమ్ములకు చెట్టు-పిట్ట చూపించి మరల నెప్పటివలె వారలను భార్యలుగఁ జేసికొనెను. తమ్ములు నది గని కడుసంతసించిరి. కాని యది కనినప్పటినుండియు వారల మనస్సులలో నీని నెట్లయినఁ సాధించి, యానలుగురు భార్యలనుగూడ తాము స్వీకరించి తలిదండ్రులకడకేగి యవి తాము తెచ్చినట్లుగాఁ జూప నాశపడిరి. ఇదియె వారలమనస్సులందలి పెద్దకోరికయైయుండెను. దానిని సాధించు యత్నము వారు సలుపుచు సమయమున కెదురుచూచుచుండిరి.

అంతవారు బైలుదేరిమఱి రెండుదినములకు తమయత్తవారిండ్లకుఁ బోయి భార్యలను కలుసుకొనిరి. తమ్ములును తమ యేకైకకళత్రము లను గలిసికొనిరి. అన్నగారు తననలుగురుభార్యలను మొదటిభార్యకు గనఁబఱుచఁగానె యామె యానలుగురిని తనచెల్లెండ్రనలె భావించి యాలింగనాగములఁ గావించి తనతోడ నంతఃపురమునకుఁ దోడ్కొని పోయెను. వారునుతమభర్తకు నగ్రమహిషియగు నామెకు నమస్కరించిన వారై బహువినయముగా "అక్కా! నీకు మేము దాసీలము. నీసేవయే మేముసేయఁగోరుచున్నాము. పతిశుశ్రూష నీవు సేయుచుండుము. నీవు పంచినపనులు సేయుచు నీవిచ్చినబట్టలు కట్టుచు పెట్టినకూడు దినుచు నీసేవ యేమఱక సేయుచుందుము. నీయనుమతి లేనిది మగనియొద్దకు మేము పోవువారము కాము." అని యనేకవిధములుగా వినయవాక్కు లాడిన నామెయు వారలనతిప్రేమతో గారవించి "నాచెల్లెండ్రిద్దఱకన్న పెద్దవారగు ముద్దుచెల్లెండ్రు మీరే. పెద్దదానననని, అగ్రమహిషినని నాయందు మీరుగౌరవముంచి దీనాలాపములాడినను నేనొప్పుకొనను. భర్తగారికి మీరే ప్రియభార్యలై వర్తింపుఁడు. పెద్దవారు పిన్నవారిని సుఖపెట్టవలెను. పెద్దవారు గృహకృత్యములఁ జూచుకొనుటయు, చిన్న వారు గృహస్థధర్మముల ననుభవించి సుఖించుటయు, లోకైకధర్మము గాన నేను రాజకీయ వ్యాపారమంతయు చక్క పెట్టుకొనియెదను. మీరు భర్తగారితో నంతఃపురమున మీ యిష్టమువచ్చినంతకాలము సుఖముగా నుండుడు. మీకు వలయు భోజన భాజనాది సామగ్రి యంతయు నే సమకూర్చెదను." ఇట్లనివచించెను. వారయిదుగురు పరస్పరాలాపముల నెంతయుసంతసించి తమశుద్ధాంతమున నుండిరి. అన్నదమ్ములు ముగ్గురును మామగారికిని, నత్తగారికిని కనులపండువుగాఁ గొంతకాలమచ్చటనుండి యనంతరమొకనాఁడు మామగారి యొద్ద సెలవుపుచ్చుకొని తమభార్యలతో మామగారిచ్చిన దాసదాసీ జనముతో, రథకనకవస్తువాహనచయముతో గజసైనికాది పరివారముతో భూషణాంబరాదులతో బైలుదేరి మహావైభవముతో తమదేశమునకుఁ బోవుచుండిరి. అట్లు పోవుచు తమయూరిసమీపమున నున్న యేఱుదాఁటుటకు నావలుకుదుర్చుకొని "యీఁడువారందఱు నొక

నావయు మగవారందరు నొకనావయు నెక్కవలెను. తక్కిన సైనికులందఱు నదేక్రమమున నితరనావల నెక్కవలె" నని యేర్పఱచి తమ్ములను భార్యలనేడుగురి నొకనావపై నెక్కించి తమరుమువ్వురు నొకనావ నెక్కి యట్లువారెక్కిన నావలు రెండును సమానముగా నొకదాని వెంట నొకటిగాపోవలెనని కట్టుదిట్టముచేసి యేటినడుమకుపోవుసరికి పెద్దభార్యకొడుకు తమ్ములఁజూచి "తమ్ములారా ! నాకు లఘుశంక కనుమానమగుచున్నది. నే నీపడవయంచునఁ గూర్చుండి మూత్రవిసర్జనము సేతును. నన్ను మీరు పడకుండఁ బట్టుకొందురా" యని యడుగ వారు మహాసంతోషముతో తమకోరిక నెఱవేఱినదని మనస్సులో నుప్పొంగి యట్లేసేయుదుమని యతనిని బట్టుకొని నట్టేపట్టుకొని నీటిలోత్రోసి వేసిరి. అదిచూచి నాగకన్యకలు నలుగురును నాతని భార్యయు దిగులుచెంది రోదనముసేయుచు నావలనాఁపి యాతనిఁ దీయించుఁడని యెంతవేఁడినను వారలమాటలు సరకుసేయక మఱింత వేగముగా పడవలను తెడ్లువేసి నడిపి యొడ్డుచేర్చిరి. అంత పెద్దభార్య కొడుకు పూర్వము తానొక మండూకరాజున కుపకారముసేసి వాని వలన వరమునొందియున్నవాఁడుగావున "మండూకరాజా" యని తలంచుకొనెను. తలంచినమాత్రమున నడుగునుండి యొకబల్లకట్టు పేర్చిన రీతిని కప్ప లొకదానినంటియొకటి బల్లకట్టులాగున, లేక రాతిచప్టాలాగున, కూడుకొని పైకి లేచి రాకొమరు నందుపై గూర్చుండఁ బెట్టుకొని తానువిడిచిన పడవలకన్న ముందుగా నొడ్డునకుఁ జేర్చి యాయనసెలవు గైకొని పోయెను. తమ్ముల పడవలుచింతవనములు దరిజేరుసరికి నక్కడ కాచియున్న యన్నను జూచి తలచినదొకటి, జరిగినదొకటియని తమ్ములిద్దఱు భయసంభ్రమంబులు జెంది సిగ్గుపడి చిన్నపుచ్చుకొని చేతులురెండు జోడించి సాగిలపడి దండము వెట్టి యన్నతో నిట్లువిన్నవింపఁ దొడఁగిరి.— "అన్నయ్యా ! మేము నిర్దోషులము. గాలికి పడవకదిలినది. మేము భయపడితిమి. అంత చేతిపట్లు విడిపోయినవి. కాని మేము మిమ్ము బుద్ధిపూర్వకముగా జలములోత్రోసివేయవలెనని త్రోసినవారము గాము. భగవంతుఁడె సాక్షి" యని దొంగప్రమాణము చేసిరి. అన్నయు వారల నాలింగనముజేసి

కొని "నాయనలారా! మీదోషమేమియు లేదు. "జ్ఞాతిశ్చే దనలేనకి" మ్మనెడి యార్యోక్తిమీరెఱుఁగరా? ఇది జ్ఞాతిత్వదోషముగాని మీదోషముగాదు. ఇంతకును నేను బ్రతికియుండి మీకన్నముందే దరికి జేరితిని. ఇఁక మనపట్టణము చేరుకొందము. లెండు" అని కానుపించుచున్న తమపురమునకు బైలుదేరి వారివారికిఁ దగినవైభవములతోడను తమతమ భార్యలతోడను వారు పోయిరి. రాజాంతఃపురమునకు చిన్నభార్య కొడుకులిద్దఱును తల్లిగారున్న యరణ్యమునకు పెద్దభార్య కుమారుఁడును జనిరి.

చిన్నభార్య దేశాటనముచేసివచ్చిన బిడ్డల నిద్దఱిని చేరఁదీసికొని యాలింగనముసేసి సిగదువ్వి చుంచు ముద్దాడి "నాయనలారా! ఎంత శ్రమపడితిరో! యెన్నికష్టముల నోర్చితిరో యింతకును కన్యాయోగమున్నదిగనుక కోడండ్రను దీసికొనివచ్చితిరి. ఇల్లు నిండినకోడండ్రు నాకుఁగద లభించిరి." అని కడుంగడుసంతసించి మఱియు "అన్నయ్య యెక్కడ? నాయనలారా! వాఁడును మీతోకలిసివచ్చెనా? లేదా వాఁడును మీరును నెంతదూరమునఁ గలసికొంటిరి? తుదకు చెట్టుపిట్ట, నెవరు సాధించిరి?" అని కొడుకుల నడుగ తల్లికి పూసగుచ్చినట్లు జరిగినది జరిగినట్లు యావద్వృత్తాంతమును జెప్పి, పిమ్మట తాము గావించిన పొరపాటుగూడా తల్లికివిన్నవించిరి. "అమ్మా! మేము వ్యర్థులము. నీకడుపున మేము జనించుట నీకు గర్భభారముమాత్రము కలిగించుట. సుఖమేమాత్రమును మావలన నీకుఁ గలుగఁదయ్యె. తొలిజన్మమున మోఁతకూలి బాకీయుండి మమ్ములను నవమాసములుమోసి కంటివిగాని, కొడుకన్న అన్నయ్యయే నీకు కొడుకు. అతఁడు నిన్నును బాబయ్యగారిని కూడా యిహలోకమున సకలసౌఖ్యములతో తులఁదూఁగువారలనుగాఁ జేసి తుదకు పున్నామనరకమునుండి మిమ్ముద్ధరించును. ఇఁకనయినను నీవు మాపెద్దతల్లిపై కోపము మాని యామెను బాబయ్యగారితోఁజెప్పి యంతిపురికిఁ బిలిపించుము. ఆమె మాకేకాదు పెద్దది నీకును మాతృప్రాయురాలు. నీకననేల? ఆమె లోకమాత యని చెప్పఁజెల్లును. సాక్షాత్తు సీతాదేవివలె వనవాసము సేయుచున్నది. ఆంజనేయులు సీతాదేవికి పుత్త్రప్రాయుఁడైపుట్టె. నీకన్న

నెక్కువప్రేమయామెకాతనియందుఁ గలదనుటకుపట్టాభిషేకకాలమున భర్త తనకిచ్చిన ముత్యాలహారమతనికిచ్చుటయె నిదర్శనము అట్టిపుత్ర సమానుఁడగు నాంజనేయులు సీతాదేవికి దుఃఖోపశమనము నాఁడు చేసినట్లు రెండవయాంజనేయులన నట్టిపరాక్రమముతోడను భక్తిజ్ఞాన వైరాగ్యములతోడను వినయాది సద్గుణములతోడను మాయన్న మ్యా మాపిద్దమ్మకడుపునఁ బుట్టి యామెకు దుఃఖశాంతి గలుగఁజేయు చున్నాఁడు. కనుక నీవు తక్షణము యాయమ్మను బిలిపించినఁగాని మేము నీయొద్ద నుండఁజాలము. ఆమెయొద్దకే పోవుదుము" అనిచెప్పిరి. ఇట్లు సుతులెంతచెప్పినను వారిమాటలను తల్లి పెడచెవిని బెట్టి "మంచిది! మీబాబయ్యగారితో నాలోచించి యేర్పాటుగావింతును. మీరు మీమీవిడిదెలకు పొం"డని యూరకుండెను.

పెద్దభార్యకొడుకు తల్లియొద్దకుఁబోయి తల్లికి సాష్టాంగదండ ప్రణామంబు గావించి తనయైదుగురుభార్యలను క్రమముగా తల్లికి నివేదించెను. మన్మధుని పంచబాణములవలెనున్న యైదుగురుకోడండ్ర నామె గ్రుచ్చి కౌఁగిలించుకొని వారిమ్రొక్కుల గైకొని దీవించి తన మేడువారాలనగలు వారల కిచ్చి తాను ధరియించునట్టి కనకాంబర ములు వారలకిచ్చి యత్తవారింటినుంచి తనయుఁడు తెచ్చిన యరణములఁ దీసికొని దాసదాసీజనమును చేరఁబిల్చి వారలకు భోజన మజ్జనాదుల సమకూర్పఁజేసి రథగజతురగాది రాజలాంఛనములఁ దెచ్చిన సుతుని ముద్దాడి "నాయనా! యెంత శ్రమపడితివో నీకై నేను నోచిననో ములు ఫలించె.

సలక్షణముగా రాజశీవితో రాజవై మరల నాకంటఁ బడితివి" అని యనుతల్లికి జరిగిన యావత్తుచరిత్రము జెప్పి తల్లియొద్ద సెలవుగై కొని యా సాయంకాలము బాబయ్యగారి యాస్థానమున చెట్టు పిట్ట చూపింప నేగెను.

ఇంతలో చిన్నభార్యకొడుకులు తమ తల్లితో నెంతచెప్పినను విని యామె యూరకుండుటచే నామెతో "అమ్మా! నీకు మాహితో క్తులు రుచించినవిగావు. నీమాట నీవు దక్కించుకొనలేకపోతివి నిన్ను రాజ్యమునుండి పాఱదోలుట కామెకు హక్కుగలదు. ఆమె యగ్ర

మహిషి. ఆమెసుతుఁడు రాజ్యానికర్హుఁడు. ఇంతకు చెట్టు-పిట్ట వాఁడు తెచ్చినయెడల రాజ్యమంతయు వానికే యిచ్చెదనని బాబయ్యగారనిరి. వారుమాత్రము తెలియక యనినారా? ఏది యేలాగయినను వానిదే రాజ్యము గనుకను, వాని నారాధింపఁగలమని తాము నమ్మిరిగనుకను బాబయ్యగారు రాజ్యమంతయు నిచ్చెదమనిరి. ఇంతకు చెట్టు-పిట్ట తెచ్చినవాఁడు ఈ సాయంకాలము నీవు చూడఁగలవు. ఇంతకును నీవు మమ్ముల తూలనాడి బైలువెడలించి పంపినదిమొదలుకొని యీనిమే షమువఱకు మాయన్నయే మమ్ము సర్వవిధముల కన్నతల్లివలెఁ గాఁ పాడెను. అట్టి లోకోత్తర చరిత్రుఁడిప్పుడు మమ్ము విడనాడునా? గనుక మే మిప్పుడేపోయి వానిశరణుపొందెదము." అని చెప్పి తల్లివల దని వారించుచున్నను వినక యరణ్యమునకు వచ్చి ముందుగా తమ భార్యలను పెదతల్లి కాళ్లపయిని బడవైచి తా మామెయంఘ్రిసరసీ రుహములకు తమ శిరంబులు తగులునట్లుగా సాష్టాంగపడి నమస్క రించి "అమ్మా! అన్నయ్య పెద్దకొడుకు మేమిద్దఱము చిన్నకొడుకులము నీవే మాకు తలివి మమ్ము నీటముంచినను పాలముంచినను నీదేభా రము. రాజ్యలక్ష్మివి నీవు ఇంతవఱకు మేము బాలురమగుట నేరకుం టిమి. ఇప్పుడుమాకు జ్ఞానమువచ్చినది. నీపాదములంబట్టితిమి. అన్నయ్య శరణు జొచ్చితిమి. రేపటినుండి నీవురాజమందిరమునకుండి మాయమ్మ నిటకే యరణ్యమునకుఁ బంపి నీమూఁడుపోలల మొక్కజొన్నలామెకు నీవు దాసిచేతఁ బంపుచుండుము బాబయ్యగారి మూర్ఖత మాన్పి వారిని క్షమింపుము. అన్నయ్యాయు మేమును మాభార్యలగు నీ కోడండ్రును సర్వదా నీసేవసేయుచుందుము. మాకు హితోక్తులుగఱపుచు అన్న య్యకు మేమిరుగురము చెరియొకవైపున నిలిచి యుండి చామరములు వీచుచుండఁగా నాతని సింహాసనాసీనుంజేసి యతనిచే రాజ్యమేలిం పుము. బాబయ్యగారి కిఁక సింహాసనాధికారము లేదు." అని యనేక విధముల ప్రార్థించుచు వచ్చి పెద్దభార్యయొక్కయు అన్నయొక్కయు కాళ్లమీఁదఁబడి లేవకుండిరి. అంత నాతల్లియును కుమారుఁడును వారల నోదార్చి లేవనెత్తి యందఱు మజ్జనభోజనాదులొనర్చి సుఖ ముగానుండిరి. పెద్దభార్యయు చిన్నభార్యకొడుకులనుజూచి "నాయన

లారా ! మీరు వచ్చితిరి. నాకు సంతోషమయ్యె. కాని మీరు కన్న తల్లిని విడువఁగూడదు. "న గాయత్ర్యాః పరం మంత్రం న మాతుః పరదేవతా" యన్నది మీ రెఱుఁగరా? ఎంత దుర్గుణవతియైనను తల్లి తల్లియే మీ రామెను విడిచివచ్చుట తప్పు. మీరన్నటుల నెటులయిన నను మీరు నాతనయులే. చిన్నది యగుటచే మీయమ్మకు భేదముం డునుగాని పెద్దదాననగుటచే నాచెల్లెండ్రు (సవతులు) కన్నబిడ్డలందఱు నాబిడ్డలే. నాకు మీయన్నయం దెంతప్రేమయుండునో యంతకన్న నెక్కువప్రేమ మీయందు నుండును. అయినను మీరు మాత్రము మీయమ్మను విడనాడక యామెయొద్దనుండి యామెకు విధేయులరై యామెను సంతసపఱచుచుండి నాదగ్గఱకు వచ్చుచుండవలెను. ఆమెను సంతోషపెట్టుట నన్ను సంతోషపెట్టుట భేదభావము వీడుఁడు. ఒక వేళ నామెపై మీకిష్టములేనియెడల దినమున కొకసారియైన నామె పాదములకు నమస్కరించి మఱి రావలయును." అని యనేకవిధంబుల బోధించి వారలను తల్లియొద్దకుఁ బంపఁ బ్రయత్నించెనుగాని వారు "నీవే మాతల్లివి ఆమె మాతల్లిగాదు." అని పట్టుబట్టి పోవనొల్లరయిరి.

అంత సాయంసమయమగుటయు పెద్దభార్యకొడుకు చెట్టును-పిట్టను జూపింతు రమ్మని పురజనులందఱిని బిలువఁబంపి పట్నమునం దంతటను దండోరావేయించి తండ్రియొద్దకు తన ప్రధానమంత్రి (నత్త వారిచ్చినవానిని) బంపి "సభాస్థానమున నెత్తుగా నొకరంగస్థానమువలె నేర్పఱచి తెరలుగట్టింపుఁడు వాని నన్నిటి నలంకరింపుఁడు" అని రాయ బారమంపి తానుతల్లికడ సెలవుగైకొని తమ్ములతోను భార్యలుతోను సభాస్థానమునకుఁ బోయి అంతకుముందే తండ్రివలన నన్నియు సర్వసి ద్ధములుగాఁ జేయఁబడిన యామెత్తైన స్థలమున తెరచాటున—నుం డెను. రాజును మంత్రులును సామంతాదిపురజనులును విచ్చేసి తమ తమస్థానముల నలంకరించి యుండిరి. రాజు రెండవభార్య తనకై యేర్ప ఱచిన రహస్యస్థానమున నుండి చూచుచుండెను.

అప్పుడు పెద్దభార్యకొడుకు తెరచాటుననుండి వయికివచ్చి "నేఁ దెచ్చిన చెట్టును-పిట్టను మీరందఱిప్పుడె చూచి యానందింపఁ గలరు." అనిచెప్పి లోనికిఁబోయి తమ్ములిద్దఱును తనతోడనే యుండి

చూచుచుండగా భార్యలఁ గూర్చుండఁబెట్టి దుప్పటిమూసి వచ్చని యక్షతలు పైఁజల్లి తాను తెరయెత్తెను. అప్పుడు దుప్పటిముసుఁగు దీయుమని తమ్ములతోఁ జెప్పి వారల నచటనుంచి తాను బైటవచ్చి తెరయెత్తి "యవిగో! చూడుఁడు" అనునంతలో తమ్ములు దుప్పటిము సుఁగు దెఱచిరి. చెట్టు-పిట్ట యెల్లరకు స్పష్టముగాఁ గనఁబడినవి. అప్పు డు పెద్దభార్యకొడుకు సభాసదులవైపు చూడ్కి నిగుడించి "సభాసదు లారా! ఇది నాసాపత్నిమాత స్వప్నమునఁ గన్నది ఆమెను నాతండ్రి పొరపాటున లేపినందుకు తనకు నిద్రాభంగమైనదని తానుస్వప్నమున జూచిన వస్తువును ప్రత్యక్షముగాఁ జూపుమనియు, నట్లు చూపవేని ప్రాణత్యాగము గావించుకొందుననియు చెప్పినందున నాతండ్రిగారు పట్టణమంతటను చాటించి యవి తెచ్చినవాని కర్ధరాజ్యమిత్తునని వచించిరి. అదివిని వారిజ్యేష్ఠపుత్రుఁడనుగనుక నేఁ దెచ్చెదనని సిద్ధప డితిని. అప్పటికిని నాతండ్రిగారికి నాసాపత్నీమాతపైగల మోహాతి శయమున నామెవలలోఁజిక్కి మాయమ్మ నడవికిఁ బంపి యామెకు మూఁడుసోలలు మొక్క జొన్నలు బత్తెమునిప్పించుచున్న స్థితిలో నేనును నాతమ్ము లిరువురును తండ్రిగారు తపముగావించి తెచ్చినట్టి సంతానప్రదంబగు ఫలమున మాతల్లులకడుపునఁ బుట్టినవారమైనను నాపుట్టువు మాతండ్రిగారికి నమ్మకములేక తిరస్కారభావముగా నేనే తెచ్చినయెడల రాజ్యమంతయు నిచ్చెదమని చెప్పిరి. పితృవాక్యపరి పాలనము నాకు విధిగనుక నాతమ్ములను వెంటఁబెట్టుకొని పోయి సాధించి తెచ్చితిని అదిగో నాతమ్ములు చెట్టును గాచియుండిరి. ఇది మేము ముగ్గురము కలిసి తెచ్చినదే అయినను పెద్దవాఁడను గనుక తెచ్చినవాఁడను నేనే యగుదును ఇఁక రాజ్యము విషయములో నా తండ్రిగారిచ్చినను నియ్యకపోయినను వారి యనంతరము రాజ్యము నాదేను ఏమన జ్యేష్ఠవారసుడఁను నేను..................... నాతమ్ములు యువరాజులుప్రకృతమున నాతండ్రిగారి జీవితకాలములో నేనెట్లు రాజ్యపరిపాలనము సేయుదును? కాన వారే రాజ్యభారము వహింతురుగాక! నేను యువరాజునై తమ్ములను నాచెప్పుచేతలలోఁ ద్రిప్పుకొనుచు రాజ్యభారమును తండ్రిగారితో కనిపెట్టుచుందును.

నాయొక్క విజ్ఞాపనము మాతండ్రిగారికిని నాసాపత్నీమాత శ్రీగారికిని చేసికొనుచున్నవాఁడను. లోకములో సుతులకు కన్నతల్లికన్న సవతితల్లియే యెక్కువైనది. ఇది శాస్త్రసమ్మతముగాని నేనన్నమాట గాదు. కనుక నేనే నాసవతితల్లికి కన్నకొడుకును. ఆమెయే నన్ను కన్నతల్లి కనుక నాతండ్రిగారును నాతల్లియు నాయందలిప్రేమచే రాజ్యలక్ష్మియగు మాయమ్మపయిన నాగ్రహము శాంతించు. మఱి వారి కామెపొత్తుతో నిమిత్తములేకపోయినను నాతోపాటు నాగృహమున నాభార్యలచే శుశ్రూష పొందుచుండును గాక! అట్లని నాభార్య నాసవతితల్లి ననాదరణసేయదు. ముందుగా నామెసేవ సేసిన పిమ్మట సవితితల్లిసేవ సేతురు ఇదియ నాప్రార్థన.'' అని మేఘగంభీరనినదంబున వాక్రుచ్చెను.

యదివిని యందఱు పక్కన నవ్విరి. రాజునిశ్చేష్టితుఁడై చిన్నభార్యయొద్దకుఁ బోయి చూచెను. ఆమెకు సిగ్గుచేత సవతికొడుకాడినట్టి సశాస్త్రయుక్తిహితభూతములగుమాటలు చెవులు సోకినతోడనే నివ్వెరపాటుతో యేమిదోచనట్టి స్థితిలోనుండి రాజు దగ్గఱకురాఁగానే తెలివి దెచ్చుకొని తక్షణము మాయక్కను బిలిపింపుఁడు. ఆమెపాదములకు మ్రొక్కి నాతప్పు మన్నింపుమని ప్రార్థించి యామెచేమన్నించితినవుఱకు నేనిట్లుండెదను. చెట్టు-పిట్టయు నక్కెయుండవలెను. మాయక్క నాయొద్దనుండి చూచి తమకొమరుని నాఁకొడుకులను తానే సంరక్షింతునని నాచేతిలో చేయివైచి చెప్పవఱకు నే లేవను.'' అని భర్తను బలవంతపెట్టి తక్షణమే యేవిమెట్లున్నదో యట్లె సభాస్థలము౯డగా రాజ్యలక్ష్మియగు పెద్దభార్యను పిలిపించి "అక్కా! యీపాపాత్మురాలిని రక్షింపుము. రక్షింపుము రక్షింపుము."అనిముమ్మాఱు పలికి కాళ్ళపైఁబడిలేవకున్న నామె లేవనెత్తి "చెల్లెలా! నీవుచిన్నదానవు నేను పెద్దదానను. నీపయి నాకుఁ గోపమేల? నీయంతట నీవే బుద్ధి వచ్చి మళ్లుకొందువని నే నింతకాలమోర్చియుంటిని. అటులే నేఁటికి కాలగతి సమకూడినది. చిన్నదానవగుటచే నీ కెరుసుండవచ్చును. గాని, పెద్దదాన నగుటచేతను, అగ్రమహిషినగుటచేతను, భర్తయొక్కయర్ధాంగిని తొలుత నేనేయగుటచేతను, రా జెందఱుభార్యలుండెదఱు

కొడుకులం గన్నను వారియందఱిమీఁదను రాజునకుసమానప్రేమయే యుండును. అటువలెనే రాజాగ్రమహిషికిఁగూడ నుండవలెను. అట్లు లేకున్న రాజ్యలక్ష్మి యనిపించుకొనదు. గనుక వెఱ్ఱిదానా! నీబిడ్డలు నాబిడ్డలనుభేదము నీకుండవలెను గాని, నాకన్ననో వీరుముగ్గురును సమానులే. కనుక వెఱ్ఱితనముమాని యంతిపురమునకుబొమ్ము." అను నంతలో నీవును నేనును నొక్కచోటనే యుందము. నీసేవ నేను సేతును. నీవు వారిసేవసేయుము. బిడ్డలుముగ్గురు మనకనువర్తులైయువ రాజపదవియందు పెద్దవాఁడుండ తమ్ములు వానివశవర్తులై యుందురు. ఇట్లిద్దఱు ననుకొనుచుండుసమయమున రాజులేచి పెద్దగొంతుకతో "సభాసదులారా! నాకొడుకునకుఁగల బుద్ధినాకులేకపోయెను. నేను కామాంధుఁడను స్త్రీలోలుఁడను "పుత్రాదిచ్ఛేత్పరాజయ" మ్మనునటుల నాకొడుకునకు నేను పూర్ణముగ నోడితిని. ఇఁక దేహబలమువిషయమై వేఱ చెప్పనేల? నాఁడు తరుణవయస్కుఁడు నేను వృద్ధుఁడను. ఈరాజ్యమువానిదిగాని నాదికాదు. అయినను నాయందలి పితృభక్తిచే నేనుండఁగాఁ దాను సింహాసన మధిష్ఠించుట కిష్టపడనందున వానికీక్షణమున యువరాజ్యపదవి నిచ్చితిని. వాని తమ్ములు వానికి కింకరులై మెలఁగుదురు."

అనిచెప్పి తక్షణమే కుమారునికి యువరాజ పట్టాభిషేకము చేసెను. అంత పెద్దభార్యకొడుకు తనభార్యల నెప్పటియట్ల స్వేతాక్షతలు ప్రోక్షించి భార్యలుగాఁ జేసికొని తల్లులిద్దఱిని భార్యలను దోడ్కొని తండ్రితోయంతఃపురమునకేగి తమ్ములువశులైతనయాజ్ఞానువర్తులై విశేషభక్తితాత్పర్యములతోనుండ వారలకు వలయు సమస్త పదార్థముల నొసఁగి మన్నించుచు తండ్రిగారున్నంతకాలము తాను యువరాజయి తండ్రియనంతరము తానురాజై సవతితల్లిని యామెబిడ్డలనుతనతల్లి సోదరులుగా భావించి చిన్నభార్య పెద్దకొడుకును యువరాజుగానియమించి సమస్తసౌఖ్యసంపదలతో దులదూఁగుచు పరిపాలనము జనరంజకముగా జేయుచు సుఖంబుండె.

—(౦)—



శ్రీరస్తు-శ్రీశారదాంబాయైనమః.

శ్రీ మ ద్ర మా ర మ ణ ప ర బ్ర హ్మ ణే న మః.

# అపూర్వ మనోహర చిత్రకథలు.

## రెండవకథ.

### మంత్రికుమారుఁడు—రాజకుమార్తెకథ.

ఒకపట్టణమున నొకరాజుకలఁడు. అతనికొకకుమార్తెయు నతని మంత్రికొక కుమారుఁడునుండెను. రాజును, మంత్రియు నేకక్షత్రియ కులస్థులు. రాజకుమార్తెయు, మంత్రికుమారుఁడును వయస్సున సమానులై యొకగురువునొద్దనే విద్యాభ్యాసము చేయుచుండిరి. ఒకరి యందొకరు మిక్కిలియనురాగముగలవారై విద్యయందు సైతమొకరి కొకరీడుతీయక సమానముగాఁ జరుగుచుండిరి. వీరు ప్రతిపూటను బాఠశాలకుఁబోయి చదువుకొనివచ్చుచుండుమార్గమున నొకనాడొక బ్రాహ్మణుఁడు తనభార్యనులోపలినుండిజుట్టుపట్టుకొనిబయిటికీడ్చుకొని వచ్చియరుగుప్రక్కనున్నపంచక్రిందఁ బడవైచిపంచయొక్కపెండెబద్దలు చేతఁ బుచ్చుకొని యామెవీఁపుమీఁద చిందులుద్రొక్కుచుండెను. అది రాచకుమార్తెగని "పాపమాయాఁడుదానినిమగవాఁడేలయట్లుత్రొక్కు చున్నాఁ"డనెను. అనుటయు మంత్రికుమారుఁడు "భార్యను భర్త శిక్షింపకమానునా ? అది యేమితప్పుచేసినదో. లోకములో భార్యాభర్తలకిది నియతమే" యని బదులుచెప్పెను. అంత రాచకుమార్తె మంత్రికుమారునితో "భర్తకు హితవయినతీరునఁ దానుసంచరించి భర్తనుసంతోషపెట్టి యాతని మన్ననలఁ బడయవలెనుగాని యిట్లు భర్తచేత దెబ్బలుతినునట్టిభార్యయొద్దైనఁ గలదా?" యనెను. అందుకు మంత్రికుమారుఁ డిట్లువక్కాణించెను. "లోకములో నెట్టివారయినను గలరు. ఎప్పటికైన నీవుపెద్దదానవై యొకపురుషునికి భార్యవైన యప్పుడు నీపాట్లెట్లుండునో ? నీవెన్నిదెబ్బలు నీమగనివల్ల తిందువో"

అనుటయు నందులకు రాజకుమార్తె యిట్లు పల్కెను—"నేనే పెద్ద దాననైనపక్షమున నిన్నేవరించి వివాహమాడి నీమనస్సునకుఁ దగినట్లు సంచరించి నీమెప్పును, మన్ననుఁ బొందుదునుగాని యిటువలె దెబ్బలు కొట్టుటకవకాశమిత్తునా ?" అనెను. అందుపై మంత్రి కుమారుఁడు "వెఱ్ఱిదానా ! కడవయంత గుమ్మడికాయయు కత్తిపీటకు లోకువ యన్నట్లు భర్త కోపించి కొట్టిన భార్యయేమిచేయఁగలదు. ఏదేనియొక లేనిపోనికారణముకల్పించి కొట్టుచుండును. భార్యను భర్త కొట్టుచుం డుటలు మనహిందూజాతియందె గాని, తక్కినజాతులలో భర్తలు భార్యలనెంతో గౌరవముగాఁ జూతురు. భర్తలు భార్యలను కొట్టడము మన వాళ్లు చిన్నప్పటి నుండి యుగ్గుపాలతోఁ గూడ పిల్లలకు నేర్పుదురు. చంటిపిల్లల నాడించు నప్పుడు సైతము 'ఏదీ బాబూ ! నీపెండ్లాము నెట్లుకొట్టుదువో చూపుము' అని పిల్లవానిచేతి కొక రువ్వయిత్తురు. మరియు అత్తలు ఆడుబిడ్డలు లేని పోనికొండెములు జెప్పి భర్తలచే భార్యలనునూరక కొట్టించుచుండుదురు. పోనీ! ఇంత ప్రగల్భముగా బలుకుచున్నావు. నేనే నీకుభర్తనైతినా యేదో యొకమిష బెట్టి నిన్ను దండింతును. నీవేమిచేయఁగలవు ?" అనియెను. రాజకుమార్తెయు "మంచిది. చూతము. ఎప్పుడో జరుగు సంగతికిప్పుడు వితర్కింప నేల ?" యనెను. అంత నిద్దఱు నిండ్లకుఁ బోయిరి.

అంతఁ గొంతకాలమునకు రాజకొమార్తె యుక్తవయస్కురాలయ్యెను. తండ్రి యంతటినుండి బడికిపంపుట మాన్పించెను. ఇంటి యొద్దనే యొకగురునిచేత విద్య చెప్పించుచుండెను. కుమార్తెయు సకల విద్యాపారంగతయయ్యెను. తండ్రి కూతునకు వివాహము జేయనెంచి తగినవరునికొఱకు నన్వేషించుచుండెను. అదియెఱింగి కూతురు తండ్రిని సమీపించి యిట్లనియె. "నాయనగారూ ! నా వివాహవిషయమై మీరేల మిక్కిలి పరితపించెదరు ? కులగోత్రములకా తక్కువలేదు. ఐశ్వర్యమున కంతకంటెలోటులేదు. ఇఁక రాజ్యమా—మీకు నేనేక పుత్రికను. మీరాజ్యమునకు నేనేగదా వారసురాలను. వేయియేండ్ల కయినను మీయనంతర మీరాజ్యము నాదేగదా ! నాకు భర్తయెవ్వ రగుదురో వారే యీరాజ్యమునకు రాజయ్యెదరు. ఈ సింహాసనము

నెక్కి-వారే రాజ్యముసేయఁగలరు. కనుక మీరు లేనిపోని యాలో చనలుమాని మంత్రికుమారునికి నన్నిచ్చి వివాహముసేయుఁడు. నేనా తని నాచిన్న నాఁటంగోలె వరించియుంటిని. కులగోత్రములలోగాని, విద్యాధనములలోఁగాని యతని కిసుమంతయు లోపము లేదు. రూప వంతుఁడు. యౌవనవంతుఁడు. నామనసునకు నచ్చినవాఁడు. కనుక వేగమే వివాహముకానిండు.” అనెను. రాజును కూఁతు వచనములకు మాఱుమాటాడఁ జాలక వెంటనే యట్లు సేయనిశ్చయించి మంత్రిని బిలిపించి “మంచి ముహూర్తము పెట్టింపుఁడు. నీ కుమారునకు నా కూఁతునిచ్చి వివాహముగావించెదను” అనెను. మంత్రియు పట్టణము నలంకరింప నియమించెను. మంచిముహూర్తమున మంత్రికుమారునకు, రాజకుమార్తె నిచ్చి వివాహము చేసెను. వివాహానంతరము కంకణాల విసర్జనముసంబరమున దంపతులనిద్దఱిని పగటియందు జరుగవలసిన వైదికపుతంతు యావత్తుజరిగినపిమ్మట రాత్రితంతుకూడా జరిపి యొక గదిలో మంచముపయిఁ గూర్చుండఁబెట్టి మంగళ హారతులు పాడి ద్వంద్వతాంబూలములిప్పించి వారలనుగదిలోనుంచి తాము బైటికివచ్చి పేరంటాండ్రిందఱు గదితలుపులుమూసిరి. అంత భార్యా భర్తలిద్దఱు మన్మథవిలాసములలోఁ దులఁదూఁగుటకు మాఱుగా మంత్రికుమారుఁడు రాజకుమార్తెనుజూచి “నీవు నాకు నిజముగా భార్యవయితివి. భర్తకు భార్యలోఁబడినదని నీకు నేను మునుపు చెప్పియుంటినిగదా! ఇప్పుడు నిన్ను నేను చేతితోఁ గాదు. చెప్పుతోఁ గొట్టెద నేమిచేయఁ గలవు?” అనెను. అందులకామె “నాభార్యయందు నాకుస్వాతంత్ర్యము గలదు. నేనుకారణమున్నను లేకపోయినను పశువునుబాదినట్లు బాదు దు”నన్న నేనేమి ప్రత్యుత్తరమియ్యగలదానను “విద్యావిహీనపశుః” అన్నట్లు విద్యాగ్రంథమెఱుంగనిమూఢులట్లుసేతురుగానినీవంటివిద్యావం తులట్లుసేతురా! కారణముకనఁబఱుచుఁడు. దండించుఁడు. నాకేదోయొక పని స్త్రీకి గృహిణికినర్హమైనదిపురమాయించి యాపని నేనుచేయలేక పోయినప్పుడుగాని, ధర్మమునతిక్రమించినపుడుగాని, మీరు శిక్షింప వచ్చును. అందుకుపాత్రురాలనగుదును.” అని మిక్కి-లివినయముగావిన్న వించెనువిన్నవించుటయు మంత్రికుమారుఁ డిట్లుచెప్పెను. “సరే! నీకు

మూఁడుపనులు పురమాయింతును. ఆమూఁడుపనులు నీవు చక్కఁగా నెఱవేర్చినయెడల మెచ్చుకొని యంతటినుండి నీకే నేనుదాసుఁడనై నీ చెప్పుచేఁతలలోఁ దిరుగుచు, నిన్నే నా కులదైవముగా భావించుకొందును. చేయలేనియెడల మూఁడు చెప్పుదెబ్బలు కొట్టెదను. ఇదిగో! నీచెప్పిక్కడనే వ్రేలాడఁగట్టెదను." అనిచెప్పి నెరవేర్చవలసినపనుల నీ క్రింది విధముగాఁ జెప్పెను.

(1) అత్తగారియింటిసొమ్ము. పుట్టినింటివారిసొమ్ముగాక యితర సొమ్ముతో నేడంతస్థులమేడయొకటి మనయూరి బయటి మైదానముపైని కట్టింపవలెను.

(2) పాతివ్రత్యము చెడకుండ, నాతో సాంగత్యము లేకుండ, కొడుకును గనవలెను.

(3) నేనువరించిన చిన్నదానినితెచ్చి నాకు వివాహముసేయవలెను.

ఈమూఁడుపనులు నీవుసేయువఱకు నేనిచ్చటనుండను. దేశాంతరముపోయివచ్చెదను. నీవు రమ్మనిన నాఁటికి వచ్చెదను. అనిచెప్పి లేవఁ బోయెను. అంతనాచిన్నది చేయిఁబట్టి కూర్చుండఁబెట్టి "సరే! యీమూఁడుపనులు మూఁడుసంవత్సరములనాఁటికి సరిపెట్టి మీకు తెలిపెద. కాని, నాపాతివ్రత్యమునకు లోటురాలేదని మీకుఁ నిదర్శనముగా నిప్పుడు నేనొకపుష్పహారమును మీమెడలో వైతును. అది యెన్నటికి వాడక యది యేదినమున కాదినమె అప్పుడే తయారైన క్రొత్తదండవలెనుండును. అదివాడెనేని నాపాతివ్రత్యమునకు లోపము వచ్చినదనుకొనుఁడు." అనిచెప్పి తక్షణమె తానువెళ్ళి స్వయముగా నానాజాతి పుష్పములఁ దెచ్చి స్థూలమగు నొకపూదండగా గ్రుచ్చి భర్తమెడనువైచి యిఁక మీరు దయసేయుఁ"డనెను. నాఁటిరాత్రికి వారిద్దఱు నితరసంపర్కము లేక యాగాధతో నేప్పుదక్క య్యాగతులైరి. మఱునటిదినము మంత్రికుమారుఁడు తండ్రిగారియొద్దను మామగారి యొద్దను సెలవుదీసికొని వారల నొడఁబఱిచి ప్రయాణోన్ముఖుఁడయి వెడలిపోయెను. రాజకుమార్తెయు నత్తమామలకు, తల్లిదండ్రులకు తనమగఁడు తనయిష్టముపైననె ప్రయాణమై వెళ్లుచున్నాఁడనియు

తాముభయులుఁ దమలోదాము సంప్రతించుకొనియె యాప్రయా ణను సాగించితిమనియు చెప్పి యత్తవారియింటను పుట్టినింటివారిం టనుగూడ నుండుచుండెను.

మంత్రికుమారుఁ డట్లు జననీ జనకులయొద్దను, మామగారి యొద్దను సెలవుపుచ్చుకొని ప్రయాణమైపోయిపోయి యారామడల దూరమునఁ గల యొకరాజపట్టణమును బ్రవేశించెను. అందొక రమ్య మైన భవనమున బసచేసెను. కొందఱు భృత్యజనుల నేర్పఱచుకొనెను భృత్యులచే పనిపాటలు చేయించుకొనుచు వారికి ప్రతిమాసమును జీతమునిచ్చుచు పారితోషికముగగూడ కొంతసొమ్ము ధనముగ నిచ్చు చుండెను. భృత్యులును తమప్రభుని యాజ్ఞానువర్తులై వినయవిధేయ తల మెలంగుచుండిరి. ప్రతినిత్యము తాను రాజుకొలువునకుఁ బోవుచు వచ్చుచునుండెను.

అంత నాలుమాసములు గడిచెను. ఋతువులుమాఱినను మంత్రి కుమారునిమెడను రాజకుమార్తె వైచినపూలదండ వాడిపోకనొకేతీరున నాఁడు తయారుచేసినదిపోలె మనోజ్ఞమైపరిమళములవెదజల్లుచుండెను. అదిచూచిసభ్యులు రాజుతోనిట్లు విన్నవించిరి:—"మహారాజా ! యీ రాజకుమారునిమెడనున్న పూలదండ నవనవలాడుచు నేఁడు కట్టినట్లు న్నది. అకాలమున నందీ పుష్పము లీయన కెట్లు లభించినవో ? మనకుఁ గూడ దొరకిన బాగుండును." అని విన్నవించియాదండ వృత్తాంతము జెప్పుమని మంత్రికుమారునికోరిరి. మంత్రికుమారుఁడిట్లు చెప్పఁదొడం గెను. "రాజా ! సభ్యులారా ! ఇది మాయింటనుండి నేను బైలుదేరు నపుడు తొలినాటిరాత్రి నాభార్య తనపాతివ్రత్యప్రభావమున "నీదండ యెన్నటికి వాడ"దని చెప్పి నామెడలోవైచినది. ఇది యెన్నటికి నిట్లే యుండును. మఱెంత వన్నెదేఱుచుండునుగాని వాడదు." అని చెప్పెను. అదివిని రాజు తనమంత్రుల నిద్దఱ రహస్యముగాఁ బిలిచి "ఇతనిభార్య యొక్క మానభంగము గావించి మాయోపాయములఁ బన్ని యెట్ల యిన మీరొకొక్కసారి యామెతో భోగించి రండు. వలసినంత ధనము గొనిపొండు. ధనమునకు నసాధ్యమగుపని మఱియొకటి గలదా? పైసా లేనివాఁడు పరస్త్రీవర్జితుఁడు. పైసా చేతనుండిన పాచ్ఛాకూతురినైన

బొందవచ్చును. మనయొద్దకిని బిలిపించుకొనవచ్చును. పొండు. కార్యానుకూలము చేసికొని వేగముగా రండు" అనిచెప్పి వలయు ధనమును వస్తుసామగ్రి నిచ్చి పంపెను. అంత వారు మంత్రికుమారునివలనఁ దన యూరిపేరును. పోవలసినమార్గమును దెలిసికొని రత్నవర్తకుల వేషము వేసికొని కావలసినంత రత్నములసరకును బండ్లకొలఁది ధనమును వెంటఁదీసికొని బయలుదేరి పోయిరి.

అట్లా యిద్దఱుమంత్రులు బైలుదేఱి పోయిపోయి కొన్ని దినములకు మంత్రికుమారుని పట్టణమునుచేరి యూరికి సమీపమున డేరాలువేయించుకొని యందు రత్నసామగ్రిపరచి షరుషు చేసుకొని కూర్చుండిరి. అంత నాయూరి వారందఱు రత్న సరకులఁ జూచి మిక్కిలి యాశ్చర్యపడి యిది రాజులు కొనవలసిన విలువగలరత్నసరకులు గాని మనవంటిసామాన్యులు బీదసంసారులు కొనఁగలవి గావని మరలిపోవుచుండిరి. కొందఱుకొనలేన పోతిమిగాని చూచి యానందింపలేమా యని యాపటకుటీరములకుఁ జని నివ్వెఱపడి చూచి పోవుచుండిరి. అంత నత్తవారింటియందు కొన్నిదినములుండి పుట్టింటికివచ్చిన యారాజకొమార్తె యానోట.నానోటను దన దాసీలమూలమునను రత్నసరకులవ్యాపారస్థులరాకయు డేరాలునిర్మించికొని యందు రత్నరాసులు బోసి యమ్ముచుండుటయు మొదలుగాఁగల వృత్తాంతమునంతయు విని తనమనస్సులో "ఇది యత్తవారింటి, పుట్టినింటివారల సొమ్ముగాదు. వీరిచేత మేడనిర్మింపింతును." అనినిశ్చయించుకొని దాసీలనుబంపి రత్నములయొక్కయు, మంచి ముత్యములయొక్కయు కోవలు మచ్చు తెప్పించుకొని చూచుచుండెను. ఇట్లు దినదినము రకరకములు తెచ్చి చూపించుచుండ వాటిధరలనడిగి తెలిసికొనుచుండెను. రత్నవర్తకులును దాసీలతో "ఆమె యనుగ్రహమె మాకుఁ గావలెఁ,గాని ధనముతో నిమిత్తములేదు. ఆమెయనుగ్రహించెనా యదే మాకుధనము" అనిచెప్పుచు నీప్రకారముగా రాయబారపుమాటలు కొన్నిజరిపిరి. ఒకరోజున రాజకుమార్తెనౌకరులు వర్తకులుతో నిటు దేవిగారిమాటలుగా విన్నవించిరి. "మీ మనస్సులలోనున్న యభిప్రాయము మాయమ్మాజీ సర్కారువారు గ్రహించినారు.

ఇచ్చుట నొక యేడంతస్థులమేడఁ గట్టించి, దానియం దుండవలసిన గృహోపకరణములు, గదులు, ముస్తాబునకు వలయుబల్లలు, కురిచీలు మొదలగునవి సమకూర్చి పనిపూర్తియైన పిమ్మట నొకనాఁడు వారు స్వయముగావచ్చి చూచి మీయభిప్రాయము నెఱవేర్చెదరు." అని చెప్పుమనిరి. దాసీజనమట్లు నుడువఁగానే రత్నవర్తకులును వల్లెయని మనముల నుప్పొంగి పట్టరాని యానందంబున నొకటికి రెండుచొప్పున నిచ్చించి యొకని కిద్దరుపనివాండ్ర నియమించి కడుప్రయాసమున నాఱుమాసములు చనకమున్నె మేడపని పూర్తిచేసి రాజకుమార్తె వచ్చుటకుఁ బోవుటకుఁ దగినసవారులను, బోయీలను సిద్ధపఱిచిరి.

అట్లు సర్వము సిద్ధముకాఁగా నొకరోజునరాజకుమార్తె రాత్రికి తాను వచ్చునట్లుగాను సాంకేతిక స్థానము నియమించి యా గదిలో తమలో నొక్కరుగాని యుద్ద నుండఁగూడదనిచెప్పి పంపెను. వారటుఁ సర్వము సిద్ధముచేసిరి. వారిలో నొకఁ డొకగదిలో మంచము పై గూర్చుండియుండెను. రాజకుమార్తెయు తనదీపాలనాగిని ముస్తాబు చేసి పంపెను. అది వచ్చుసరికి నాగి రాఁగానే దాసీలురాకపోవుటచే దీపాలు బాగుగా వెలుఁగుటలేదని చెప్పెను. అంతనది తనవ్రేలితో దీప మెగసనద్రోచి యావ్రేలు తనబట్టకు రాచికొనెను. అదిచూచి "ఛీ! నీవు దాసిదానవుగాని యసలునాయికవుగావు పొమ్మనెను.

మఱునటిదినమున రెండవ వర్తకుఁడు సర్వాలంకారభూషితుఁడై సిద్ధముగా గదిలోఁ గూర్చుండియుండెను. రాజకుమార్తెయు మఱి యొక చెత్తలశంఖ నలంకరించి ముస్తాబుచేసి పంపెను. ఆవర్తకుఁడు చిన్నచిన్న కాగితపు తునుకలు చింపి యక్కడక్కడ చెదరఁ బాఱవైచి యది వచ్చుసరికి మంచముమీఁద గూర్చుండి యుండెను. "దాసీలు రాలేదా. చెత్త యెట్లుపడినదో చూడుము" అనెను. తక్షణమె యొక చీపురుదీసికొని బరబరతుడిచి చెత్తనొకమూలకుప్పబెట్టెను. అదిగాంచి వర్తకుడు "ఛీ! నీవును దాసిదానవే. అసలువారుమమ్ముల నిట్లు మోసపుచ్చుటకా మాచేత నింతసొమ్ము ఖర్చుపెట్టించినది ? ఆసంగతి నిశ్చయముగాఁ జెప్పిన మేము పోవుదము" అనెను. అదిపోయి యాజరిగిన వృత్తాంతము రాకుమార్తెకు విన్నవించెను.

అట్లు రెండుదినములు గడచిపోయెను. మూఁడవ నాఁటిరాత్రి రాచకుమార్తె తనఖాసా దాసీయగు హంసయాన నలంకరించి మంచి మంచిబట్టలు కట్టనిచ్చి సిద్ధపఱిచి దానితోఁ జెప్పవలసిన బుద్ధులుగఱపి పంపెను. అదియు నొయ్యారముగా బెలుదేరి తొలినాఁటి దాసీలిద్దఱును దన్ను సేవించి వెంటరా పండ్రెండుగురు బోయీలుమోయు సవారీలో నెక్కి-కూర్చుండిపయనమయ్యెను. ముందుగా దాసీలనుపంపి వారినక్కడ సిద్ధముగా కాచికొనియుండుఁడని పురమాయించెను. ఇద్దఱు దాసీలు నెదురుగావచ్చి యామెను సవారినుండి బైటకు రావించి తమభుజములు పై దండనొసగిరి. ఆమెయు వారలభుజములపై చేతులుమోపి మెల్లగా యేనుఁగునడకవంటి యందమగునడకతో మిక్కిలి యొయ్యారముగ మందమందగమనముతోఁబోయి గదిఁబ్రవేశించి యందు వేచియున్న వర్తకునికి కరస్పర్శ యిచ్చి యొకకుర్చీపై నతనిని కూర్చుండఁబెట్టి తానొకకుర్చీ మీదఁగూర్చుండి దాసీలచే దీపము లెగసనద్రోయించి చెత్తతుడిపించి ముందుగా నల్లసరింపమికి వారలపైఁగినిసి కొంతసేపు వర్తకునితో నిష్టాగోష్ఠిసలిపి దాసీలందిచ్చు స్త్రీపురుషతాంబూలములు వేర్వేర స్వీకరించుచు నా రాత్రి యంతయు సుఖగోష్ఠిని మన్మథక్రీడావినోదంబు సలిపి యతని సంతుష్టిగావించెను. ఈపెద్దదాసి తానే రాచకుమార్తె యని యనుకొనుటకు సందియము లేకుండుటకుగా వర్తకునితోఁ ప్రసంగవశమున "మంత్రికుమారుఁడు తనభర్తయనియు ఆతనిమెడను తానొక పూలదండ వైచినవిషయమును దేశాంతరగతుఁడయిన యాతని వృత్తాంతమును జెప్పి యతనిక్షేమసమాచారము గాని యాగమనము గాని తెలియనందులకు కించిత్తుమాత్రము తనవిచారమును సూచించుచుఁ బలికెను. అంత వర్తకుఁడు "మంత్రికుమారుఁడు తమపట్టణములోనున్నాఁడనియు మెడలోని పూలదండ వాడక యట్లే యుండుటను తాముప్రతిదినముఁ గాంచుచుంటిమనియుఁ జెప్పి మరుసటిదినమున తాము ప్రయాణమై పోవలె"ననిరి.

అంతట తెల్లవాఱుజామున పెద్దదాసి కోటలోనికిఁ బోయి యంతఃపురముననున్న రాజకుమార్తెకు రాత్రిజరిగిన వృత్తాంతము

యావత్తు క్రమముగా పూసగుచ్చినట్లు విన్నవించెను. మఱునటి దినమున వర్తకులు రాచకుమార్తెయొద్దకు దాసీలును బంపి తమ ప్రయాణము తెలుపుమనియు, తమకు సెలవొసంగుమనియు జెప్పి పంపిరి. అందుకాదాసి సీలువేసిన యొక యుత్తరమును దీసికొనివచ్చి "యాయుత్తరమును మంత్రికుమారుని కందియ్యవలసినదని తమదేవి మీచేతి కిమ్మన్నది" అనిచెప్పి యాయుత్తర మిచ్చెను. ప్రయాణోన్ముఖులై యున్న యారత్నవర్తకు లాయుత్తరమునందుకొని శీఘ్రయానమునం దమదేశమునకుం బోయిరి. మంత్రికుమారున కాయుత్తరము నిచ్చిరి. రాజసభకుబోయి రాజుతో రాజకుమార్తె పాతివ్రత్యమునకు భంగము వచ్చె"నని చెప్పిరి. రత్నవర్తకులచేత తనకిమ్మనిపంపిన యుత్తరమును మంత్రికుమారుఁడు రాజుచేతికిచ్చి చదువుకొమ్మనెను. అంతట రాజు జాబువిప్పి చదువఁగా నీక్రిందివిధముగా నుండెను.

"నాప్రియమగు భర్తగారికి,—

భార్య నమస్కార పూర్వకముగా వ్రాసికొనినమనవి. తాము ప్రస్తుతము నివశించియున్న దేశమునుండి రెండుగాడిదలు మనదేశమునకువచ్చి చేనిలోని సస్యమునుమేయదలఁచి చేనిలోఁ బ్రవేశింపఁబోయి శక్యముగాఁనందున జుట్టును దిరిగి యావరణ దాఁటలేక గట్టుమీఁది గడ్డి మేసి చేనుమేసినట్లుగా తృప్తిబొంది పోయినవి. ఇందులకుఁదార్కాణము నేనుమీకిచ్చిన పూలదండయే.

మీరు నాకుఁ బురమాయించిన మూఁడుపనులలో నొకటి పూర్తియైనది. తక్కినరెండును వేగముగానే ముగించి తమకు వర్తమానమంపుదును. తమ రాదేశములోనే యుండవలెనని నాప్రార్థన.

ఇట్లు,

మీ ప్రియమైన భార్య."

రాజది చక్కగాచదువుకొని రాకొమరునికేసిచూచెను. అతఁడు ధరించియున్న పూలమాల వాడలేదుసరికదా మఱింత నూత్నపరిమళమును వెదఁజల్లుచు నప్పుడేకోసితెచ్చి కట్టినదండవలె నెక్కువకాంతితో శోభిల్లుచుండెను. అంత రాజు మంత్రులనుజూచి "ఓరీ, గాడ్దెలారా! ఇంత సొమ్ము వ్యయముచేసి పోయినట్టి మీరు గడ్డిమేసివచ్చినారా" యనెను.

బుద్ధిపూర్వకముగా మహాపతివ్రతకు మానభంగముగావింపనెంచి యొన రించిన పాపమునకు ప్రాయశ్చిత్తమేమియుండునని రాజు మిక్కిలి వ్యస నమునొందెను.

అంత నచట రాజకుమార్తెయు మొదటిపనిపూర్తిగావించి ఇఁక రెండవపని నెఱవేర్చు ప్రయత్నములోనుండి యొకనాఁడు బాగుగా నాలోచించి తనభర్త వ్రాసినట్లుల తండ్రిపేర నొక యుత్తరము వ్రాసి యొక సౌకరుచేతి కిచ్చి "ఓరీ! నీ వీయుత్తరమును దీసికొనిపోయి చాలాదూరమునుండి వేగముగానడిచివచ్చినవానివలె కాళ్ళధూళితోను వగర్పుతోను తండ్రిగారిచేతి కందిమ్ము" అని కట్టుదిట్టముచేసివానికిఁ జెప్ప నలసినవన్నియుఁ జెప్పిపంపెను. వాఁడును పరుగుపరుగున వగర్చుచు వచ్చి రాజసభప్రవేశించి నమస్కరించి రాజుచేతి కాయుత్తరమునిచ్చి నిలుచుండెను. రాజు వానింజూచి యేమి సమాచారమని యడుగ వాఁడు "దేవా! అవధరింపుఁడు నేను ఉపకరజాదేశము రాజుగారి యొద్దనుండి వచ్చుచున్నాను. దేవరవారి యల్లుఁడుగారట. ఆరాజ సభలో ప్రధానమంత్రిగా నున్నారు. వారిజాబు తమచేతికిమ్మనినన్ను పంపినారు. నాకు జవాబుదయచేయింపుఁడు. మీఁద దేవరచిత్తము" అని నిలువంబడెను. రాజుగా రాజాబు మంత్రిచేతికిచ్చి చదివి చూచి యందలిసంగతులు తనతోఁ జెప్పుమని చెప్పి యంతఃపురమునకుం బోయెను. తోడనే మంత్రియు జాబుఁజూచి తీసికొని నగరులోనికిఁ బోయి రాజదంపతుల సమక్షమున నిలిచి యిట్లు చదువదొడఁగెను.

"శ్రీ మామయ్యగారి దివ్య శ్రీచరణసన్నిధికి—

శ్రీ॥ అల్లుఁడు రఘునాథరాజు నిత్యము కాలత్రయమందు ననేక వందనములుచేసి చేయంగలవిన్నపములు. "శ్లో॥యస్తు పర్యటతే దేశాన్ యస్తు సేవేత పండితాన్ తస్య విస్తారితా బుద్ధి స్తైలబిందురివాంభసి" అను న్యాయమున నేను దేశాటనముసేయ నమకట్టి తమతో మనవి చేసిన పోనియ్యరను భయముచేత సాహసించి యీసింహపురికి వచ్చి తిని. ఇక్కడ మంచిపండితులున్నారు. రాజుగారు బహుసరసులు. నన్ను జూచినతోడనే తమ యల్లుఁడనని విని మిగుల గౌరవముతో తమ సామంతరాజులలో నొకనిగా భావించి నిత్యము సభకువచ్చుచుండుమని

సమస్త కార్యములలోను నాతో మంతనముసేయుచు ప్రధానునంతి వలె నన్ను భావించుచున్నారు. ఇంకను కొంతకాలమువఱకు మీదేశము వెళ్ళుటకువీలు లేదన్నారు. ఇక్కడిమర్యాదలు, రాజ్యపరిపాలనాక్రమము మొదలగునవి యింకను నేర్చికొనవలెనని నాకునుకుతూహలముగానున్నది. ఇప్పటకుటుంబముతోనుండుటకుదగినరాజభవన మొకటి విడిదెగా నొసంగియున్నారు. నౌకరులు చాకరులు సమృద్ధిగానున్నారు కావున మీకొమార్తెను పంపించినయెడల కొంతకాల మిప్పట నేను కుటుంబసహితముగా నుండి నాలుమాసములు గడిచినపిమ్మట వచ్చి మీదర్శనము చేయుచున్నాను. నాయీప్రార్థన మంజూరులోనికి దెచ్చి నాకోరికప్రకారము జరిగింతురని నమ్మియున్నాను. (శ్రీ) మాబాబయ్య గారుకూడా యీజాబే చిత్తగింతురుగనుక వారిపేర వేరే వ్రాసికొనలేదు. వారితోడను తమరు సెలవియ్య కోరుచున్నాడను. చిత్తగింప కోర్తాను.

ఇట్లు,
మీ ప్రియమైనయల్లుడు."

అల్లునిచేవ్రాలుగల్గినట్టియు స్వయముగా లిఖించినట్టియు నాయుత్తరమును చదివి వినిపింపగానే రాజుభార్యవిని తక్షణమే పంపవలెనని భర్తగారితో చెప్పినది. రాచకుమార్తెకూడా యిచ్చటనేయుండినదిగనుక తండ్రిగారితోను తల్లిగారితోను తాను భర్తయొద్దకుపోవుట కత్యంత కుతూహలముచూపి పోదునని సెలవిమ్మని ప్రార్థించె. అంతట రాజు సంతుష్టాంతరంగుడై మంత్రితో "తగిన దాసదాసీజనముతోడను వలయుపరికరములతోడను ధనకనక వస్తువాహనాదులతోడను తనకుమార్తె జాగ్రత్తగాం బోవుటకు వలయునేర్పాట్లు గావింపు" మని యాజ్ఞాపించెను. విలువగలవస్త్రాంబములను నాభరణములను నొసంగి దాసదాసీజనము వెంటరా నుత్తమాశ్వములు, నేనుగులు సవారీలుమున్నుగాగల సకలపరివారమునిచ్చి సమస్తవైభవముతోడ రాచకుమార్తెను పంపెను. పిమ్మట నాచిన్నది సింహపురికి నొక క్రోసుదూరములోనున్న యొక సుందరోద్యాన వనములోపట కుటీరముల నిర్మించుకొని పరివారమునంద నిలిపి వారికి కావలసిన

నెచ్చములనొసఁగి తానువచ్చువఱకు నటనే యుండుమని నియమించి తాను నలువదిపల్లకీలను బురకాలుమూయించి వానిలో స్త్రీలున్నటులు పయివారికిఁ దోఁచులాగున చేసి ప్రతిపల్లకియును నలుగురేసిబోయీలు చొప్పున మోయుచుండఁగా తాను పురుషవేషముధరించి యొక యశ్వము నధిరోహించి సింహపురిపట్టణముఁ బ్రవేశించి యాపట్టణమేలు రాజుగారివాసమునడిగి తెలిసికొని పోయిపోయి తుదకుతనభర్త యున్న లోగిలియొద్దకుఁ బోయి సవారీలు బైటనుంచుమని బోయీలనాజ్ఞాపించి యొకనౌకరింబిలిచి "రాజకుమారుఁ డొకఁడు వచ్చియున్నాడని" వార్త బంపి లోనికిరమ్మని వర్తమానమురాఁగా, నౌకర చేరిచావడి లోనికిఁ బోయెను. అంత మంత్రికుమారుఁడెదురేగి తగినమర్యాదతో దోడ్కొనిపోయి సత్కరించి యుచితాసనమున కూర్చుండ నియమించి తానును గూర్చుండి కుశలప్రశ్నలడిగి నామధేయము ఆగమనకారణము దెలియజేయుమనుటయు "తానొకదేశపురాజకుమారుఁడననియు రాణివాసముతో దేశాటనముసేయవచ్చితి ననియుఁజెప్పెను. అందుపైని మంత్రికుమారుఁడు (భర్త)" బైటనున్న నలువదిసవారీలు వెంటనే లోనికిఁ దీసికొనిపోయి తనన గరులో వరుసగా నున్నగదులలోనికి నపువుమని చెప్పిపంపెను. సవారీలతో గూడ వచ్చిన దాసీలు సవారీతలుపులు మూసి గదులలోబ్రవేశించి వట్టిసవారీలు పైకి బంపివేసిరి. పిమ్మట నలువదిమందిదాసీలు కచేరీ సావడిలోనికి వచ్చి "జనానా సురక్షితముగా లోగిళ్లలో బ్రవేశించె" నని విన్నవించిరి. మంత్రికుమారుఁ "డీదాసీ లెక్కడినుండివచ్చినా"రని యడుగ క్రొత్తగా వచ్చిన రాకుమారుఁడు (పురుషవేషధారి) వీరు ఎవరియజమానితో వారు సవారిలోగూర్చుండి వచ్చినారు. వీరు వారివారి యజమానినులతో గదులలోఁ బ్రవేశించినారు. జరుగురువర్తమానము లేమైన వారు మనకుఁ బంపినయెడల వచ్చి మనతో మనవియొనర్తురు. వారికి వలయుసహాయిలు యావత్తు జాగ్రత్తగాచేయఁబడియున్నవి. వారివంట సామానులు వగైరాలు బండమీద నింకనువచ్చుచున్నవి. వారినౌకరులును సామానుతోవచ్చుచున్నారు." అనిచెప్పెను. అంతట నేఁబదిబండ్లమీఁద వంటసామాను, వంటపాత్రలు మున్నగు నితర సామానులు

వచ్చెను. నౌకరులును బసలయొద్దకువచ్చి కందవంట ప్రయత్నములో నుండిరి. అంత మంత్రికుమారుఁడు "మీరుమాకతిథులుగనుక మీరందఱు మాకందాలోనే భోజనములు చేయవలయుననియు, తామును కాలవైపరీత్యముకతన తమ రాణివాసమును తమదేశమునువిడిచి ఇచ్చట నొంటిమై యుండవలసివచ్చెననియు, అందువలన దాసీలగత్యములేక యుంచలేదనియు ఎవరిదాసీలు వారితోఁగూడానే యున్నారు గనుక జనానావారికి సపర్యయావత్తు తామే చేయుదుమనియుఁ జెప్పి క్రొత్త రాజకుమారునోడంబఱచి కొంతసేపిష్టగోష్ఠికబురులు చెప్పుకొనిరి. అనంతరము స్నానము చేయుటకు నెవరిగదులకువారుబోయి స్నానములు చేసి భోజనములుచేయుటకుఁబోయిరి. రాచకుమార్తెయుఁ దనపురుషవేషము బయలుపడకుండ స్నానము, బట్టలుధరించుట మున్నగునవి ప్రత్యేకము తనగదులలో జరుపుకొనెను. తనయొద్దనున్న పురుషసేవకులు స్నానమునకు నీళ్ళుకాచి తోడి సిద్ధముచేసి బట్టలువగైరాలు గదిలోనుంచి వెడలిపోవుటయును తాను స్నానముచేసి యాబట్టలు ధరించుటయు పిమ్మట చాకలివాఁడు వచ్చి తడిసినబట్టలఁ దీసికొని పోయి యుదికి తెచ్చుననియు, తమదేశపు రివాజటులనే యనియుఁ జెప్పి సమాధానపఱచి తనగుట్టుబయలుపడకుండ మూఁడుదినములు మంత్రికుమారునితో నిష్ఠాలాపములాడుచు గడిపెను. నిజముగా నలువదిగదులలో నలువదిమంది భార్యలున్నటుగానే మంత్రికుమారునికి విశ్వాసము కలుగునటుల నటించెను. దాసీలుమాత్రము వచ్చి పోవుచుండెడివారు. ఒక్కొక్కదాసి వంటసాలకువచ్చి తనయజమానురాలికి తనకువలయు భోజనపదార్థముల నొకరికిఁ గావలసినదాని నిద్దఱికని చెప్పి తీసికొని పోయి తామే భుజించుచు నిజముగా లోపల జనానావా రున్నట్లు నటించుచుండిరి.

ఇట్లుండ నొకదినమున తనకు 'మానసబహిష్టు' తటస్థింపవెంటనే మంత్రికుమారునితో "తమదేశములోతనజనకునికిచాలజబ్బుగానున్నటుల వర్తమానము వచ్చినదనియుతక్షణంపోకతప్పదనియు దాసీలకృతముగా తమ జనానాను జాగ్రత్తగా కాపాడవలెననియునేకవిధములఁజెప్పి యాతని మెప్పించి క్రొత్తరాజకుమారుఁడు (మనకథానాయకి రాచకుమార్తె)

గుఱ్ఱమెక్కి పోయి తోఁటలో వేయబడియున్న తమ డేరాలోఁ బ్రవేశించి మూఁడుదినములుండి నాలుగవ నాఁడు శుద్ధిస్నానము జేసియా వెంటనే బైలు దేఱి స్త్రీ వేషమున సవారితో వచ్చి తోడ నలుగురు దాసీలు రాఁగా వారిచేత మంత్రికుమారునితో పెద్దదేవిగారి బంధువులొకరు వారినిచూచుటకు దేశమునుండి వచ్చినారని చెప్పించి పెద్దదేవిగారినగరులోని కా సవా రితోఁ బోయి సాయంకాలమువఱకు సవారిని దాసీల నుంచి పిమ్మట వచ్చినవారలును దాసీలును బైటికివచ్చిరి. మంత్రికుమారుఁ డిది యేమి యనియడుగ "మా దేవిగారుమీ స్నేహితుని పెద్దదేవిగారినిజూచుటకు వచ్చిరనియు వార లొండొరులను జూచుకొని యిష్టాలాపములాడు కొన్నపయిని మా దేవిగారు మరల వెళ్లిపోవుచున్నా"రనియుఁ జెప్పి సవారిఁ దీసికొని తమబసచేసినతోఁటలోనికిఁ బోయిరి రాచకుమార్తె తోఁటలోనున్న భృత్యజనముతో " ఎవరు వచ్చియడిగినను తమనిజస్థితిఁ జెప్పవల"దని యేదియో యొకకొత్తపేరు చెప్పవచ్చునని వారలకుఁ కట్టుదిట్టముఁ జేసెను. ఇట్లు రాచకుమార్తె రహస్యముగాఁ బ్రవేశించి యారాత్రి తనగదితలుపుఁ దీసి మనోహరముగా వీణవాయించుచూ నొకవిదేశస్త్రీవలె వేషముధరించి మాయగొంతుకతో మాటాడుచు మంత్రికుమారునకి తనదాసిచేత వర్తమానమంపెను. మంత్రికుమారుఁ డు బహుసంతోషముతో జని యామెనుచూచఁగానే తనువశము పట్టలేక తత్క్షణమె మోహపరవశుఁ డయ్యెను. ఆమెయుఁ గొంతసేపు వీణాగా నమును, కొంతసేపు కుశలప్రశ్న పరంపరలను గురిపించి నలువదిభార్య లుగల తనభర్తతో తన కేమిసుఖమునులుగఁ గలదని, కొన్ని విరక్తి మాటలు చెప్పుచు బహుపత్నీత్వము పురుషులకుఁ గూడదని యతనికిఁ దోచునట్లుఁ జేయుచు బహుపత్నులుగలవారి భార్యలిట్లులనే వ్యభి చరించుచుందురని సూచించుచు కొంతసేపు చమత్కారముగా నాతని తో మాటాడి ప్రౌఢగావున తాను బయలుపడకుండా యతనిచేతనే తనయభిప్రాయము వెలిగ్రక్కించి, తాను పట్టమహిషియయ్యు నట్టిపని చేయఁగూడదని యాతని మందలించుచున్నట్లు కొంతసేపు మాటలాడి తుదకు తానును తమకపడి మోహించినటుల నటించి తాత్కాలిక రహస్యగాంధర్వవివాహమును తామిద్దఱు చేసికొనినట్లును, తా నిఁక

నన్యులతో సంచరింపననియు, తాను దేశము వెళ్లినను తలఁచుగా నచటికి మీరు వచ్చుచుండవలెననియు, మనసంయోగమునకు వలయు నేర్పాట్లు దాసీలమూలముగా తాను చేయించితిననియు, నట్లయిన తనకు వ్యభిచారదోషము లేకుండుననియు లేనిపోనిసమాధానము జెప్పి, యతనితో నారాత్రి మదనక్రీడాసౌఖ్యము ననుభవించి, మదన సామ్రాజ్యపట్టాభిషేక మాతనికిఁ జేసి, తాను పట్టమహిషియై మారుని బాఱఁద్రోలి తెల్లవాఱువఱకు నారాజ్యమేలి తెల్లవారినపిదప తమ తమ నెలవుల సుఖముగానుండిరి.

మంత్రికుమారుఁడును రాజసభకుఁ గొన్ని దినములవఱకు రానని వర్తమానమంపి స్నానము, భోజనము మొదలగు నవచటనేజేసి యా రాత్రిసైతము తొలినాఁటిరాత్రివలెనే మరల స్నేహితునిపెద్దభార్య వర్తమానమంపునని నమ్మి, అందువలన రాత్రి నిద్రయుండదు గనుక పగటిపూఁటయే నిద్రపోయి సాయంకాలమునకు రాత్రిభోజనము పెందలకడనే తీర్చుకొని వాసనద్రవ్యముల నలఁదుకొని పోషకు అయి యెదురుతెన్ను చూచుచుండెను. మఱునాఁటిరాత్రి రాచకుమారుని రెండవగదిలోఁ బ్రవేశించి భోజనాదికవ్యాపారములఁ నన్నిటిని శీఘ్రముగాఁ జక్కఁబెట్టుకొని యొకపిడేలు చేతఁబుచ్చుకొని శ్రావ్యముగ వాయించుచు మఱియొకదాసిచేత మంత్రికుమారునకు వర్తమానమంపెను. మంత్రికుమారుఁడును పోయి చూచి యీరెండవభార్య నేటికిఁ గూడినది. ఇటువలెనే నలువదినుందిని వరుసగాభోగింతునుగాక యని యువ్విళ్లూరుచుఁ లోనఁబ్రవేశించి, యామెచేయు నతిథిసత్కారముల నందుకొని తాంబూలముస్వీకరించి సరసాలాపములాడి, తొలినాఁటి వలెనే యామె "బహుపత్నులుగల రాజులభార్య లందఱు నిట్టె యుందు"రని సూచించుచు, శృంగారప్రశంసచేయుచు నాదిశంకరాచార్యులవారు పరకాయప్రవేశమున రాజభార్యలతో సంభోగించుచు, నొక్కొకరాత్రి యొక్కొకయామెయొద్ద చదివిన "యమరుక" మను శృంగారగ్రంథములోనిశ్లోకములలో నొకశ్లోకమునుజదివించి యాయన స్వదస్తూరిని వ్రాయించి చేవ్రాలు చేయించుకొని తేదీ వేయించి తీసికొనెను. తొలిదినమునను నిటువలెనే యొకశ్లోకమును తీసికొనెను.

(అమరుక మనుశృంగారగ్రంథమచ్చుపడియున్నందున నాశ్లోకములనిందు వేఱుగా వ్రాయలేదు,) ఆపిమ్మట మదనక్రీడాసక్తులై నానావిధముల క్రీడించి మన్మథావస్థల నోలలాడుచు తెల్లవారించెను. ఇట్లొక్కొక్కదినమొక్కొక స్త్రీవలె నలువదిదినములు నలువదిస్త్రీలు నెఱుఁగని వేషధారియై గట్టు బయలుపడనీకుండ నటించుచు చాతుర్యముతో మంత్రికుమారునితోఁ గ్రీడించి కడపటిదినమున నతని నామాక్షరములు గల యతని చేతివ్రేలి ముద్రుటుంగరమును కత్తియును దీసికొని మఱికొన్ని యితరములైన యాభరణములు, విలువగలవస్త్రములు, బొమ్మలు మొదలగునవి యతనివలన బహుమానములుగా గైకొని తానప్పటి కింతర్వత్నినని తెలిసికొని వెంటనే యటనుండి వెడలిపోవఁ దలఁపుగలదై యోచింపఁదొడఁగెను.

ఈనలువదిదినములలోను తోఁటలోనున్న పరివారమంతయు తమపరివారమే యని తమభర్తగారు తమదేశమునకుఁ బోయి యెప్పుడు వత్తురో తెలియదు. వారువచ్చువఱకు తాము సర్వస్వాతంత్ర్యములతో నుండవచ్చుననియు నుచితపరిచారికములు చేయుచు పగటిపూఁట సైతము మంత్రికుమారునితో నొకకప్పు చేదిమా యొక భార్యవలె నొక్కొకగదితలుపుఁదీసి మాటాడుచు తోఁటలోనికి సైతము వచ్చుచుఁ బోవుచు నిటువలె గట్టు బట్టబయలు కాకుండ నటించుచు రెండుదినములు పూర్తియైనవిగదా యని నమ్మి తాను నియామునిలిగి తన పాతివ్రత్యము చెడకుండ తనభర్తతో సాంగత్యము పుత్రసంతానముకలుగఁ జేసినదని తప్పక పుత్రుఁడుకలుగునను నమ్మకముతోనే యుండి మరునాడు తెల్లవారునకి పురుషవేషమున తోటలోనుంచి తొలినాఁటి రాత్రియె తెల్లవాఱుసమయమున మంత్రికుమారునితోఁ దోటకుఁ బోయి వచ్చెదనని చెప్పి సవారిపయనమై పోయి తిరిగివచ్చినయటువలె నొకగంటలోగా నట్టిసవారి పంపివేసెను. అనవారిని గదిలోనిఁ దీసికొనిపోయి మరల పైకిఁ బంపివేసిరి. (వెళ్ళినయామె మే పురుషుఁడై పోయెను.)

స్నేహితుఁడగు మంత్రికుమారునికి సర్దమానించెను. "ఇప్పుడే మాంబసయయినతోఁటలో దిగితి మసియు నక్కడ మీ కలజడి లేకుం

మటకయి పరివారమును, సైన్యసామగ్రియు నచట నుంచి రాణివాస ముతోడనే మీతాపురువచ్చితిమనియు సాయంకాలము వచ్చెదననియు” వర్తమాన మంపెను. అందుచేఁగానే మంత్రికుమారుఁడు మిక్కిలి వ్యసనముతో నొకదాసినిబిలిపించి “ మీరాజుగారు వచ్చిరి తోఁటలో నున్నారు. సాయంకాలము వచ్చెద”రని రాణివాసమునకు కబురుపంపెను. ఆరాత్రియె (రాణీలయొద్దనుండు దాసీలన్నివిధముల వారితో నుందురు గావున) పత్రిగదిలోనుంచి యొక్కొక్కదాసీచొప్పున నలువదిమంది దాసీలు నొకరికొకరు తెలియకుండ మంత్రికుమారునియొద్దకు వచ్చి తమయజమానిని తమతో వారికిఁగలిగిన వియోగమునకు మిగులవగచుచున్న దనియు నీకె గాంధర్వవివాహసంబంధమున మిమ్ము మమ్ములనేగాని యన్యులను మొగమెత్తియయిన చూడదనియు మీరు ముఖ్యముగా మీదేశమునకు రాలేదనియు మీరాయిష్టమువచ్చినంతకాలము తమతో సుఖముగా నుండవచ్చుననియు మొదలగు వివాహసంబాధమగుమాటలు రాణివాసమువారు చెప్పినట్టులఁ జెప్పి సంతోషపెట్టిరి”.

అంతలో సాయంకాలమయ్యెను. అప్పుడు క్రొత్తగావచ్చిన రాజకుమారుఁడు గుఱ్ఱమెక్కివచ్చి తనతండ్రిగారియు త్తరుప్రకారము తాము వెంటనే బైలుదేరిపోవలెనని చెప్పి రాణివాసముతో మేము పోదుముగాని మాపరివారమంతయు తోఁటలోనే యుండుననియు సాధ్యమయినంతవేగముగ రాణివాసముతో వచ్చెదననియుఁ జెప్పి నాఁటిరాత్రి కక్కడనుండి మఱునాఁడు బయలుదేరి యథాప్రకారముగా సవారీలలో దాసీలెక్క పైకిరాఁగా సవారీలతీసుకొనివచ్చిరి. వచ్చునప్పుడు మంత్రికుమారుని స్నేహాధిక్యముచేతను, చనవుచేతను, పురుషవేషముతోడనే మరిమరి కౌఁగలించుకొని యతనిచేతులు ముద్దుపెట్టుకొని మరల వేగముగా వచ్చెదనని ఖరారుచేసి యందుకు ప్రమాణముగా చేతులుముద్దుపెట్టుకొని (ఇది రాజులయొద్దచేయు ప్రమాణము. ఈమర్యాద యిప్పటికిన్ని మనయింగ్లీషుపాలకులయొద్దను గూడ కలదు. మనదేశమునకు గవర్నరులుగావచ్చెడువారు ఇంగ్లాండులో రాజుగారికిగాని వారిపైయధికారులకుగాని చేతులు ముద్దుపెట్టు

కొని వత్తురు. అదే ప్రమాణము.) పోలేకపోలేక మరలిమరలిచూచుచు
తోటలోనికిఁబోయెను. అచ్చటనొకటిరెండుదినములుతనకొక్కతె తాను
సైన్యపరివారము సుఖముగనుండి యెక్కడివారక్కడ మాయ
ము చేసి దాసీలనుమాత్రముంచి మూఁడవదినమున తనమానసములో
నాలోచించుకొని మంత్రికుమారుఁడు వచ్చి యడిగితే రాజకుమారుఁ
డును రాణివాసమును దేశమునకుఁ బోయిరనియు వారు తిరిగి వచ్చు
వఱకు తమ్మునిచటనుంచిరనియుఁ జెప్పవలసినదని చెప్పి తానొక
యోగినివేషము ధరించి పదిమందిదాసీలను యోగినీలవేషము వేయించి
వారు శిష్యురాండ్రుగను తాను గురువురాలుగను సమకూర్చుకొని
మంత్రికుమారునితో తాను సంభోగించు దినములలో నప్పుడప్పుడు
తనకు మంత్రికి జరిగిన ప్రసంగములో నారాజకుమారుఁడు బహుసౌంద
ర్యవతియని మంత్రికుమారుఁడు తనతోఁ జేయు ప్రసంగములవల్ల
నామూలాగ్రము (తెలిసినదిగనుక) యేరాజుగారిసభలో మంత్రికు
మారుఁ డుండెనో యారాజుగారి యంతఃపురమునకు బయలుదేఱిపో
యెను. ఆనడుమ నప్పుడప్పుడు మంత్రికుమారుఁడు తోటలోనికిఁ
బోయి కొందఱు దాసీలనుజూచి వారితో ముచ్చటలాడుచు వారి
యజమానినులను గుఱించిచెప్పుకొనుచు కొందఱుదాసీలుగూడా వెళ్లి
రని కొందరున్నారని వారు చేయుప్రసంగములు వినుచు తన నాయి
కల యోగక్షేమముఁ దెలిసికొనుచు వారినిచూడనిష్టముగానే దాసీల
మూలముగా విన్నవార్తలవల్ల సంతోషించుచుండెను.

అట్లు శిష్యురాండ్రైన చిన్న యోగినులతో వెళ్ళినపెద్దయోగిని
(రాజకుమార్తె) యారాజభవనములో ప్రవేశించి రాణిగారివల్ల తగిన
మర్యాదపొంది కన్యయగు తమ పుత్రికను రాణీగారు తనకు పరిచర్య
చేయుటకు రాణిగారొసఁగ నామెను శిష్యురాలుగా గ్రహించి (రాజు
లలో వివాహముగాని రాజకన్యకలను) యోగులుగాని యోగినిలు
గాని వచ్చినప్పుడు వారికి శిష్యురాండ్రుగా వారల పరిచర్యసేయునిమి
త్తము నియమింతురు. (అర్జునుఁడు యోగివేషమున సుభద్రనువివాహ
మాడుటయు నీమర్యాదనుబట్టియే కుంతి దుర్వాసునివలన మంత్రగ్ర
హణముసేయుటయు నీమర్యాదనుబట్టియేయని తెలియనగును.)

యామెను ఆమెతో నందుఁగల సమస్తమయినవారికి నంతఃపురములో వేదాంతోపదేశము చేయుచుండెను. వారలమనస్సులును పరిపక్వము పొందుచుండెను. ఇట్టుల నాలుమాసము లచ్చటనుండి వేదాంతపు మొక్కను వారిహృదయములలో నాటఁగా దున్నినకొలఁది మంచిదియై భూమి చవుడు తేలిపోయి యందులోని విత్తనములు వేగముగా నాటుకొనినటులను, కొత్త భూమి బాగాపన్ని మొక్కమాఱు విత్తు నాటితే యదిబహువేగముగా మొలచినటులను తల్లిమనస్సుకన్న కూఁతురుమనస్సు కోమలమైనదైయు చలింపనిదైయు యుండుటచేత కూఁతురిమనము వేగముగా పరిపక్వములోనికివచ్చి సంసారసుఖమునందు విరక్తి పుట్టి యోగినితో నెల్లచోట్లకు ప్రయాణమవుచుండెను. (ఈసందర్భమున నొక చిన్నకథచెప్పనగును-ఒకయూర నొక వేదాధ్యయనసంపన్నుఁడును శాస్త్రవేత్తయు వేదాంతియునగు నొక బ్రాహ్మణుఁడుండెను. అతని కేకపుత్రవిషయు మొక్కఁడే కొడుకు. తండ్రికొడుకునకు ముందుగా వేదాంతశాస్త్రమే బాగుగా బోధించెను. కొడుకు పరమవేదాంతి యయ్యెను. వివాహమాయెను. భార్య కాపురమునకు వచ్చెను. ఇద్దఱికి సంపర్కము లేదు. కోడలు బుద్ధిమంతురాలు గనుక ఆసంగతిబైటికి రానీయక యింటిలో పచారీలుచేసి కొనుచుండెను. ఒకనాఁడు పశువులసాలలో మామగారు భర్తయు వేదాంతగోష్ఠి చేయుచు గూర్చుండియుండిరి. ఆపశువులసాలలో నుండియే భోజనములైనపిమ్మట ఆకులుపాఱవైచుటకు వెళ్ళునట్టిమార్గము కోడలు ఎంగిలియాకులు పాఱవేయుటకు పశువులసాలమార్గమునుండి పోవుచుండగా నొకయావుదూడ కోడలుపై కెగురుచుబోయెను. ఆకోడలు చప్పున విస్తరాకులఁ బాఱవైచి దూడను సమీపించి "ఱంకుముండా! నీకు పెంకితనమెక్కువాయెనా? మామామగారిచేత వేదాంత ముపదేశము చేయింతును" అనియెను. అది మామగారు విని కోడలికి కొడుకునకు చిరకాలమునుండి స్పర్శలేదని గ్రహించి యప్పటినుంచి కొడుకునకు శృంగారగ్రంథములు చేష్టలు ప్రారంభించి కొక్కోకము మొదలగునవి చెప్పి కొద్దిరోజులలోనే శృంగారరసప్రధానుఁడుగా వీరరసికాగ్రేసరుడుగాఁ జేసెను.) అంత నొకనాఁడు యోగిని (రాచకుమార్తె) రాణి

గారియొద్ద సెలవుగైకొని వెళ్ళిపోవుటకుఁ బ్రయాణమగుచుండఁగా కూఁతురు తనకు వివాహ మక్కఱలేదని యోగినిసేవచేయుచు నామె తోఁగూడ వెళ్ళిపోవుదునని పట్టుపట్టెను. అప్పుడు యోగిని రాజుగారిని నగరులోనికిఁబిలిపించి దంపతులిద్దఱికడను కూఁతును గూర్చుండఁ బెట్టి తనవృత్తాంతము చెప్పఁదొడఁగి యిట్లనెను:—

"రాజదంపతులారా! నేనొక దేశపు రాజకూఁతురను మాతండ్రికి నే నొక్కరితనే కూఁతురను. నాకు చిన్నప్పుడు మాతండ్రిగారు గురువునొద్ద సమస్త విద్యలు నేర్పించెను. నేను మనస్సు పరిపక్వము గలదాననై సంసారసుఖమందు విరక్తిపొంది యీ యోగినివేషము మాయింట నేను నగరులోనేయుండి గ్రంథకాలక్షేపము చేయుచుండగా మాతండ్రిగారు నన్నుఁజూచి యాఁడుదాననైనను నన్నే మగవానిగా భావించి "తల్లీ! నీ వాఁడుబిడ్డవైనను నాకు నీవేపుత్త్రుఁడవు. నారాజ్యము నీవే పరిపాలనము సేయుచుండుము నాయనంతరము నీవే పట్టాభిషేకమునుపొంది మంత్రివర్గముగొలువ రాజ్యపరిపాలనము చేయుచుండుము. నీయావజ్జీవ మట్లు పాలించుచు నీయిష్టమువచ్చినప్పుడొకమగవానిని తనయునిగాగాని యొకయాఁడుబిడ్డను కూఁతురుగాఁ గాని పెంచుకొని యీరాజ్యము సుతునికో దౌహిత్త్రునికో యిచ్చి వానికిఁ దగిన బుద్ధులుచెప్పి వివాహముగావించి వారు సంతానవంతులగువఱకు నీవుండి పిమ్మట వానప్రస్థమునకుఁ బోవలెనుగాని యీలోగా వానప్రస్థాశ్రమము స్వీకరింపవద్దని చెప్పిరి. కనుక నే నరణ్యములలో నాశ్రమముగల యోగినిని గాను గృహస్థులవలె నింటనే యుండి కుమ్మరిపురుగువలె రాజ్యభారము వహించి పరిపాలించుచున్నను తల్లేశము నా కేమియు లేక నాముక్తత్వమును నేను కాపాడు కొనుచుందును. మాతండ్రిగా రట్లు సెలవిచ్చిన పయిని నేను వారితో "బాబయ్యగారూ! తమరు సెలవిచ్చినటుల నేను వానప్రస్థాశ్రమము వెంటనే స్వీకరింపను. ఈ యోగినీవేషముతో కొన్ని సంస్థానములకు సంచారముబయలుదేరి యా యా రాజుల యంతఃపురములలోనివారికి వేదాంతముపదేశించి మనఃపరిపక్వముపొంది నాతో వచ్చుటకు కోరిక గల రాచకన్నెలను (నేను స్త్రీనిగనుక సహజముగా స్త్రీసోదరీమణుల)

పైననే ఆశయుండును.) నాకు సోదరిగాఁదెచ్చుకొని దానికి శృంగార ముపదేశించి సంసారవాంఛ పుట్టించి వివాహముచేసి వారికి సంతానముకలుగువరకు నుండి వారు సంతానవంతులు కాఁగానే వారికిచెప్పవలసినబుద్ధులు చెప్పి వారిసుతుఁడు పెద్దవాఁడై సంతానవంతుఁడై పట్టాభిషేకమునకు దగినవాఁడు కాఁగానే పట్టాభిషేకముఁజేసి రాజ్యము వానికప్పగించి నాచెల్లెలిని మఱఁదిని దీసికొని వానప్రస్థాశ్రమములోనుండి వారిని తరింపఁజేసి నేనును తరింతును" అనిచెప్పి వారియొద్ద సెలవుపుచ్చుకొని యొకయేడాదినాఁటికి మరలవచ్చెదనని యొప్పుకొనివచ్చితిని. వీరు నా నగరులోనుండి నాయూడిగముసేయు దాసీలు. ఈ సమీపమున తోఁటలోనున్న డేరాలు నావే ఆపరివార మంతయు నాదేను. నాదేశము విడిచి సంచారమునకు బయలుదేరి తొలుదొల్త మీ నగరునకే వచ్చితిని మీపిల్ల బహుబుద్ధిమంతురాలు. సూక్ష్మబుద్ధి కలది. కుశాగ్రబుద్ధిగలదియని చెప్పవచ్చును. వేదాంత మెంతవేగముగా గ్రహించినదో యంతకన్న తక్కువవేగముగా శృంగారోపదేశముజేసి సంసారవాంఛ పుట్టించెదను. (అంతలో కూతురు యోగినితో "నన్నుమఱల సంసారకూపములో త్రోయఁజూచుచుంటిరా ? యోగినిగారూ! అట్లయిన నే నిప్పుడే వానప్రస్థమునకు బోయెద"నని పట్టుదలగాఁ జెప్పెను. యోగిని యామెవీపుమీఁదఁ జేయివైచి తట్టి బుజ్జగించి "చెల్లెలా! నేను తొల్త నే నీవు నాసోదరి నంటిని మీ బాబయ్యగారి రాజ్యమెంతయున్నదో యంతకు పదిరెట్లు రాజ్యము మాబాబయ్యగారిది. మేము స్వతంత్రరాజులము మీబాబయ్యగారు మాకు పన్నుగట్టుదురు మేము దవద్వీపచక్రవర్తులము మీబాబయ్యగా రొక్కదేశానికే యధిపతులు అయినను నీవెప్పుడయితే నాకు చెల్లెలివైతివో యప్పుడే యీరెండురాజ్యములు మనవే నీవు నాతోఁటిదానివే. నేను యోగిని నయితే నీవును యోగినివి నేను సంసారిణి నయితినేని నీవును సంసారిణివే. నిన్ను సంసారకూపమునఁ ద్రోసి నేను బయటనుందునా? మనమిద్దఱము నొక్కసుఖమునె యనుభవింతము నీవు తొందరపడకమ్మా! అంతగా నీకు భయమైతే నీకు వివాహముచేయఁబోవు వరుని ముందుగా నేనువివాహమాడి పిమ్మట నాతనికే నిన్నును వివాహము

చేసి మనమిద్దఱ మొక్కనిభార్యలమై యేకసుఖ మనుభవించు
చుందము. నీకు చిన్నతనపుతొందరపాటెగాని వేదాంతానుభవము
కలిగినపుడు నీకుగల శాంతమేఁ?" అని బోధపఱచి తల్లిదండ్రులతో
మఱల జెప్పనారంభించెను) తగినవరునికి వివాహముచేసి రాజ్యభా
రము నేనే మంత్రినైయుండి పరిపాలనచేయుచు సంతానప్రాప్తి గలుగ
గానే పిల్లవానికి విద్యాబుద్ధులు చెప్పించి పెద్దవానినిజేసి రాజ్యము
వాని కప్పగింతును. ఈ రెండురాజ్యములకు వాఁడెరాజు ఈయమ్మా
యికి జనకపితరులు మీరు నాకో పోషకపితరులు. మారాజ్యమున
కును మీరాజ్యమునకును నాలుగుదినముల ప్రయాణము తగిన పరి
వారముతోడను దాసదాసీబృందములతోడను నాచెల్లెలిని నాతోఁ
బంపుఁడు. ప్రతిదినము నామె యోగక్షేమము మీకుఁ దెలుపుచుం
దును. మాబాబయ్యగారు పెద్దలయినారు. నే నీక్షణమె తిన్నగా
మారాజ్యమునకే పోయి బాబయ్యగారికి, అమ్మాజీగారికి నాచెల్లెలిని
గనఁబఱచి వారలయనుమతిని వివాహప్రయత్నము జేసి మీచేతనే
కన్యాదానముచేయించి సెలవైనయెడల మీరాజ్యమున నిక్కడగాని,
లేనియెడల నదియు మాదేగనుక మారాజ్యమునఁగాని వివాహము
చేయింతును. ఇదియంతయు రెండుమూఁడుమాసములకు లోగానే చే
యింతును. (అప్పటికి తనకు ఆఱుమాసము లతిక్రమించి యేడవమాస
పుగర్భము) గనుక నిశ్చితగా నాచెల్లెలిని నాతోఁబంపుఁడు. వివాహ
మునకుఁరమ్మని మీకు శుభలేఖనంపువఱకు నాపరివార మాతోఁట
లోనే డేరాలలోనే యుండును. అప్పుడు మాతోఁ గూడవారువత్తురు
ఇప్పుడు కొంచెము పరివార మచటనుంచి తీసికొని నాచెల్లెలు నేను
పోదుము మీ రేమియు ననుమానింపవలదు." అని వారిపాదములు
ముట్టి ప్రమాణముచేసి యారాజుగారికూఁతురిని దీసికొనివచ్చి తోఁట
లోనున్న పరివారమును తానుతిరిగి వర్తమానముపంపువఱకు నచట
నే యుండుమని నియమించి వారికి వలయు జీతబత్తెముల నొసఁగి
తాను బయలుదేఱి తనతండ్రిగారిదేశమునకుఁ బోయెను. అట్లు పోవు
టకు ముందుగానే యొకదినము గడువుండఁగా తండ్రిగారికి చేరునటుల
మగఁడువ్రాసినటుల నొకచీటివ్రాసి యొకనౌకరుచేత తండ్రిగారికి

బంపెను. తండ్రిగారది యందుకొని మంత్రిచేతికిచ్చి చదువుకొని రమ్మనియంతఃపురమునకు బోయెను. మంత్రి యాచీటిని జదువుకొని యంతఃపురమునకుఁబోయి రాజదంపతుల కిట్లుచదివి వినిపించెను.

"శ్రీ మామయ్యగారి పాదపద్మముల సన్నిధికి—

అల్లుఁడు రఘునాధరాజు అనేక నమస్కారములుచేసి చేయంగల విన్నపములు. ఇచ్చట క్షేమము అచ్చట తమ సుఖసంతోషాతి శయములు నిరంతరము వ్రాయించఁగలకర్తలు. తమ యాశీర్వచనప్రభావముచేత మీకొమార్తె యంతర్వత్నియై యేడవమాసపు గర్భముతో నున్నది. ఇఁక రెండుమాసములలో శ్రీ యేలినవారి పేరిటివాఁడు మాద్దులుతనయుఁడుదయించి యేలినవారియొక్కయు శ్రీ అత్తయ్యగారియొక్కయు అంకపీఠి నలంకరింపఁగలఁడు మాసములు నిండినకొలఁది ప్రయాణ మాయాసముగా నుండును. కనుక తొమ్మిదవమాసమువఱకు నుంచి పంపించవలె నని కుతూహలము న్నను ఇప్పుడే తమ సముఖమునకుఁ బంపుకొన్నాను. నే నిక్కడ మఱిరెండుమాసములుండి వచ్చెదను. ఇంతలో తమవద్దనుంచి నాకు శుభలేఖకూడా రావచ్చునుగాన నన్ను క్షమించి యీరెండు మాసము లిచ్చటనుండుటకు ననుగ్రహించి మీకుమార్తెను క్షేమముగా ప్రవేశముగని యీవైనము తిరిగి నాకు మారుజవాబు ప్రసాదింతురని నమ్ముచున్నాను. ఇదియే పదివేలు కలంతాజా మా బాబయ్యగారిజాబుచూతురుగనుక వారికి వేఱేవ్రాయలేదు. అందుకు వారాగ్రహింపకుండ శ్రీ యేలినవారిదేభారము దివ్యచిత్తమునకు తేఁగలకరలు.

మకాం-సింహపురి.<br>క్రోధన సంIIరII ఆశ్వయుజ<br>శు ౭ మీా గురువారము.

ఇట్లు<br>రఘునాధరాజు.

జాబువిని రాజదంపతులును మంత్రియును బహుసంతోషమును బొందిరి రాజపత్ని సంతోషమునకు మేఱయేలేదు. రేపు అమ్మాజీ

యిక్కడికి వచ్చును. తగిన పరివారముతో నెదురేగి తోడికొనిరండని రాజదంపతు లాజ్ఞాపించిరి. మంత్రియు నట్టి యేర్పాటుచేసి తానును కోడలికెదురుగాఁ జనెను. ఇంతయు సుఖుసటివినను రాచకుమార్తె యుచితపరివారముతో తండ్రిగారిపట్టణమునకు పయనమైపోయి యంతఃపురములోనికి క్రొత్త రాచబిడను తీసికొని తలిదండ్రులకు తాను మొక్కి యామెచే మ్రొక్కించెను. ఇట్లు రాకముందు రెండురోజులు ప్రయాణము వచ్చి మూడవదినమున రాచకుమార్తె క్రొత్త రాచకుమార్తెను దగ్గఱదీసి కౌగలించుకొని ముద్దాడి "చెలెలా! నీవు నిజముగా నాసోదరివె. నాభర్తకే నిన్ను వివాహముసేతును. నాభర్తకు నాకు నొకపంతము వచ్చెను. ఆయన నన్ను మూడు పనులు చేయుమని చెప్పెను. ఆ మూడుపనులు చేయుని యెడల మూడు చెప్పుదెబ్బలు కొట్టుదుననియెను." అని తమకు మొదటినుంచి జరిగిన వృత్తాంతమంతయు నామెకు నామూలాగ్రముగా జెప్పి వారు చెప్పిన మూడుపనులలో మొదటిది మేడకట్టించితిని. రెండవది పాతివ్రత్యము చెడకుండ ఆయనయొద్దకేపోయి సాంగత్యమొనరించి గర్భవతినైతిని. ఇప్పు డేడవమాసము గర్భము. నేను సిందునమ్మకముతో దైవముపై నిభారముంచి భర్తనే దైవముగానమ్మి యాయనయొద్దనె కాపురము రహస్యముగా వారికిఁ దెలియకుండఁ జేసి గర్భవతినైతిని గనుఁక తప్పక యింక రెండు మాసములకు మగపిల్లవాఁడు కలుగును. మూడవది నిన్నాయనకువివాహ మొనరించుట. నిన్నే ఆయన మోహించెను." అనునంతలో "అక్కా! వారెక్కడ నున్నారు? నన్నెట్లు వరించిరి చెప్పు?" మని యడిగెను. "చెలెలా! వారు మీబాబయ్యగారి కొలువుకూటములో ప్రతిదినము వాడకుండా యేదినమున కాదినమే అప్పటికప్పుడే తయారుచేయబడినదానివలెఁ గనుపించుచుండు ఏకజాతిపుష్పమాల మెడలోధరించి వచ్చుచుండువా రెవరో వారే మన భర్తగారు. ఆదండ యెప్పుడువాడితె అప్పుడు నాపాతివ్రత్యమునకు హానివచ్చెనని మీరాలోచింపుఁడని వారి కాదండ నే నానవాలుగా నిచ్చితిని. అది చూచి మీబాబయ్యగారి మంత్రులే యిద్దఱు వర్తకుల నెపముతో నాపాతివ్రత్యమునకు భంగము కలుగఁజేతుమని

శపథముపలికి వచ్చినారు. "ఛీ, పాపాత్ములు వారిని నీయురికొయ్యకుఁ దగిలింపించి బుఱ్ఱతీయించినావుకావా?" అని చెల్లెలనెను. "చెల్లెలా! వారినిచంపించిన మనపనినెఱవేఱుటెట్లు? వారిచేతనే మేడ కట్టించితిని వారినిభ్రమపెట్టి దాసీనిబంపి వారిమొఱ్ఱతీర్చి వారిచేతనే భర్తగారికి "గాడిదలు చేనుమేయుటకువచ్చి గట్టుమీఁద గడ్డిమేసి చేనుమేసినట్లు సంతోషించి వెళ్లినవి. ఇందుకు తార్కాణము నా పుష్పమాలికయే" యని జాబిచ్చిపంపితిని. పిమ్మట నలువదిదినములు నలువదిస్త్రీలవలె వేషమువేసి వారియొద్ద సంభోగసుఖమునను భవించి యీనవాళ్లుపుచ్చుకొని మాయచేసి వెళ్లిపోవచ్చితిని. ఆనలువదిదినములలోను వారికి నాకు జరుగుప్రసంగములో నీప్రశంసవచ్చుచుండెడిది. ఒకనాఁడు నీవభ్యంగన మాచరించి మీఁదిమేడ తుట్టతుదయంతస్థున బట్టబైట తలవిరియఁబోసికొని యిద్దఱు చెలియొకరకక్కున నిలువఁబడి చిక్కువిప్పుచుండఁగా తాను గాలిపికారువెళ్ళుతు గుఱ్ఱముమీఁది నుండియే చూచి ఆగుఱ్ఱముపైననే కొన్నినిమిషములు స్మృతితప్పి మరలఁ దెలివి తెచ్చుకొనినట్లు వానిముఖతనే విన్నాను. అందుచే నీ యోగినివేషమున నీకొఱకువచ్చి నిన్నుఁదెచ్చితిని. దైవకృపచేత రెండు మాసములు కన్నులుమూసికొని నీవువచ్చియుంటివేని నాకుపుట్టుబిడ్డని తొడలపైఁ గూర్చుండి భారసాలమహోత్సవము చేయించి నీతో వివాహమంటపముపైఁ గూర్చుండి నీకు మంగళసూత్రధారణచేసి పెండ్లియాడునటులఁ జేతును. నాసుఖము తీరినదిగనుక నీవు భర్తతో సమస్తసుఖముల ననుభవించుచుందుము. నేనును మీయిద్దఱకు వలయు సౌఖ్యదాయకములగుపనులఁజేయుచు మీకు పరమానందము గలుగునటుల మీరు సర్వదా అంతఃపురములోనే సుఖసంగతినుండు నటుల చేసి రాజ్యభారము నేను చూచుకొనుచుందును. నీవుభర్తతో గాపురముచేసి బిడ్డలఁ గనుము. ఈబిడ్డఁడు నీబిడ్డఁడు. నీకుఁ గలుగు వారు నాబిడ్డలు" అని హితబోధచేసి యామెను పరమానంద భరితురాలుగా జేసి యోగినీవేషము తీయించి తానును తీసివేసి యెప్పటి రాచ కొమార్తెల వేషములతో నేగి రాజదంపతులకు నమస్కరించిరి. రాజ దంపతులును పరమానంద భరితు లయిరి.

పిమ్మట రాచకుమార్తె తల్లిదండ్రులను అత్తమామలను నొక్కనాఁడేకప్రదేశమున నుండునటుల తమనగరునకు వారిని బిలిపించి తనభర్తకును తనకును బడినుండి వచ్చుచుండఁగా బ్రాహ్మణుఁడు భార్యను త్రాళ్లతో త్రొక్కి కొట్టడము చూచినవెనుక జరిగిన పంతములు చెప్పి ఆప్రకారము తాను వానిసెలవు ప్రకారము మూడుపనులు చేసి సిద్ధముగా నుంటినని మేడయొక్కయు తన గర్భోత్పత్తియొక్కయు తనచెల్లెలు చిన్నరాచకుమార్తెయొక్కయు వృత్తాంతములు చెప్పి భర్తయున్న తావును పరివారముంచిన తోఁటయు వారికిచెప్పి రెండుమాసము లోర్చియుండుఁడని వారిని దృఢపరిచి ధైర్యములు కలవారినిగాఁ జేసి ప్రసవకాలము నెదురుచూచుచుండెను రాచకుమార్తెయొక్క ధైర్యసాహసములు విని కని వారాశ్చర్యపడుచు నామె పడ్డకష్టములకు కన్నులనీరు గ్రమ్ముచుండఁగా మరల నామెయొక్క సంతోషావస్థయు జూచిరికనుక వారోర్చిరిగాని లేని యెడల నిలువున నీరైపోదురుగదా!

ఇట్లు కాలముగడుపుచుండఁగా నొకదినమున అనఁగా మార్గశిరమాసములో "మాసానాం మార్గశీర్షోహం" అని గీతావాక్యము గనుక అట్టియుత్తమమైన మార్గశిరమాసమున శుక్లపక్షమునపౌర్ణిమా దినమున గ్రహపంచకం బుచ్ఛయం దుండఁగా మేషమందు రవియు తులయందు శనియు, మకరమందు కుజుఁడును, కర్కాటకమునందు గురుఁడును, మీనమందు శుక్రుఁడును, వృషభమందు చంద్రుఁడును, ఈప్రకార మయిదుగ్రహము లుచ్ఛదశయందు సూర్యునికి దూరముగానుండఁగా (బుధునికి అస్తంగతదోషము లేదు. బుధుఁడు సూర్యునితోనే చేరియుండఁగా) రాజకుమార్తె ధనుర్లగ్నమందు సూర్యచంద్రులనుమించు దేహకాంతిగల రెండవమన్మథుఁడో యనునట్టి కుమారరత్నమును గనెను. తలిదండ్రులు నత్తమామలు నానందరసనిర్మగ్నులైరి. కొత్తరాచకుమార్తె యామెదగ్గఱనే సూతికాగృహమందే యుండి యామెకుపచారములు చేయుచుండెను. పురుడు పదిదినములలోను రాచకుమార్తె కొత్తరాచకుమార్తెతో నాకీ పదిదినములు నీవుపచారముచేసినందులకుఁ నేఁడాదికి దశదినములు నీకిట్లు నే నుప

చారములు చేయుచుందుననుచు నామెనుసయితము సంతోషసముద్రమున నోలలాడించుచుండెను.

ఇట్లు పదిదినములు పురుడు వెళ్ళించుకొని పదకొండవ దినమున శుద్ధిపుణ్యాహవాచనము చేసికొని తల్లిదండ్రులు నత్తమామలు తనను తనముద్దుబిడడిని నతిగారాబముతోఁ జూచుచుండఁగా క్రొత్త రాచకుమార్తె తనతోఁగూడ మహాసంతోషముతో నాబిడ్డను తానుగన్న బిడ్డనివలె నెత్తుకొనుచు ముద్దులాడుచు తనతో నేకాసనైక శయ్యాహారవిహారాదులతో నలరారుచుండఁగా నొకదినమున వారల సమక్షమందు భర్తకును తనకును గలిగినశపథముఁ జెప్పి యాయన నియమించిన మూడుపనులు చేసితిని గనుక నిఁక నాయనను బిలిపించి యాక్రొత్త మేడలో నీపుత్రునికి బారసాలమహోత్సవము జరిగించి యావెంటనే యీ నాముద్దుచెల్లెలిని నాభర్తకు వివాహముచేసి వారిద్దరికి నమితానందము గలుగునటుల నేనువారికుపచారములుచేయుచు రాజ్యపరిపాలనము చూచుకొనుచుందునని చెప్పి యిరువది యొకటవ దినమున భారసాలముహూర్తము నిశ్చయించి భర్తగారికిట్లని యొక జాబు వ్రాసిపంపెను.

"మదీయాత్యంత ప్రియప్రాణనాయకులగు

రఘునాథభూపాలాగ్రణిగారికి—

తావకసేవకురాలు దాసి నిత్యము కాలత్రయములందు ననేక నమస్కారములు గావించి వ్రాసుకొను విజ్ఞాపనము. తమరు మనపునస్సంధాన మహోత్సవము నాటిరాత్రి నాతో సరస సల్లాపముల సంగీతవినోదముల క్రీడాభోగముల నానందాద్యవస్థ యొందుటమాని చిన్నతనములో మన మనుకొన్నమాటయె పాటించపనెంచి నన్ను నిష్కారణముగా మూడుచెప్పుదెబ్బలు కొట్టుటకు సిద్ధపడఁగా నేను కారణములేనిది యట్లుకొట్టకూడదని మందలించినను 'భార్యాభర్తలలో భర్త భార్యకు యజమాని దానియందు సర్వ స్వతంత్రములు గలవాఁడు. అట్టిభర్త యేమిచేసినను భార్య యూరకుండవలసినదేగాని మాఱుజవాబు చెప్పఁగూడదు. అట్లు చెప్పిన నదిపతివ్రతకాదు. అపతివ్రతయగు స్త్రీని శిక్షించుట దోషముగాదు. కనుక నీవు మాటాడక

నేను చేయుశిక్షకు బద్ధురాలవు కావలసినదేగాని జవాబు చెప్పవద్దంటిరి" అప్పుడు నేను తమరిని ననేకవిధముల బ్రతిమాలి "శిక్ష యనునది నేరమునకుగాని నేరములేనిశిక్ష లేదు. నేరమనగా మీయెడ నేను విపరీతముగా సంచరించుట. ఇంతవఱకు మీమనస్సు నెట్లయినక ష్టరించి వీణాగానము మొదలగు శృంగారకృత్యముల మీకు నాపయిని తమకము పుట్టించి మీతో క్రీడావినోదము ననుభవింపఁ లెనని ప్రయత్నించుచుంటిని మీరు నాకేమియు నాజ్ఞాపించలేదు. మీయాజ్ఞకు విరుద్ధముగా నేను నడువలేదు. గనుక నిపుడయినను మీరు నాకొకపని పురమాయించి యాపని నేను చేయలేకపోయినప్పుడు నన్ను మీయిష్టప్రకారము శిక్షింపవచ్చునని చెప్పి బ్రతిమాలుకొనఁగా,

(1) "అత్తయింటివారిసొమ్ము, పుట్టినింటివారి సొమ్ము గాక మధ్యనువచ్చినసొమ్ముతో నేడంతస్థుల మేడయొకటి కట్టవలెను.

(2) పాతివ్రత్యము చెడకుండా కొడుకును కనవలెను.

(3) నేను మోహించిన చిన్నదానిని నాకు వివాహము సేయవలెను."

అని మూఁడుపనులు పురమాయించి యుంటిరి. నేనట్లనే సేతునని యొప్పుకొని మీరుపురమాయించిన మూఁడుపనులుచేసి సిద్ధముగానున్నాను. కనుక తమరు వెంటనే దయచేసి నేను చేసినపనికి సంతోషించి నన్ను మున్నాటికి మీమనోహారిణిగా నాదరించెదరో లేక మీయిష్టాను, లేనిదే భార్యయందు భర్తకు సర్వస్వాతంత్ర్యము గలదు గనుక నేను కొట్టక మాననని మూర్ఖతచేత చెప్పుదెబ్బలు కొట్టెదరో (మీ చేత చెప్పుదెబ్బలుదిని యాచెప్పుతట్లు వీపునయినపొంగియుండగా నవియు నొక విధమగు నాభరణములేయగును. మీరెత్తిన చెప్పు నట్లనే దాచియుంచితిని. మీరు రాగానే చేతి కందించెదను.) చిత్తవృత్తిప్రకారము జరిగింపవచ్చును. దయచేయుఁడు, మీ మెడలోని పుష్పలదండ యింకను వాడకుండ దినదినము నూతనజాజ్వల్యమానప్రకాశముతో నుండుటయే ముఖ్యమైనసాక్ష్యము. నాప్రార్థనగైకొని వేగముగావత్తురుగాక! మిమ్ములనుసగౌరవముగా మనపురికిదోడితెచ్చుఁ

టకు పరివారమును గజాశ్వాందోళికలను పంపియుంటిని. వారు మీరున్న సింహపురికి రెండుక్రోసుల దూరములోనున్న మన యూరికి వచ్చి మార్గమున నున్న తోఁటలో విడిసియున్నారు. మీరు వారిని కలసికొని రాజమర్యాదతో తమవైభవములతోడను దయచేయుఁడు.

ఇట్లు విన్నవించు దాసి,
రాచకుమార్తె"

అని వ్రాసి యొక నౌఖరు చేతికిచ్చి పంపెను. జాబుతోఁగూడనే మఱియొక జాబు కొత్త రాచకుమార్తె తండ్రికి వ్రాసి యానిమిషముననే మఱియొక నౌఖరు చేతికిచ్చి వారికిఁబంపెను. ఆ రెండు జాబులను నిద్దరు నౌకరు లట్లు తీసికొని యేకగ్రామమే వెళ్లి రాజుగారికొక నౌఖరును మంత్రికుమారుని కొక నౌకరును జాబుల నందిచ్చిరి. రాజు తనజాబు చూచుకొని యంతఃపురమునకుఁబోయి రాణిగారికా జాబు చదివి వినిపించెను.

"శ్రీ మా బాబయ్యగారికి, మీకొమార్తె కపటయోగిని అనేక సాష్టాంగనమస్కారములు చేసి చేయఁగలవిన్నపములు. ఇచ్చట నాకున్నచెలెలు నేను సుఖముగా నున్నాము. నేను దశద్వీపచక్రవర్తి కుమార్తెనని లోగడ మీతో మనవిచేసియున్నాను. ఏ రాచకుమారుఁడు మీసభకు ప్రతిదినము వాడని మెడలో నిపూలదండతో వచ్చుచున్నాఁడో ఏదండ నిత్యము వాడకుండుటయేగాక జాజ్వల్యమానప్రకాశము నవనవపరిమళములు వెదజల్లుచుండగా మీరు చూచి విని మీ రడిగితే తమ భార్యపాతివ్రత్య మహాత్మ్యమని తాను సెలవిచ్చినపైని అట్టి పతివ్రతకు మానభంగము కలుగఁజేయవలెనని మంత్రులకు వలయు ధనమిచ్చి మీరు పంపఁగా నామంత్రులువచ్చి చేను మేయఁబోయి యట్లు చేయుటకు సాధ్యపడమి గట్టుమీఁది గడ్డిమేసి చేనుమేసినట్లు సంతసించి తిరిగి తమసమక్షమునకు వచ్చిరో ఆపతివ్రతను నేనే. తమయగ్రసుత నైతిని. ఆపూవులదండ ధరించి మీసభకనుదినము వచ్చుచుండెడి రాచకుమారుఁడె నాభర్తగారు కనుక వారు మీయల్లుఁడుగారె. వారికి నాకు జరిగినయొకశపథమువలన వారు నాకు మూఁడు పనులు పురమాయించి యవి నేను చేయనిచో మూఁడు చెప్పుదెబ్బలు

కొట్టెదమని చేసినచో మిగులకొనియాడెదమని ప్రతిజ్ఞచేసి యింత వఱకు దేశాంతరసంచారము చేసి వచ్చెదమని చెప్పి వెడలిపోయిరి. నా పుణ్యవశమున దూరము వెళ్ళకుండ సమీపమందేయున్న మీనగర మున వారు ప్రవేశించుటయు మీరు వారినాపి వేయుటయు జరిగినది ఇదినాకు మహోపకారము. తక్కిన యీవత్తువృత్తాంతము తమరిక్క డికి విజయముచేసినప్పుడు తమకు సర్వము విశదము కాఁగలదు. ఇదివఱ కయినట్లియు నిఁకమీఁదఁ గాఁబోవుచుండియు నీయల్లుఁడిగారిని సంయు తము వెంటఁబెట్టుకొని తోఁటలో మీకొఱకు నాచే నునుపఁబడిన పరి వారముతో సగౌరవముగా రాజకీవితో నల్లుఁడు మామ, బిడ్డలును, మా అమ్మాజీగారును దాసదాసీపరిజనమును వెంటనే విజయంచేసి నాచెలియలి వివాహమహోత్సవముజరిగించి మాయిదఱయొక్కయు వైభవముచూచి యానందింతురుగాక ! శీఘ్రముగా దయసేయవలెను. చిత్తగించవలెను.

ఇట్లు విన్నవించు మీయాగ్రసుత,
కపట యోగిని.
దశద్వీపచక్రవర్తి కుమార్తె."

అని వినిపించి రాజుగారు రాణిగారితో "దేవీ! నేను మహా పాపాత్ముఁడను. చూచితివా యీచిన్నదానిజాబు ? ఈమె వయసున నెంతచిన్నదియో బుద్ధిచేత నంతశతవృద్ధ. ప్రతిదినము వాడనిపూల దండ మెడలో ధరించి మనసభకు వచ్చుచుండెడి రాచకుమారుఁడే తనభర్తయనుట; దశద్వీపచక్రవర్తియగుండుట ఆమె పాతివ్రత్యము భం గపఱచుటకు మంత్రులకు ధనమిచ్చి పంపినవాఁడ నేను. సిగ్గుమాలి యీమెముఖ మెట్లు చూడఁగలను? యోగినీవేషమున వచ్చినప్పుడీవృ త్తాంత మామెకు తెలిసియుండియు నెంతగౌరవముగా చూచినదో చూడుము. ఇప్పుడు కర్తవ్యమేమి ? ముందుగా మంత్రులచే రాచ కుమారుని రావించి సగౌరవముగా నభ్యంగనాదికములు గావించి నూతనవస్త్రాభరణంబులచే నలంకరించి మనమే పెండ్లికొడుకును జేసి తగిన మర్యాదతో నాతని వెంటఁబెట్టుకొనిపోవుటయే ముఖ్యమయిన పనిగా నాకుఁ దోఁచుచున్న" దని చెప్పి యీమె యంగీకారముఁబడసి

మంత్రులఁబిలిచి పూలదండ మెడలోఁగల రాచకుమారుని రావించి యెదురేగి యాలింగనంబుచేసి యంతిపురమునకుఁ గొంపోయి దేవికి గనపఱిచి యాతఁడు మ్రొక్కిన దేవి దీవించి యిట్టి యల్లుఁడు గలుగుటకు మన మేమి నోమునోఁచితిమో యని యమందానందమును బొంది యతని కచ్చట నభ్యంగనాదిక మొనరించి నూతనదుకూలములం గట్టించి నానావిధాభరణముల నొసఁగి యలంకరించి యాతని ముందిడుకొని బయలువెడలి చతురంగసేనాసమేతముగా బోవుచు మార్గమధ్యమున రాచకుమారునికొఱకు రాచకుమార్తెయుంచిన దాసదాసీజనాదిపరివారమును గజతురంగాందోళికాది వాహనములను వెంటఁ దీసికొని ప్రయాణదినములలో రాజు తన పేదరాచకుమార్తె వ్రాసిన జాబు రాచకుమారునికిఁ గనఁబఱచి యిద్దఱు పరస్పరము రాచకుమార్తెయొక్క బుద్ధికిని గౌరవభావంబునకును తమయెడలఁ గనబఱచిన గౌరవాదులకు మెచ్చుకొని సంభాషించుకొనుచు గొన్నిదినములకు రాచకుమార్తె తండ్రిగారి పట్టణముఁ జేరుకొనిరి.

రాచకుమార్తెయు నంతకుముందే తాను గట్టించిన యేడంతస్తులమేడలో తాను తనకన్నసుతునితోడను తనచెల్లెలుగా భావింపఁబడిన కొత్తపెండ్లికూఁతురుతోడను నివసించియుండి తనభర్తగారిని నూతనగృహంబునకు రావలసినదనియు సింహపురి రాజగారిని వారి పరివారమును వారికై యేర్పఱుపఁబడిన విడిదెలలో విడియింపించుటకును తగినయేర్పాట్లుచేయించి తన నూతనగృహంబునకు మేడపైకిపోవుమెట్లయొద్ద నొక్కొక్కమెట్లుపై నొక్కొక్కపద్యముచొప్పున తాను వ్రాసికొన్న కాగితముల నంటించి మేడపయి హాలులో నొకబంగరు తొట్లయుయ్యెలలో శిశువును (తనకుమారుని) పండఁబెట్టి దానిబొజ్జున తాఁబుచ్చుకొన్న యుంగరమునుంచి పెండ్లికూఁతురును దానును మఱియొకగదిలో దాఁగియుండెను. రాచకుమారుఁడు (మంత్రికుమారుఁడు) మేడపైకిఁబోవుచు తాను చదివినపద్యములను తన స్వదస్తూరీనివ్రాసిన కాగితములను చూచుచు మేడపై హాలులో నుయ్యెలలో దేదీప్యమానముగా చందురునిబోలుముఖముతోను కోటిసూర్యప్రకాశముతోడను నిద్రించు నిజసుతునిజూచి వానిబొజ్జపైనున్న తన ముద్రటుంగరమును

దీసి తనవేళ్లల నిడుకొని బిడ్డనెత్తుకొని భార్యయెచ్చట నున్నదో యని నలుదిక్కులు పరికించుచుండఁగా రాచకుమార్తె ముందుగా క్రొత్త పెండ్లికూఁతురు నాయనపాదములపైఁ బడవైచి తానును సాష్టాంగ దండనమస్కారముఁగావించిభర్త గారుతన్నొందించినయాయాసమునకు దుఃఖముఁరాఁగా కన్నీరు గార్చుచు కొంతతడవు నిలుచుండి యావెం టనే యతివేగముగాఁ బోయి మొట్టమొదట తనను కొట్టుటకు భర్త యెత్తినచెప్పును చేతఁబట్టి తెచ్చి యాయనచేతనిడి తనవీపునొగ్గి వంగి యుండెను.

రాజకుమారుఁడును సిగ్గుపడి యావీపుపయిని చిన్నికొమరుని బాడఁబెట్టి చెప్పును దూరముగాఁ బారవైచి సిగ్గుపడి "చిన్నదానా! నేను నిన్ను చెప్పుదెబ్బలు కొట్టుచునంటినిగాని నీవు నన్ను కొట్టినట్లు గానె బాధించి సిగ్గుపడుచున్నాను." అనునంతలో నా రాచకుమార్తె "అట్టిమాట మీరనఁగూడదు. మీదాసిని నేను. అట్లు నాచేత మీరు చెప్పుదెబ్బలు తిన్నానందురా మీదుమిక్కిలి నాచే పాపమునుగూడ గట్టఁబెట్టుదురా? మీరే నన్ను కొట్టునట్టుగా నే నంగీకరింతును" అని కొంతసేపు పరస్పర సంభాషణముచే నడివిలోనుండఁగల పాలయులను పోఁగొట్టుకొని దాసదాసీలచేత భర్తగారికిఁగావలసిన యుపచారము లను రాచకుమార్తె జరుగునట్టియేర్పాట్లు చేయించి ముందు ప్రయ త్నమునకుఁగాను తండ్రి గారి భవనంబునకుఁ బోయెను అట్లు చని తలి దండ్రులకు నమస్కరించి "మీయల్లుఁడుగారు దయచేసినారు. వేగ ముగా భారసాలప్రియత్నము గావింపుఁడు." అనిచెప్పి యావెంటనే సింహపురిరాజుగారున్న విడిదెకుఁ బోయి యారాజదంపతులకు నమ స్కరించి ముందుగా రేపటిదినము నా భారసాలమహోత్సవము మీరు చిత్తగించి యెల్లుండి నాచెల్లెలివివాహప్రయత్నము సిద్ధముగానున్నది గనుక మీరు కన్యాదానముచేసి నాయనుంగుచెల్లెలికి వివాహము గావింపుఁ"డని ప్రార్థించెను. అంత నాసింహపురి రాజదంపతులమందా నందమునొంది యిట్లు—"తల్లీ! నీభారసాల రేపటిదినము కాఁగానే బాబయ్యగారియొక్కయు మాతాతగారియొక్కయు నను జ్ఞనుబొంది వారును నీవును తోడరాఁగా నీచెల్లెలివివాహము మనపురముననే

గావించుటకు నాకోరిక. యేమనగా నీవలెనే నీచెల్లెలును నాకు లేక లేక కల్గినయేకపుత్రికా విషయము. అట్టిదాని వివాహము దిలకింప నక్కడిప్రజలు చాలయభిలాష గల్గియున్నారు కావున వివాహము మాత్రము మచ్చటc గావించియాపైని నీవును నీచెల్లెలును మీాయిష్టము వచ్చినచోటననcగా నక్కడగాని యిక్కడగాని యుండవచ్చును. ఈనా ప్రార్థనము నీవంగీకరించి నీజననీజనకులచేతనైనము నంగీకరింపింతువు గాక!" అనిచెప్పెను. రాచకుమార్తెయు నందుల కంగీకరించి యటులనె కానిండని వారియొద్ద సెలవు గైకొని తలిదండ్రులయొద్దకు వచ్చెను.

దశద్వీపచక్రవర్తియు కూcతురి యభిప్రాయముప్రకారము మఱునాcడు మనుమనిభారసాలమహోత్సవముc గావించి రాజబంధువులను సామంతులనుమంత్రిపురోహితాదులను ప్రజలను సంతోషపెట్టి కూcతురితోడను అల్లునితోడను, మనుమనితోడను మహావైభవమును పొందుచుండcగా సింహపురిరాజు వచ్చి నమ్రతతో తనకోరిక నెఱింగించెను. అంత రాజకుమార్తెయు నిజజనకునితో వారికోర్కె దీర్పుcడని మనవిచేసి వారిచే నంగీకారభావమును గనపరచునట్లు చేసెను.

ఆమఱుసటిదినమున నందఱును బయలుదేఱి సింహపురముc బ్రవేశించి యదివఱ కలంకరింపcబడి సర్వసిద్ధముగా నున్నయాపురములో రాజకుమార్తెకు వివాహమహోత్సవము చాటించి యథావిధిగా వివాహముcగావించి యల్లునితోడను కూతునితోడను దశద్వీపచక్రవర్తియు నాతనికూcతురును సపరివారముగా నచ్చట నేయుండుట వలన వారితోడను బహువైభవముగా సముదానందము నొందుచుండెను. రాజులలోcగల మామూలుమర్యాదలప్రకారము పునస్సంధానమహోత్సవము నైతము వెంటనే నాగవల్లియయిన మఱునాcడే జరిపి నందున రాచకుమారుcడు (మంత్రికుమారుcడు)ను తన రెండవ భార్యయు నింద్రియసుఖముల నానందించుచు మదనక్రీడల ననల్పమగు నానందమున నోలలాడుచుండిరి. రాచకుమార్తెయు వారికివలయు నుపచారముల యథావిధిగా జరుగుప్రయత్నములు తానుజేయుచు వారిని సంతోషమున నోలలాడించుచు తనుపుచుండెను. ఇట్లు సింహపురిరాజుగారి ప్రార్థనపైని సింహపురిలో వారట్లొకమాసద్వయ ముండగా నా

రాచకుమార్తెకు గర్భచిహ్నములగుపడెను. అదిగని సింహపురిరాజు ప్రార్థనపయిని మంత్రికుమారుండు భార్యవచ్చుట పుట్టింటనుంచి తన పెద్దభార్యతో తాను దశద్వీపమునకు మామగారితోఁ బోయి యందు సమస్తభోగముల ననుభవించుచు గృహస్థధర్మమునకుఁగల యీషణ త్రియములలో నమూల్యమగు పుత్రేషణముతో సముద్రానాదమున నోలలాడుచుండెను.

అంత నాసింహపురిరాజును రాణియు గర్భవతియగుకూఁతునకు పుంశవనము సీమంతము మొదలగు లాంఛనములజరుపుచు గర్భదోహదము గావింపుచుండఁ దొమ్మిదిమాసములు నిండి పదియవమాసమున శుభదినమున శుభముహూర్తమున సూర్యచంద్రులనుమించు తేజః ప్రతాపములుగల కుమారుఁ డుదయమయ్యెను. వెంటనే రాజు తన యల్లునికి శుభలేఖవ్రాయించి బారసాలచేసికొనుటకు రమ్మనివ్రాయుచు వారినిబంపుచు దశద్వీపచక్రవర్తికి వ్రాయుటయేగాక నిజపుత్రీ సమేతముగా సపరివారముగా దయచేయుమనికూడ వ్రాసెను.

దశద్వీపచక్రవర్తియు సపరివారముగా దుహితృజామాతల వెంటబెట్టుకొని సింహపురికిం జని బారసాలమహోత్సవము చేయించి కొన్నిదినములచటనుండి పిమ్మట నొకానొకశుభదినమున సింహపురి రాజతో నిట్లనెను.

“మిత్రరత్నమా నీవును నేనును మన యీయల్లునిమూలమున మనకుమార్తెల నాతనికిచ్చి వివాహముగావించుటవలన నచిరకాలములోనే దౌహిత్రలాభములను బొందితిమి. మనదౌహిత్రులే మనకు వంశకర్తలు. వారలే మనరాజ్యములకు రాజులు మనమున్నంతకాలము మనుమలకు విద్యాబుద్ధులు చెప్పించుచు వారిని యువరాజపదవికి పట్టాభిషిక్తులఁ జేసి వారికి యుక్తవయసు వచ్చువఱకు సజీవులమై యుంటిమా? మనమేలేనిచో వారితల్లిదండ్రులే వారికిఁ బట్టాభిషేకములు చేయించి వారిచేతరాజ్యపరిపాలనంబు చేయింపఁగలరు. వీరల యోగక్షేమ మారయుచునుండి వార్ధక్యమున మనకులాచార ప్రకారము వానప్రస్థధర్మమును వారవలంబింతురుగాక! మన మున్నంతకాలము మనపుత్రికలు మనయింటనే తమతమపుత్రులతో నుందురు

గాక ! మనయల్లుఁడొక నెల యిచ్చటను మఱియొక నెల యచ్చటను నుండుచు నిద్దఱకు సంతోషముగలిగించుచు మనయోగక్షేమ మారయుచు నుండునుగాక ! ఇది నాచేసిన యేర్పాటు. దీనికి నీకేమైన యాక్షేపణ మున్నదా ?" యని యడిగెను. సింహపురిరాజు బంధువులును మిక్కిలిసంతోషించి "మనయూహలు మనయేర్పాటు మఱి యెందుకు ? అల్లునియిష్టప్రకారము జరుగునుగాక" యని చెప్పెను. అంత మంత్రికుమారుఁడును దశద్వీపచక్రవర్తి యగు తనమామగారు చేసినయేర్పాటున కంగీకరించి "యటులనే జరుగునుగాక" యనిచెప్పి చిన్నభార్యను పుట్టింటనేయుంచి పెద్దభార్యతోఁబోయి తనయూర సుఖముగానుండి యదిమొదలు నెలనెలకు నిచ్చటను నచ్చటను వాయించుచు భార్యలతో సకలసంపదలతో సౌఖ్యముగా నుండుచుండెను.

అట్లు కొంతకాలము గడచినపిమ్మట దశద్వీప చక్రవర్తియు సింహపురిరాజును తమతమ మనుమలను తమతమరాజ్యములకు యువరాజులుగా పట్టాభిషిక్తులం గావించి వారిమైనార్టీలలో రాజ్యభారము చూచుకొనుటకు నల్లుని నియమించి తాము వానప్రస్థమున కేగి యచ్చట మునివృత్తిని తపంబుగావించి కాలక్రమమున యోగమార్గమునఁ దనువులు విడిచి పరబ్రహ్మైక్యమును బొందిరి.

మంత్రికుమారుఁడును తనయిద్దఱు భార్యలతోడను రెండు రాజ్యములను పరిపాలనముచేసికొనుచు కొడుకులకు విద్యాభ్యాసము గజాశ్వాందోళికారోహణములు శరీర వ్యాయామాభ్యాసమును ధనుర్వేదము నితరవేదచతుష్టయమును శాస్త్రషట్కంబును చతుష్షష్టివిద్యలను చతుష్షష్టికళలను నేర్పించి వాటియందు పరిపూర్ణ ప్రజ్ఞావంతులుగఁ జేసి వారికి యుక్తవయస్సురాఁగానే వారికిఁ బట్టాభిషేకముగావించి కొంతకాలము వారుచేయురాజ్యపాలనంబు కనిపెట్టిచూచుచు నుండి వారిరాజ్యములు వారుపరిపాలించుకొనుచుండ వారి కనుకూల సంబంధములనుగూర్చి వివాహములుచేసి వారలును బిడ్డలనుకనఁగా కుమలు మనుమరాండ్రు గలవారిసంపదల నానందించుచునుండి ...శ్యము రాఁగానే వానప్రస్థాశ్రమమంగీకరించి యరణ్యము

నకుఁ దనయిద్దఱిభార్యలతోడనుచని యొకయాశ్రమ మేర్పఱచుకొని మునివృత్తిని తపంబుగావించి యోగమార్గమునఁ దానును దనభార్యలును కైవల్యప్రాప్తినొంది బ్రహ్మైక్యభావమున నుండిరి.

చదువరులారా! చూచితిరా? ఈ రాజకుమార్తె కనఁబఱచిన పాతివ్రత్యము, బంధుప్రేమ, స్వకార్యధురంధరత్వము పతివ్రతల కసాధ్య మొకటికలదా? పతివ్రతలకు త్రిమూర్తులును త్రింశత్కోటి దేవతలును సదాభయపడుచుందురు.

---

ష రా:—ఇట్టిపతివ్రతవిషయములుగల మఱికొన్నికథలు ప్రశస్తమయినవి కలవు. పాతివ్రత్యమననేమియో పతివ్రతలెట్టి సామర్థ్యము గనబఱచిరో ఆకథలనిందు ముందుముందు సాకల్యముగా వివరింతును. కులస్త్రీ లవిచదివి యానందింతురుగాక! స్త్రీలకుఁ బాతివ్రత్యమును పురుషులకు బ్రహ్మచర్యమునుకన్న వేఱుగా తపస్సవసరము లేదు. అట్టి స్త్రీ పురుషులచరిత్రము లిందు పొందుపఱుపబడినవి. అవి చదివి ప్రతివారును వారి ననుగమింపఁ బ్రయత్నింతురుగాక! ఇది యీకథల పుస్తకమువ్రాయుటకుగల ముఖ్యోద్దేశము.



# ఆంధ్ర నాటకములు

---

1 చింతామణి 2 వరవిక్రియము 3 మధుసేవ
పై మూడునాటకములును మహాకవి కాళ్లకూరి నారాయణ
రావుగారు రచియించినవి ఒక్కొకటి వెల రు 1- 0-0

1 గయోపాఖ్యానము 2 ప్రసన్నయాదవము
3 పారిజాతాపహరణము
పై మూడుగ్రంథములును చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు
రచియించినవి ఒక్కొక్కటి 0-8-0

కనక్తారనాటకము:—చందాల కేశవదాసుగారు 1- 4-0

సత్యహరిశ్చంద్రీయము:—బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు 1- 0-0

రామదాసునాటకము:—డి. గోపాలాచార్యులుగారు 1- 0-0

పాదుకాపట్టాభిషేకము:-పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు 1- 4-0

రసపుత్ర విజయము:—ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణశర్మగారు 1- 0-0

జయంతజయపాలము:—ఆకెళ్ల సత్యనారాయణగారు 0-12-0

రాధాకృష్ణ:—పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు 0-12-0

శ్రీకృష్ణతులాభారము:—ముత్తరాజు సుబ్బారావుగారు 1- 0-0

---

వలయువారు:—

మాదేటి సన్యాసయ్య అండు సన్సు, ఆంధ్రాబుక్కుడిపో,
రాజమండ్రి.

ఆంధ్రా బుక్కు

నవలలు.

## —: యువనయామినీ వినోదములు :—

పుస్తకమంతయు నూతనకథాకల్పనలతో నిండియుండును. కడుపుబ్బ నవ్వుపుట్టించు హాస్యరసము గుప్పింపబడినది. వీటినే అరాబియన్ నైట్సుకథలందురు. ప్రథమభాగము వెల 1—0—0

## మూడు చెప్పుదెబ్బలు అనుకథ.

ఈకథయందలి సందర్భము పాదరక్షాప్రయోగము ప్రధానముగుటచే పైనామముంచబడినది. ఇందలికథాసందర్భము అతిమనోహరమై శృంగారరస భూయిష్టముగనుండి చదువరుల నానందమున ముంచును.
వెల రు 0—8—0.

## ప్రహసనములు.

ఇది చిలకమర్తి లక్ష్మీనరసింహముపంతులుగారి షష్టిపూర్తి మహోత్సవమునకు తయారుకాబడిన వారు రచియించిన గ్రంథసంపుటములు పదింటిలో మొదటిసంపుటము. ఇందలి హాస్యరసప్రహసనములు చదివి ఆనందింపవలసినదే గాని వ్రాయనలవికాదు. కనకశునక ప్రహసనము మొదలగు 83 ప్రహసనములుగల 650 పుటలుగల మహాగ్రంథము. గ్లేజుకాగితములు. క్యాలికో బైండు వెల రు 3—0—0.

## భట్టివిక్రమార్కుని కథలు.

దీనియందు 32 విచిత్రమగు కథలు గలవు. 412 పుటలు. క్యాలికోబయిండు వెల రు 2—0—0.

## స్త్రీల వ్రతకథలు.

| | |
|---|---|
| మొదటిభాగము | వెల రు 0-6-0 |
| రెండవభాగము | 0-6-0 |
| మూడవభాగము | 0-6-0 |

వలయువారు:—

మాదేటి సన్యాసయ్య అండు సన్సు, ఆంధ్రాబుక్కుడిపో,
రాజమండ్రి.

ఆంధ్రా బుక్కు డిపో, రాజమండ్రి.

డాలి." మళ్ళీ పూర్వపు సంగతులన్నీ వరసాగ్గా జ్ఞాపకం తెచ్చు కొంటూ, ఒకళ్ళు మరిచిన దాన్ని, మరొకరు సరిదిద్దుకుంటూ—ఏడ వాలి కాబోలు! విధిలేక పైకి వెళ్ళా.

"ఆ కుర్చీలో కూర్చో—"

మాట్లాడకుండా కుర్చీలో కూలబడ్డా; ఆమె నా పాదాల దగ్గర కూర్చొని దీనంగాచూస్తూ, ఒక్కొక్కమాటగా అంది: "రాజూ!... ఎల్లుండి... మేం... వెళ్ళిపోతాం—" పోతూన్న మనోబలాన్ని పట్టు కుంటున్నా. ఆమె కంఠంలో మృదుత్వం వున్నా—ఆ మాటలకు నేను చాలా బాధపడ్డాను.

"ఎక్కడికి—వెళ్తారు?" అన్నా ఆతృతతో.

"మామతో శ్రీనగరం వెళ్తాం—"

"మళ్ళీ ఎప్పుడొస్తావ్?" అన్నా 'ఇదేదో షికారు వెళ్ళి తిరిగి వచ్చినంతసేపు పట్టదులే' అనుకుంటూ.

మాటల్ని కూర్చుకుంటూన్నట్టు, "ఇంక... రాము..." అనిచెప్పి మెల్లిగా తల వాల్చేసింది. గుంపులు గుంపులుగా ఊహా తరంగాలు పరుగెత్తసాగాయి. ఇంక రాదా? కనకం ఇంక నాకంటికి కనపడదా? అమ్మకూ కనకానికీ ఒక్కటే తేడా! అమ్మ ఎప్పటికీ కన్పించదు; కాని, కనకం ఎప్పటికైనా కన్పించొచ్చు. ఆమె మాటలు మా ఇద్దరి మధ్యా పెటని గోడల్ని వడివడిగా నిర్మింపసాగాయ్. తలతిరిగిపో తోంది; ఆ మామగాడు నాపాలిట యముడై, ఎందుకు దాపరించాడా అని ఆలోచిస్తున్నా.

కళ్ళు నీళ్ళతో నింపి, నా పాదాల్ని తాకుతూ అంది: "రాజూ! తప్పుల్ని చెయ్యటం మానవసహజం... తెలిసో తెలియకో నే నేమైనా తప్పులు చేసివుంటే... అన్నింటినీ క్షమించు... మరిచిపో... లోకంలో ఎన్ని సంయోగ వియోగాలు కలగటంలేదు? అందులో ఇదొకటి— ఇందులో విచారపడాల్సిందేముంది? ఒకప్పుడు హృదయాల్ని ఏకం చేసుకొన్న మనం—కొన్నాళ్ళపాటు దుఃఖిస్తాం—బాధపడతాం.

కాని, కాలచక్ర గంభీర గమనంలో అన్నీ మాయమౌతాయ్ ! జరిగిన జీవిత చరిత్రను తిరిగి తిరిగి తరిచి వెనక్కు మాచుకోకుండా వుండేం దుకు ఆత్మతోనే ఘోరంగా పోరాడాల్సి వుంటుంది..." వెచ్చని కన్నీటితో నా పాదధూళిని కడిగేస్తోంది.

తప్పులన్నీ తనవేనా క్షమించేందుకు ! ఇంత విశాల హృదయమా ఆమెది ? ఆమె మాటలు ఆమె చెవులకు మాధుర్యాన్ని సూచిస్తూ, తాత్కాలిక మనశ్శాంతిని ఇచ్చియ్యేమో కాని, నన్ను మాత్రం అంతు లేని ఆందోళనలోకి దిగతొక్కాయ్. ఆమె ఎక్కడికో పారిపోతూ న్నట్టు భావప్రపంచంలో చూస్తూ—ఆమె హస్తాన్ని గట్టిగా పట్టు కొని విషాద స్వరంతో, "ఇనకం ! అనుకొన్నాను—నువ్వు నా జీవిత పథానికి తోడునీడైె వుంటావని—" అన్నాను.

"ఒకళ్ళ జీవితానికి ఒకళ్ళు పూచీపడతారా రాజా? లోకమంతా మోసంతో నిండివుంది—నన్ను నువ్వెందుకు నమ్మాలి ? ఇకముం దన్నా నమ్మవోక; నమ్మి ద్రోహానికి గురై పశ్చాత్తాపపడతాం. జీవితంలో ప్రేమించటం కన్న బుద్ధితక్కువ పని మరోటిలేదు—ఎందు కంటే ప్రేమకు గురైన వాళ్ళందరూ—ఆ గగనకుసుమంలాటి ప్రే మను అందుకోలేక—ఓడిపోయి, రిక్తహస్తాలతో తిరిగి వొస్తారు కాబట్టి ! ఇంకెవరికీలేని అధికారతను నాకు ఇవ్వవోక. నేనుపోతాను— రేపు మరో స్త్రీ నీ జీవితంలో ఎదురవవొచ్చు. నేను ఇచ్చేమాత్రం ఆనందాన్ని ఏ స్త్రీ అయినా నీకు ఇవ్వగలదు. కాని ఆ ప్రేమపా శాన్ని చేతులారా మెడకుమాత్రం తగిలించుకోక—అంతా స్వప్నగత వృత్తాంతాలనుకో—మరిచిపో—" ఎల్లా మరచిపోగలను ? ఈనాడే —ఈవయస్సులోనే నేను పుట్టివుంటే—ఇది సాధ్యమౌతుందేమో !

"నా కది—చేతకాదు" అన్నా నాలోని లోపానికి ఏమన్నా మందువుందేమో తెలుసుకుందామని.

"ఎవరికీ చేతకాదు. కాని ప్రయత్నించాలి. అన్నీ మనకు మంచి రోజులే వుంటయ్యా ? ఒకప్పుడు నేను అనుకున్నాను—మన మధ్య

అన్నీ ఇలాటి సౌఖ్యదినాలే దొర్లిపోతయ్యాని. నువ్వు కాలేజీకి వెళ్ళి నా—మళ్ళీ తిరిగొస్తావనే ఆశను జ్ఞాపకం చేసుకుంటూ—ఆ 'పండుగ దినాల్ని' మాటి మాటికీ స్మృతికి తెచ్చుకుంటూ కూర్చునేదాన్ని. ఆసౌఖ్యం శాశ్వతంగా నిలబడ వొచ్చునేమో అనుకునేదాన్ని—నేను ఏమైతే అనుకున్నానో అంతా ఎదురైంది; నాగాలి మేడలు కూలిపొయ్యాయ్. అంతా మనం అనుకున్నట్టే జరుగుతే ఎన్నాళ్ళు, ఎన్నేళ్ళు జీవిస్తేమాత్రం తృప్తివుంటుందా ? అమ్మపోయిందికదా—ఆమెను క్రమేపీ మరిచిపోవూ ? కాలం గడుస్తున్నకొద్దీ పాత ఘట్టాలు, బూజుపట్టి హృదయంలోని చెత్త గదిలో దాక్కుంటాయ్—పోనీ రాజా! కనకం అనేది అసలు పుట్టనేలేదనుకో—లేక ఆమె—మీ అమ్మనే అనుసరించిందనుకో—చదువుకొన్నవాడివి—అనుభవాన్ని సంపాయించు. జీవితాన్ని ప్రేమ అనే కత్తితో ఖండించుకోవోక, జీవితంలో ఒక్క ప్రేమించటమేనా మానవుడు చెయ్యాల్సిన ఘనకార్యం? ప్రేమ వుంటే—అది స్వార్థానికి కొంతవరకూ ఉపయోగపడుతుంది ; కాని అది లోకానికీ, లోకచరిత్రకూ కూడా అనవసరం. అన్నీ తెలుసుకోవాల్సిన వాడివి—నువ్వే కంటనీరుపెడతావ్ దేనికి ?—" పమిట చెంగుతో మెల్లిగా నా కన్నీటి జలాన్ని అద్దింది.

సూర్యాస్తమయమై చీకట్లు లోకాన్ని ఆవరిస్తున్నాయ్. తారలు ఒక్కొక్కటిగా భూలోకాన్ని తొంగి తొంగి చూస్తున్నాయ్. కొన్ని క్షణాలపాటు—మాలో మాకు వివిధ నిగూఢ, విషాద భావాలు పరుగెత్తి వుంటాయ్—నిశ్శబ్దతను ఆరాధించాం.

గదంతా చీకటయిపోయింది. నా జీవితంకూడా ఇకముందు ఇంతేనా అనిపిస్తోంది. "ఇప్పుడే వస్తా" అని కనకం కిందికి వెళ్ళి—లాంతరు తెచ్చింది. ఆ సన్నని వెలుగులో ఆమె ముఖంలోని విషాద భావ మేఘాలు పూర్తిగా ఆక్రమించి, ఆమె ముద్దు మొగాన్ని మొద్దుగా—గుర్తు పట్టేందుకు వీల్లేనిదాన్నిగా తయారు చేశాయ్. బహుశా నా ముఖంకూడా అల్లాగే మారి వుంటుంది.

"కనకం! ఇప్పుడు ఆవూరు వెళ్ళేటంత అవసరం ఏం కలిగింది?" అన్నా.

"నీకు తెలీదూ? అమ్మకు క్షయవ్యాధట!... డాక్టర్లు గాలి మార్చాలని చెప్పారు; ఇక్కడ ఆమెను ఎవరు చూస్తారు రాజూ! ఆమెకూడా—తమ్ముడి దగ్గర చికిత్స పొందాలనే కుతూహలంతో వుంది—"

"ఈ ఇల్లు ఏం చేస్తారు మరి?"

నిట్టూర్చి అంది: "ఇన్నాళ్ళూ నాకూ్కడా తెలీదు—ఈ ఇల్లు తాకట్టు కింద వుందట—నాన్న కూడా మాకు ఎక్కువగా వదిలి వెళ్ళ లేదు రాజూ! ఇన్నాళ్ళూ సామాన్యుల మనుకొన్నాం; ఇప్పుడు చూసుకుంటే బీదవాళ్ళల్లో జమపడుతున్నాం. ఇది తెలియనన్నాళ్లూ—అజ్ఞానంలో, బాధపడలేదు; ఇకనుంచీ నా జీవితానికి ఇది కూడా ఒక సమస్య—క్లిష్ట సమస్యగా తయారైంది. ఒకప్పుడు ధనవంతుల్లాగు జీవించిన వారికి బీదరిక భారం—మొదటినుంచీ బీదవాళ్ళుగా ఉన్న వారికన్నా ఎక్కువగా ఉంటుంది. ఇన్నాళ్లుగా జీవిత మాధుర్యాన్ని అనుభవించామే అనీ, అది ఇప్పుడు లేదే అని యేడవాలి! ఇన్నాళ్లూ అమ్మ నా క్కావాల్సినవన్నీ ఎలా తెచ్చిఇవ్వగలిగిందో నాకు ఆశ్చ ర్యంగానేవుంది! ఉన్నదానికన్న ఎక్కువగా నటించటమూ—తాము భాగ్యవంతుల లిస్టులో స్థానాన్ని ఆక్రమించేందుకు ప్రయత్నం చెయ్య టమూ మనం చూడటంలా? ఇలా ఎన్నాళ్ళు లోకాన్ని మోసం చేస్తాం! ఐనా నేను బీదకుటుంబీకురాల్నని చెప్పుకునేందుకు సిగ్గుపడను; ఎందుకంటే—లోకంలో భాగ్యవంతులకన్న బీదవారే ఎక్కువ కాబట్టి! ఈ స్థితిలో నా జీవితానికీ, నీ జీవితానికీ పోల్చి చూసుకో! నిరాశ పడటమూ, అసంతృప్తిగా జీవితాన్ని గడపటమూ—ఏ మానవ హృదయమూ భరించలేదు. పరాయి గ్రామంలో నూతన వాతావరణం లో పడిగాపులు కాస్తూండటమూ—తలుచుకుంటేనే—అది ఘోర నరకంగా కన్పిస్తోంది; ఇన్నాళ్ళుగా పీల్చిన యీ గాలినీ, ప్రాణ

సమానంగా పెంచుకున్న ఈ పూలమొక్కల్నీ విడిచి వెళ్ళటం— నాకూ ఇష్టంలేదు రాజా! పరిస్థితులు మనకు తెలీకుండానే ఎల్లా మారుతయ్యో చూస్తే ఆశ్చర్యంగా వుంది. తప్పనిసరిగా ఎదుర్కోవాలి—గుండెను మొండి చేసుకు కూర్చోవాలి! అంతా మన ఇష్ట ప్రకారమే జరగాలంటే లోకమే తలకిందు లౌతుంది—"

ఈ ఇల్లు ఇంకోళ్ళ అధీనంలోకి వెళ్తుందా? నావి అనుకునే వస్తువులు ఎన్ని పోవటంలేదు! అంతా స్వప్నగత వస్తువుల్లాగు— ఈ క్షణంలో ఉన్నది మరుక్షణంలో మాయమౌతూ జీవితాన్నే బుద్బుదప్రాయంగా చేస్తోంది! నేనే అనుకుంటే—నాకన్న దుర్భర జీవితానికి గురవుతూన్న మరో ప్రాణిని చూసిన నాకు కన్నీరాగటం లేదు. మానవుడు చేతకాని—కన్నీటితో చూపే సానుభూతికన్న పొందే వేదన మరోటి వుండదు. పరిస్థితుల పరిణామంమీద నేకాజోలు —మానవజీవితమంతా ఆధారపడ్డది!

నా జీవితానికి సానుభూతి చూపేదీ, నా కష్టాలకు కన్నీరు కార్చేదీ—చీకటిలో సన్నని వెలుగును చూపి—మాటల్లోనయినా మంచి మార్గాన్ని సూచించేదీ—నా జీవిత నౌకను జాగ్రత్తగా నడిపే మరో నావికురాల్ని పోగొట్టుకొంటున్నా—ఇది జ్ఞాపకం వొచ్చి— నా భావి జీవితాంధకారమంతా కళ్ళయెదుట నాట్యమారంభించింది. కాని, ఎంత ప్రయత్నించినా చేతుల్లోంచి జారిపోతూన్న రత్నాన్ని ఎల్లా పట్టుకోగలను!

"నీకేం రాజా! మళ్ళీ కాలేజీకి వెళ్తావ్—కొంత కాలక్షేపం జరుగుతుంది. ఒక్కొక్క సమయాన కాలాన్ని చంపుకోవటంకూడా జీవితంలో సమస్యగా ఎదురైతే—ఎంత కష్టం! నాకు చూడు ఆ ప్రవాసంలోని ఒంటరి జీవితం—"

"ఇంక చదవను." "అదేం?"

"ఆరోగ్యం సరిగ్గా లేదనీ, ఇప్పుడు చదువుకు వెళ్ళొద్దనీ డాక్టర్ చెప్పాడు—"

"ఔను రాజూ! ఎలా చిక్కిపోయ్యావో చూడు; ముఖ వికాసమూ, కన్నుల్లోని జీవకళా క్షీణించాయి. ఇంతలోనే ఇలా అయిపోతావనుకోలేదు. బతికి బాగుంటే అదే పదివేలు! ఈ చదువుకోసమని నీ ఆరోగ్యాన్ని పాడుచేసుకోవోక. కాలేజీ కాంపౌండులో కూర్చొని సంపాయించే విజ్ఞానంకన్న—లోకంలో వుండి అంతకు అనేక రెట్లు విలువైన విజ్ఞానాన్ని సంపాయించొచ్చు—"

"చదువుకోసం పెళ్ళి—అంతకన్న నేను ముఖ్యమని తలచిన మరోరత్నాన్ని కోల్పోయ్యాను. ఈ చదువు ఇతరులకు ఎంత ఉపయోగించిందో కాని, నాకు మాత్రం హానే చేసింది. ఒకప్పుడు అనుకున్నాను: నాజీవితం రాణించనీ, క్షీణించనీ—నిన్ను విడవకూడదని. నాకు అంతా పొద్దెదురుగానే వుంది." మరికొంతసేపు ఇద్దరమూ మౌనంతోనే గడిపాం. నాలోని అంతర్వాణి ఏదో మూగవోయింది.

"మామతో నీ పెళ్ళి స్థిరపడ్డదా?—"

"రాజూ! నేను చాలా పట్టుదలమనిషిని; నేను చెప్పలేదూ—పెళ్ళి చేసుకోనని? చూడలేకపోవుగా—ముందు ముందు—"

ఆ ప్రస్తావనను మార్చేశా.

"శ్రీనగరం ఇక్కడికి ఎన్ని మైళ్ళువుంటుంది?" "ఎనభై—" అక్షరాలు మూడైనా అదెంత గొప్పదూరమో! కనకానికీ నాకూ మధ్య హిమవన్నగాలు అడ్డుపడతాయి కాబోలు; అక్కడి మనుములూ—నాగరికతా—ఎల్లా ఉంటుందో? భూమ్యాకాశాలకు మధ్య ఉన్న దూరమంటే—ఇప్పుడు నా బుర్రలో పనిచేస్తున్న 'దూరపు లెక్క' యేనా? మా లోకాలే వేరు వేరుగా మారుతయ్ కాబోలు! నా హస్తాన్ని ఆమె చెక్కిలిపై ఉంచి, "కనకం! నన్ను కూడా నీతో తీసుకువెళ్తావా?" అన్నా.

"ఎందుకూ!"

"ఇక్కడ నే నెల్లాగూ పిచ్చివాణ్ణయి పోతాను. నా శక్తినంతట్నీ లాక్కున్నావ్—మళ్ళీ దాన్ని ఇవ్వకుండానే నీదారిన

నువ్వు వెళ్ళిపోతున్నావ్. వెళ్ళిపొయ్యేదానివి—నీ హృదయంలో నాకు తావెందుకు ఇచ్చావ్ ? నాకు తెలీకుండానే నా హృదయం లో ఒక కనపడని గాయాన్ని చేశావ్—అది మానుముఖం పడుతుం దనే నమ్మకం నాకు లేదు—"

నవ్వింది—అందులో అంతా విషాదమే !

"మళ్ళీ మొదటికే దిగుతున్నావ్—రాజూ! నువ్వులేని ఈ నాళ్ళు నెల్లూ నే నెంతగా బాధపడ్డానో తెలుసా ? నాకు ఆ ఆనం దమూ—ఈ తోటా—ఆ స్కూలు రోజులూ—ఆ సరదాలూ— అన్నీ జ్ఞాపకానికొచ్చి—ఒంటరిగా కూర్చొని ఏడ్చేదాన్ని. ఈ ప్రకృతి అంతా మానవుడికోసమే తయారై కూర్చుందనుకోవటం మూర్ఖం! వెన్నెల ఎంతమందికి ఉపయోగపడుతోంది ? ఏ కొది మందికో—? ఆ రాత్రికి మాత్రం వాళ్ళు అదృష్టవంతులు! మనతో పని లేకుండానే సూర్యచంద్రులు తమ పనిని సక్రమంగా, నిర్విచా రంగా చేసుకుపోతారు. ఇదేం ప్రాణ గండమా ? ఊరికనే ఆశ్చర్య పడి, కలవరపడుతున్నావ్—రాజూ! నీకు నువ్వే ధైర్యం చెప్పుకో లేకపోతే—ని జీవితంమీదనే నీకు నిర్లక్ష్యత ఐతే—నువ్వేం సాధించ గలవు ?—" ఆమె ముఖభావం నాకు స్పష్టంగా అగుపడలేదు— కాని, నాలాగే ఆమె చిత్తక్షోభకు గురౌతోందని తెలుసు.

"జీవితంలో సౌఖ్యం కన్న కష్టం ఎక్కువ! ఆ సౌఖ్యాన్ని అను భవిస్తున్నప్పుడు—ముందున్న కష్టం సంగతి తెలీదు. ఇద్దరమూ సౌఖ్య పడ్డవాళ్ళమే—ఇకముందు ఇద్దరమూ కష్టపడవలసినవాళ్ళంకూడాను—" అన్నాను అనుభవంమీద.

ఎక్కణ్ణుంచో శక్తిని కూడతీసుకుంటూన్నట్టు గట్టిగా ఊపిరి పీల్చి, "రాజూ! ఇంకేం ఒద్దు—" అని నా పాదాన్ని తాకుతూ, "ఈ జీవితంలో ఇంకొక్కసారి... మనకు మంచిరోజులు వొచ్చిన ప్పుడు—నిన్ను చూస్తే చాలు—నా ఆత్మ ఆనందిస్తుంది. దీనికైనా భగవంతుడు—నాకు అవకాశం ఇచ్చి—అదృష్టవాల్ని చేస్తాడని నమ్మ

తున్నా—" అంది. ఈ జీవులకు ఏ పాశబంధన ఇంత గాఢంగా చుట్టబడ్డదని—సమాజంలో సమాన హక్కున్న తను నా పాదాల్ని తాకింది! నాకు ఒళ్ళు ఝుల్లుమంది. ఆమె కది మనశ్శాంతయినా—నాకు బాధగానే ఉంది. ఇద్దరమూ—మౌనంలో—వింతలోకాల్లోకి పోయి—అప్రయత్నంగా కన్నీటిని కార్చాం.

"ఏం లాభం రాజా! ఇద్దరమూ ఇల్లా ఎదురుగుండా కూర్చొని దుఃఖిస్తాం. ఇదీ ఒకందుకు మంచికే వొచ్చిందేమో! దూర దూరాన ఉంటేనేకాని మన బాధ్యతలు మనకు తెలీవు. పొట్లకాయకు కింద రాయి కడితేనేకాని, అది సరిగ్గా సాగదు—మనకుకూడా ఆ 'బాధ్యత' తెలీకపోతే—మన దృష్టి జీవితంలో సక్రమమార్గంవైపు మళ్ళదు...చాలా ఆలస్యమైంది రాజా! ఇంకోటి విను: నీ జీవితంలో నువ్వు సంతోషపెట్టాల్సిన వ్యక్తి మీ నాన్న ఒక్కడే! నన్నేమీ అనలేదు...మన స్నేహానికి నిన్నేమీ అనలేదు. ఆయనచేత మాటపడ్డావంటే—నువ్వు జీవితంలో క్షమించరానితప్పు చేశావనుకో—వెళ్ళు రాజా! ఆయన నీకోసం కనిపెట్టుకుంటాడు—ఈ అనాధను మరిచిపోతావా?" మరిచిపోగలనా? బాధను ఎవరు మరిచిపోగలరు?

"కనకం! వెళ్ళిపొయ్యేదానివి—నన్నెందుకు ప్రేమించావ్?"

నవ్వింది: "అప్పుడే ముందొచ్చేవన్నీ తెలుసుకునేందుకు—మనం జ్యోతిష్కులం కాదుగా! తిరిగి తిరిగి ఈ పిచ్చిభ్రమకు గురవబోక. నీకు ఇప్పుడైతే నేను సమాధానాలుచెప్పి ఓదార్చుతున్నా! నే వెళ్లాక నీకు నువ్వే చెప్పుకోవాలి—నీకప్పుడు ఎవరు చెప్తారు—పిచ్చిరాజా!"

"నిన్నక్కడ ఎవరు చూస్తారు కనకం? నీకు సానుభూతి ఎవరు చూపుతారు?"

"దిక్కు లేనివాళ్ళకు దైవమేగా దిక్కు! నా జీవితంసంగతి నాదే! నాదానికి నువ్వు కలతపడొద్దు—నీ జీవితాన్ని బాగుచేసుకునేందుకు చూసుకో, లోకానికి నువ్వు పనికొచ్చేమార్గాల్ని అన్వేషించు.

—రాజా! ఎంతసేపు నిలబడతావ్? వినలేక నీకు వినుగు కల్గటంలా? వెళ్ళు—"

సాగనంపింది—ఆ చీకటిసముద్రంలోకి. ఇందుకేనా నన్ను పిల్చింది? ఆ రాత్రి జాగ్రదావస్థలోనూ, సుషుప్తావస్థలోనూకూడా ఆమె మాటలు జ్ఞాపకంతెచ్చుకొని మనస్సును పాడుచేసుకొన్నా. కష్టాల్లో కన్పించే భగవత్స్వరూపం నామీద పనిచేసింది. ప్రేమపరిణామం ఇల్లా అవుతుందని ఎవ రనుకున్నారు? ఇకముందు ఈ ప్రేమతో పాడవకూడదనే దృఢనిశ్చయానికొచ్చా.

# 15

కనకం వెళ్ళిపోయిన కొన్నిరోజులవరకూ నన్ను నేనే గుర్తించుకోలేనిస్థితిలో ఉన్నా. ఎక్కడెక్కడ తిరిగేవాణ్ణో, ఏమేంచేసేవాణ్ణో కూడా నా అంతరాత్మకు తెలిసేదికాదు. మేము జీవితంలో గడిపిన ఆ మధుర తమ క్షణాలూ—ఆ ఇల్లూ, ఆ తోటా చూసినప్పుడు—హృదయం భారమై—విషాదమేఘంతో ఆవరింపబడేది. ఆ శూన్యగేహంలోకి తిరిగి ఎప్పటికైనా కనకం వొస్తుందేమో ననుకుంటూ ఉండేవాణ్ని.

ఆ ఇంటిచుట్టూ తిరిగే అవకాశంకూడా పోయింది; కనకం వెళ్లిన వారంలోపునే ఒక తాలూకాగుమాస్తా దాన్ని ఆక్రమించాడు; ఆయన తన పన్నెండేళ్ళ కూతుర్నొకదాన్ని నా కిస్తా నంటూ నాన్నదగ్గర కొచ్చాడు. ఇది జరిగిననాటినుంచీ అటు వెళ్ళే అవకాశంకూడా పోయింది!

ఇదివరకు నవ్వుకున్న జీవితం! అన్నీ అల్లాటివినాలే నని భ్రమపడ్డ జీవితం! ఇప్పుడు తెలుస్తోంది—ఆ నవ్వులో ఇమిడివున్న ఏడ్పు! నదిఒడ్డున కూర్చొని, నిశ్చలంగా, నిర్మలంగా పాకిపోయ్యే ప్రవాహాన్ని చూసి, 'ఇ దేమంత లో తుంటుంది?' అని డంబాలుకొట్టిన

రోజులు వెనకవి; తీరా దిగాక ఉక్కిరిబిక్కిరై—పోయ్యే ప్రాణం వొచ్చే ప్రాణంగా గ్రహించిన దినాలివి! అనుభవాని కొచ్చేదాకా ప్రతిదీ ఇల్లాగే ఉంటుందికాబోలు!

మా ఇంటిపరిస్థితుల్లోకూడా మార్పొకటి జరిగింది. నిరాధారంగా —ఒక కుమార్తెతోసహా ఈ లోకంలో నిలిచివున్న—నాన్న వేలు విడిచిన చెల్లెలొకతె అమ్మ జబ్బుపడే ముందునుంచీ మాకు వొండిపెట్టేందుకు మా ఇంట దిగింది..

"చిన్నప్పుడు నిన్ను పెంచేదాన్ని బాబూ! నువ్వు మీ అమ్మను వొదిలి నా దగ్గరకు పరుగెత్తుకొచ్చేవాడివి...ఇప్పుడవన్నీ మరిచి పోయ్యావనుకుంటూ..." అనేది. ఇంకా ఆ పాతపురాణాలు కూడా భద్రంగా తల్లో దాచుకొని ఏడవమంటుందా!

ఈ కాలంలో కొన్ని చెడునే్నహాలు కూడా అలవాటైనై. సిగరెట్లు తాగటం బాగా పట్టుబడ్డది. ఆ పొగపీల్చే ఆనందంలో ఈ విచారాన్ని కొంతవరకూ మరిచిపొయ్యేవాణ్ణి; ఇవి ప్రత్యామ్నాయాలుగా పనికొచ్చినై. ఇంట్లోకన్న బైటనే ఎక్కువ కాలం గడిచి పొయ్యేది. ఆ వేళకు రెండు మెతుకులు నోట్లో వేసుకొని—సామాన్యంగా పదిమందీ కూడుకునేచోటజేరి మెల్లిమెల్లిగా పాకిపొయ్యేనీడల్ని చూసుకుంటూ కూర్చునేవాణ్ణి. వృధాగా అతి విలువైనకాలమంతా రెక్కలు కట్టుకొని ఎగిరిపోతోంది. ఇల్లాగే రోజులు వారాలుగా, నెలలుగా, సంవత్సరాలుగా గడిచినకొద్దీ మనశ్శాంతి రాకపోతుందా అని నాకు నేను సమాధానం చెప్పుకునేవాణ్ణి.

చీకట్లో, చంద్రుణ్ణో, తారల్నో చూసుకుంటూ—ఒక వైపు నుంచి మరో వైపుకు దొర్లుతూ—పట్ట బలవంతాన నిద్రాదేవిని వరిద్దామని గట్టిగా మూసుకున్న కనురెప్పల్ని తోసుకుంటూ వొచ్చే ఊహల్తో రాత్రుల్ని గడిపే వాణ్ణి. ఎన్నో ప్రసిద్ధ పుస్తకాల్ని చదివా; ఎంతచేసినా మనశ్శాంతిలేదు; ఒక సామాన్య మానవహృదయం భరించలేని బాధ అంటే ఇదేనేమో!

వేదాంత గ్రంథాలుకూడా నా దృష్టిని ఆకర్షించలేక పొయ్యాయ్. ఆ వేదాంతులకు, నాలాటి ఊహాపోహాలు లేకపొయ్యాయి కాబోలు! సావిట్లోంచి వెళ్ళబోతుంటే మాటలు విన్పించాయ్—ఆగి విన్నా, నాన్నా, అత్తయ్యా మాట్లాడుకుంటున్నారు.

"—పిల్ల పెద్దదైపోతోంది. ఇప్పటికే పదిహేను సంవత్సరాలొచ్చె! ఇన్నాళ్ళూ సంబంధాలు దొరక్క, దొరికినవి నచ్చక—గడిచిపోయింది. నువ్వు ఒకమాట అని వుంటేచాలు అన్నయ్యా—"

"అవునమ్మా! డాక్టర్ కూడా అదేచెప్తున్నాడు; త్వరగా పెళ్ళి చేసెయ్యటమే మంచిదనుకుంటున్నా. పరాయివాళ్ళను తెచ్చుకొని నెత్తిన ఎక్కించుకోవటందేనికి! దానికెల్లాగూ చూసే ప్రాప్తి లేకనే పోయింది; ఏదో ఉన్నదాంట్లోనే ఉందాం. మాటకేముంది? నాకు అన్నివిధాలానచ్చింది; ప్రభకూడా కట్టుబాట్లలో పెరిగింది. దాని సంసారాన్ని అది చక్క పెట్టుకో గలదనే ధైర్యం నాకువుంది. ఆలోచించా—వచ్చే నెల్లో లగ్నాలున్నాయట—త్వరగా ముడిపడితే ఈ జన్మానికి నేను చెయ్యవలసిన కార్యాలన్నీ తీరినట్టే..."

"వాణ్ణి అడగవూ—?"

"ఏం అడగాలి? మూడు మాసాలనుంచీ కళ్ళ ఎదుట తిరుగుతూన్న పిల్ల; అదేం కురూపికాదు; తెలివితేటల్లేని మొద్దూకాదు. దానికేం లోపముందని—అడగాలి?"

"అదే అన్నయ్యా! చిన్న సన్నాసి, పుట్టి బుద్ధెరిగి నప్పటినుంచీ నాదగ్గరే వుంటూంది; దాని ముచ్చట్లన్నీ తీరకుండానే ఉన్నాయ్. ఏ పరాయి ఇంటికివెళ్ళి దిగులుపడుతుందేమో ననుకునేదాన్ని—"

"నీ కెందుకు—వీలైనంత త్వరలోనే మూడు ముళ్ళూ పడేట్టు చూస్తానుగా—!"

ఇంక మాటలు కట్టిపెట్టారు. ప్రభావతిని నాకిచ్చి వివాహం చేద్దామనే గూడుపుఠాణీ బైటపడ్డాక—గదిలోకివెళ్ళి నాలోనేను వితర్కించుకోసాగాను. ప్రభ! నిజానికది అందమైనదే. దాంతోమాట్లాడాలని

ఉన్న నాగొడవలో నేనుండి దాన్నెప్పుడూ పలకరించనుకూడాలేదు నేను లేనిసమయంలో నాగదిలో అల్లరిచిల్లరగాపారేసినవస్తువుల్ని జాగ్రతగా సర్దటమూ — నేను కాల్చి పారేసిన సిగరెట్టుపీకల్ని తీసేసి గదిని శుభ్రంచెయ్యటమూ, తన పనిగా చూసుకొనేది; గదిలో ఏవైనా తనకు అర్థమయ్యే తెలుగుపుస్తకాలుంటే — ఇంట్లో ఎక్కడవున్నా కూర్చొని వాటిని చదువుకునేది. నాలాగే అదికూడా ఎవరికోసమన్నా దిగులుపడుతోందేమో ననుకునేవాణ్ణి. తల్లికి సహాయంగా పైపనుల్ని చూసుకుంటూఉండేది; ఒకళ్ళనొకళ్ళం ఇన్నాళ్ళూ లెక్కచెయ్యకుండానే కాలాన్ని వెళ్ళబుచ్చుకున్నాం కాబోలు! అనవసరంగా అది మాట్లాడంకానీ, ఉపన్యాసాలివ్వంకానీ నేను గమనించలేదు. గ్రామీణ వాతావరణంలో పెరిగింది; ఈ ఫ్యాషన్లూ, నాగరికతా ఆమెమీద పూర్తిగా పనిచెయ్యకపోయినా, ఆమెలో ఏదో అందం ఇమిడివుందని నా కవశో చెప్తున్నట్టుంది!

ఇంతవరకూ నాకు తెలీనివిషయం — ఆమె నాకు అవబోయ్యే ధర్మపత్నా? ముక్కూ మొంగమూ ఎరగని మమ్మల్ని దంపతులుగా తయారుచేస్తే ముందున్న సంసారసాగరంలో ఇద్దరమూ అన్యోన్యంగా పని కొయ్యొద్దా? నా అంగీకారమే అనవసరమనుకొన్నాడే నాన్న — ఆమెతో కాపరం చెయ్యవలసిన బాధ్యత నాక్కాదా! ఒకరి అభిప్రాయాల్తో ఒకళ్ళవి వీడిపోతూ, ఒకళ్ళను మరొకళ్ళు అర్థంచేసుకోలేక, అయోమయజీవితానికి గురవుతే ఏవరి తప్పవుతుంది? తీరా దంపతులుగా అతుకుపడ్డతరవాత — నీవలాగు అంటిపెట్టుకొనివుండేభార్యను వదిలించుకోవటం చేతకాక, తప్పనిసరిగా వ్యక్తిత్వాన్నే మరిచిపోయి కాపరం చెయ్యవలసిఉంటుందేమో? అప్పుడు పశ్చాత్తాపపడి ఏం ప్రయోజనం? పెళ్ళిచేసుకొన్నాక బాధపడటంకన్నా, చేసుకోకుండానే ఉండటం మంచిదేమో? ఆమె ఇష్టాఇష్టాల్తోకూడా పనిలేదా? ఒకే వస్తువు వివిధవ్యక్తులకు వివిధ విధాలుగా కన్పించటమూ, భేదాభిప్రాయాల్ని ఇవ్వటమూ ఈనాటికీ కొత్తకాదుగా!

ఈ వివాహసంస్కారికాబోయ్యే మాలో మాకే నమ్మకమూ, స్నేహభావమూ కుదరకపోతే—ఈ మంత్రాలూ, మంగళసూత్రబంధనాలూ, మామిడాకుతోరణాలూ, మంగళహారతులూ, వ్రతాలూ, నోములూ, పూజలూ మమ్మల్ని ఏకం చెయ్యగలవా? ఇష్టం ఉన్నా లేకున్నా పైనుండి క్రతువును జరిపే పెద్దమనుషుల అభిలాషసిద్ధికోసం దంపతులుగా నటించాలా! బొమ్మలపెళ్లిలాగు—ప్రాణం వున్న ఈ గబ్బురుబొమ్మలను ఎదురుపెట్టి—బలవంతాన తలంబ్రాలుపోయించి బాకాలూది, చెవులు చిల్లులుపడేట్టు రండోళ్ళువాయించి, ఊరేగించటమే పైవాళ్ళకు సరదాయా! జంతువుల్లోలాగు జతకట్టించి జగత్కల్యాణార్థం పిల్లల్ని కనమని ఆజ్ఞాపించటమేనా—ఆదర్శం! పిల్లల్ని కనటమే ఘనమైనకార్యమైతే—కుచేలుడు మనకు దేవుడు, గురువు, ఆదర్శపురుషుడూ అయితీరాలి!

నా అభివృద్ధిని కోరే నాన్న నన్ను మోసం చేస్తాడా! అమ్మ చనిపోతూ చెప్పిన మాటలు జ్ఞాపకమొచ్చాయ్. నా జీవితానికి ఇకనుంచీ వేరొక వ్యక్తిసహాయం అవసరమేమో? ముందు ప్రభకు ఇష్టమో కాదో తేల్చుకోవాలనుకున్నా. ఏమైనా కొంత వ్యవధి ఉంది; ఆ వ్యవధిలో తుదినిశ్చయానికి రాలేకపోతానా? ఈ వివాహం నా మనశ్శాంతికి కొంతవరకూ సహాయం చేస్తే దీన్ని తప్పక నిర్వర్తించాలనుకున్నా. ఎన్నో పిచ్చిఆలోచనలతో నా హృదయం నిండిపోయింది.

# 16

ఏటికి వెళ్లినట్లు వెళ్ళంగానే ప్రభ నా గదిలో ప్రవేశించింది. మధ్యాహ్నం, నాన్నా, అత్తా, మామూలుగా నిద్రలోనే నిమగ్నమై ఉన్నారు. చప్పున గదిలో ప్రవేశించా; ఆమె ఆశ్చర్యపోయినట్లు చూసి తలొంచుకొని వెళ్ళిపోబోయింది.

"ప్రభా!" మొట్టమొదటిసారి ఆమెను పిలిచా. ఆమె పెదవులైతే కదలలేదు కాని, ఆగింది.

"నీతో మాట్లాడాలి..." "చెప్పండి—"

"ఇక్కడ కూర్చో." కుర్చీ చూపా.

"ఫర్వాలేదు—ఇక్కడ నిలబడ్డాగా—" పురుషుడూ, కాబోయే భర్త—ఎదుట నిలబడి వుండగా, కూర్చోవటం హిందూ స్త్రీ ధర్మం కాదని ఆమెక్కూడా తెలుసేమో!

"మొన్న నాన్న ఏమిటీ నిన్ను అడిగింది?"

"చాలా అడుగుతూ వుంటారు; జ్ఞాపకంలేదు." ఆమెనోటివెంట చెప్పించాలనుకొన్నది చెప్పించలేక పొయ్యా! అయినా అందిద్దామనుకొన్నా. "వాడు సిగరెట్లు తాగుతున్నాడా—అని కదూ అడిగింది?" ఔనన్నట్లు తల వూపింది.

"నువ్వేమన్నావు?" తనలోతను నవ్వుకొని అంది: "తాగుతున్నారన్నా." ఇది సర్వాబద్ధమని చెవులారా విన్ననాకు తెలీక పోలేదు.

"చంపావ్—నిజమే చెప్పావూ?"

"ఈ కాస్త దానికే అబద్ధ మాడమంటారా?"

"నువ్వెప్పుడూ అబద్ధమాడలా?"

"ఊహూ." అని తల అడ్డంగా తిప్పింది.

"ఇప్పుడు నాదగ్గర అబద్ధమాడలా?"

"లే—దు" "నేను వినలేదనుకొన్నావా?"

"ఏమన్నాను—చెప్పండి."

"ఏమన్నావంటే..." సరిగ్గా ఆమె చెప్పిన మాటల్నే నెమరు వేసుకుంటూ సాగించాను..."సిగరెట్లు తాగటం లేదు—అన్నావు. అప్పుడు ఆయన 'గదిలో కాల్చేసిన సిగరెట్లు లేవూ?' అన్నారు. 'ఎప్పటివో!' అని నువ్వు సమాధానం చెప్పావ్. అప్పుడు నాన్నదగ్గరా ఇప్పుడు నాదగ్గరా—రెండుసార్లు అబద్ధమాడావ్—అవునా?"

తల వొంచుకొని నేలచూపులు చూస్తూ, "మీకు తెలిసివుండి

నన్నెందుకు అడిగారూ"? అంది.

"ఊరికనే అడిగాలే...నాన్న దగ్గర నా కోసం అబద్ధమాడితే నాకు పట్టింపు లేదు కాని—నా దగ్గర మాత్రం దాన్ని ప్రయోగించ బోక...ఏం?"

"మీ ఎక్కువా—ఆయన తక్కువానా?"

"కనీసం—నీ దృష్టిలోనన్నా ఆ మాత్రం విలువ ఇవ్వవూ?"

"సరే లెండి—" ఇంత సంభాషణ సాగినా నాకు కావాల్సిన అసలు విషయం బైట పడనేలేదు. అది ఎల్లా చెప్తామా అని ఆలోచిస్తూన్నా. ఆమె వెళ్ళిపోబోయింది. ఈ సమయంపోతే మళ్ళీ దొరుకుతుందో—దొరకదో?

"కొంచెం మంచినీళ్ళు తెచ్చిపెడతావూ?" నిజానికి నాకు దాహం లేకపోయినా—కొంత ఆలస్యం జరుపాలని ఈ ఎత్తువేశా..ఆమె తలవూపి నిష్క్రమించింది. ఆలోచిస్తున్నా—ఎల్లాగా కదపటమని. ఆమె తెచ్చిన నీరు కొంచెం తాగి గ్లాసు కింద ఉంచా; ఆమె గ్లాసు కోసం వొంగుతోంది.

"ప్రభా!—విన్నావా?" ఒక్కసారిగా లేచి నిలబడి, "ఏమిటి?" అని ప్రశ్నార్థకంగా చూసింది.

"నీ పెళ్ళట—"

ముఖం ముడిచి, "ఫోండి—" అని మడమమీద గిరుక్కున తిరిగింది.

ఆమె దారికి అడ్డు నిలిచి, "ప్రభా! నిజం చెప్పు—నేను నీకు నచ్చానా?" అన్నా.

"నన్ను పోనివ్వండి—" ఆమె మాటను తోసేసి, "కాదు ప్రభా! సిగ్గుపడుతున్నావ్—ఒక్కమాట చెప్పు—ఇష్టమేనా?" బొటనవేలు నేల రాస్తూ, పాతాళంలోకి చూస్తోంది, ఒకవిధమైన సిగ్గుతో ఆమె ముఖం ఎర్రనైంది.

"చెప్పవూ...?"

"నన్ను పోనివ్వండి—"

"ఒక్క మాట చెప్పి—వెళ్ళిపోదువుగాని—" పోతపోసిన విగ్రహంలాగు నిలబడ్డది.

"ఇష్టంలేదు...అవునా?—ఏం?" ఆమె భంగిమలో మార్పు లేదు; నోట మాటా లేదు.

"ఇష్టమే....ఏం?...ఊఁ....ఏం?"

"ఊఁ" అని దీర్ఘం తీస్తూ, నన్ను తోసుకొని—ఒక్క నిమిషంలో నా దృక్పథంనుంచి మాయమైంది. ఈ ఉపసమస్య తీరింది.

ఈ లోకంలో రెండురకాల మనుషులున్నారు. నిశ్చయాన్ని ముందు వెనుకలు ఆలోచించకుండానే నిర్ణయించుకొనేవాళ్ళు మొదటి రకం; దరీ దాపూ లేని ఆలోచనను అన్ని వైపులకూ సాగించి నిశ్చయాని కొచ్చేవాళ్లు రెండోరకం. ఈ రెండో రకంలో—నిశ్చయమే లేక, పుణ్యకాలం కాస్తా దాటిపోయినా ఇంకా ఆలోచనతోనే కొట్టుకునేవాళ్ళు 'అతివాదులు!' నేను మొదటి రకం మనిషినే అయినా—ఈ సమస్యా పరిష్కారంలో బుర్రకు కొద్ది పనిని ఇవ్వదలిచా.

వివాహమంటే జీవితాంతంవరకూ పథ నిర్ణయమున్న మాట! ముందు జరగబొయ్యే సంఘటన్ని ఎంత జ్యోతిష్కుడైనా ఎలా కలకంటాడు? ఆ శక్తిఉన్న జ్యోతిష్కుల సంసారాలన్నీ సక్రమంగా సాగుతున్నాయా? ఈ జీవిని ఇంకో జీవికి శాశ్వతంగా అంటకట్టుకోవటం—కొన్ని నిబంధనలకు లోబడిపోయి జీవితాన్ని గడపటమే కాబోలు—వైవాహిక జీవితమంటే!

పాపం! బీదరికంతో కృంగి కృశించిన ప్రభను చూస్తే జాలేస్తుంది! ఆమె ధరించే చౌకరకపు దుస్తులు—అవ్వైనా బహుకొద్ది! ఆమె గుణాల్నిపట్టి ఎవరు ఆమెకు విలువ కడతారు? విలువలేనన్నాళ్ళూ ఆమె యెవరికీ పనికిరాదు కాబోలు! ఒక శాశ్వత సంబంధంతో ఆమె ఒక 'ఇల్లాలు' ఐతేనే కాని ఆమెకు యీ సంఘంలో గౌరవం రాదు. సంసారంలోవున్న సౌఖ్యాన్ని అనుభవించే శక్తి అందరికీ

నన్నెందుకు అడిగారూ"? అంది.

"ఊరికనే అడిగాలే...నాన్న దగ్గర నా కోసం అబద్ధమాడితే నాకు పట్టింపు లేదు కాని—నా దగ్గర మాత్రం దాన్ని ప్రయోగించబోక...ఏం?"

"మీ ఎక్కువా—ఆయన తక్కువానా?"

"కనీసం—నీ దృష్టిలోనన్నా ఆ మాత్రం విలువ ఇవ్వవూ?"

"సరే లెండి—" ఇంత సంభాషణ సాగినా నాకు కావాల్సిన అసలు విషయం బైట పడనే లేదు. అది ఎల్లా చెప్తామా అని ఆలోచిస్తూన్నా. ఆమె వెళ్ళిపోబోయింది. ఈ సమయంపోతే మళ్ళీ దొరుకుతుందో—దొరకదో?

"కొంచెం మంచినీళ్ళు తెచ్చిపెడతావూ?" నిజానికి నాకు దాహం లేకపోయినా—కొంత ఆలస్యం జరుపాలని ఈ ఎత్తువేశా..ఆమె తలవూపి నిష్క్రమించింది. ఆలోచిస్తున్నా—ఎల్లాగా కదపటమని. ఆమె తెచ్చిన నీరు కొంచెం తాగి గ్లాసు కింద ఉంచా; ఆమె గ్లాసు కోసం వొంగుతోంది.

"ప్రభా!—విన్నావా?" ఒక్కసారిగా లేచి నిలబడి, "ఏమిటి?" అని ప్రశ్నార్థకంగా చూసింది.

"ని పెళ్ళట—"

ముఖం ముడిచి, "ఫోండి—" అని మడమమీద గిరుక్కున తిరిగింది.

ఆమె దారికి అడ్డు నిలిచి, "ప్రభా! నిజం చెప్పూ—నేను నీకు నచ్చానా?" అన్నా.

"నన్ను పోనివ్వండి—" ఆమె మాటను తోసేసి, "కాదు ప్రభా! సిగ్గుపడుతున్నావ్—ఒక్కమాట చెప్పూ—ఇష్టమేనా?" కాలివేలు నేల రాస్తూ, పాతాళంలోకి చూస్తోంది, ఒకవిధమైన సిగ్గుతో ఆమె ముఖం ఎర్రనైంది.

"చెప్పవూ...?"

"నన్ను పోనివ్వండి—"

"ఒక్కమాట చెప్పు—వెళ్ళిపోదువుగాని—" పోతపోసిన విగ్రహంలాగు నిలబడ్డది.

"ఇష్టంలేదు...అవునా!—ఏం?" ఆమె భంగిమలో మార్పులేదు; నోట మాటాలేదు.

"ఇష్టమే....ఏం?...ఊఁ...ఏం?"

"ఊఁ" అని దీర్ఘం తీస్తూ, నన్ను తోసుకొని—ఒక్క నిమిషంలో నా దృక్పథంనుంచి మాయమైంది. ఈ ఉపసమస్య తీరింది.

ఈ లోకంలో రెండురకాల మనుషులున్నారు. నిశ్చయాన్ని ముందువెనుకలు ఆలోచించకుండానే నిర్ణయించుకొనేవాళ్ళు మొదటి రకం; దరీ దాపూ లేని ఆలోచనను అన్ని వైపులకూ సాగించి నిశ్చయాని కొచ్చేవాళ్లు రెండోరకం. ఈ రెండో రకంలో—నిశ్చయమే లేక, పుణ్యకాలం కాస్తా దాటిపోయినా ఇంకా ఆలోచనతోనే కొట్టుకునేవాళ్ళు 'అతివాదులు!' నేను మొదటి రకం మనిషినే అయినా—ఈ సమస్యా పరిష్కారంలో బుర్రకు కొద్ది పనిని ఇవ్వదలిచా.

వివాహమంటే జీవితాంతంవరకూ పథ నిర్ణయమున్న మాట! ముందు జరగబొయ్యే సంఘటన్ని ఎంత జ్యోతిష్కుడైనా ఎలా కల కంటాడు? ఆ శక్తిఉన్న జ్యోతిష్కుల సంసారాలన్నీ సక్రమంగా సాగుతున్నాయా? ఈ జీవిని ఇంకో జీవికి శాశ్వతంగా అంటకట్టుకోవటం—కొన్ని నిబంధనలకు లోబడిపోయి జీవితాన్ని గడపటమే కాబోలు—వైవాహిక జీవితమంటే?

పాపం! బీదరికంతో కృంగి కృశించిన ప్రభను చూస్తే జాలేస్తుంది! ఆమె ధరించే చౌకరకపు దుస్తులు—అవ్వైనా బహుకొద్ది! ఆమె గుణాల్నిపట్టి ఎవరు ఆమెకు విలువ కడతారు? విలువలేనప్పుడు ఆమె యెవరికీ పనికిరాదు కాబోలు! ఒక శాశ్వత సంబంధంతో ఆమె ఒక 'ఇల్లాలు' ఐతేనే కాని ఆమెకు యీ సంఘంలో గౌరవం రాదు. సంసారంలోవున్న సౌఖ్యాన్ని అనుభవించే శక్తి అందరికీ

ఉంటే ఎంత బాగుండును! ఇది నాలో ఉందో లేదో నాకే తెలీదు. తెలుసుకుందామని తీరాదిగాక—మళ్ళీ వెనక్కి రావటమూ చాతకాదాయె!

ఒకసారి నా హృదయంలో కనకానికి ఇచ్చిన స్థానాన్ని ఇప్పుడు ప్రభ ఆక్రమించుకోవాలి. ఇది బహుశా ఆమె ప్రతిభలోనే ఉంటుందేమో! ఆమె ప్రయత్నాల్ని నేను కొనసాగనివ్వకపోతే ఆమె మాత్రం ఏం చెయ్యగలదు? తీరా ప్రభకు అన్యాయమే జరుగుతుందేమో! కనకం నా జీవితపథంనుంచి నిష్క్రమించి దాదాపు సంవత్సరం మవచ్చింది ఇదివరకు ఆమెనుగూర్చి నేను కుర్రైన చిత్తక్షోభ కొంతవరకూ ఆ కనపడని గాయాన్ని మాన్పింది కాబోలు! ఆమె ఏమైందీ నాకు తెలీదు. ఆమెలేని జీవితమే దుర్భరమనుకొన్నా—అల్లాగే సాగిపోతోంది! ఆమెకు చేతనైంది—నన్ను తన పాదదాసుడిగా తయారు చేసుకోవటం. ఆమె మాత్రం నా బుర్రలోంచి మాయ మవలేదు. కాని ఇదివరలో ఆమె నడిచినప్పటి ఛాయ లింకా బలహీన మవలేదు; ఆమె నాలో పని చేస్తూన్నంత సేపూ—ప్రభ ఆ స్థానాన్ని తీసుకోగలదనే నమ్మక మెక్కడ? కనకం నన్నీపాటికి మరిచిపోయి వుంటుందేమో? ఆమె జీవితం ఏమైందో? నాలాగే బాధ పడుతోందా? నాలాగే జీవితంలో నూతన సమస్యలతో వేగిపోతోందా?

ఆమె సంగతి తరవాత చూచుకోవచ్చు; ఇప్పుడు నా గతేమిటని పిస్తోంది. ఎంత—ఆలోచనైనా—నిశ్చయం లేకపోతే వ్యర్థమేగా? కనకాన్నే అంటిపెట్టుకు కూర్చొని—మనశ్శాంతి లేక వేగిపోవటం మూర్ఖమేనేమో? ప్రభతోడి వైవాహిక జీవితాన్ని తలపోశా; ఎక్కడో ఏదో ఆశాజ్యోతి మిణుకు మిణుకు మంటోంది; నమ్మి ముందుకు సాగుతే ఫలభం పొందే గౌరవమే దాపరిస్తోందేమో? ఏదైనా ఈ risk కూడా చేసి చూడాలనే నిశ్చయించుకొన్నా.

# 17

ఎండలు మెండుగా కాస్తున్నయ్. సూర్యుడు తన ఉష్ణత నంతట్నీ భూమిమీద ప్రసరింప జేస్తున్నాడు. ఎటు తిరిగినా గాలి ఆడదు. పడుకుంటే నిద్ర పట్టదు. పాత సంగతులు ఏవో జ్ఞాపకానికి వొచ్చి నాకు నేనే చిరాకు పడుతున్నా.

ప్రభ ఒక కవరు తీసుకొచ్చి ఇచ్చింది; విప్పి చదివా—కనకం రాసింది! ఎన్నాళ్ళకు నేను ఆమెకు జ్ఞాపకం వచ్చాను! తల్లి చని పోయిందట—పాపం! మా అమ్మ పోయినప్పుడు నన్ను ఓదార్చింది. లోకం Lip Sympathy ని బాగా నేర్చుకున్నా—కనకం దాని కూడా నోచుకోలేదేమో? ఆ మారుమూల గ్రామంలో తనస్థితి నీటినుంచి బైటపడ్డ చేపవలె వుందట; ఆ లోక బహిష్కారాన్నీ ప్రవాసాన్నీ తను భరించలేక పోతోందట! నాకు కళ్ళనీళ్ళు తిరిగయ్. ఈ కళ్ళతో యీ లోకంలో నేను మంచివాళ్ళుగా పరిగణించిన మరో వ్యక్తి జీవితపథంనుంచి నిష్క్రమించింది. నా తల్లి పోయిన ప్పుడు నే నెంత దుఃఖించాను! ఆమె తల్లి పోయి నప్పుడు కనకం మాత్రం అంతగా దుఃఖించదా? నాలాటి మానవజన్మకాదా ఆమెది! ఆమె 'నా' అనుకొనే తుది ప్రాణినికూడా కోల్పోయి, నిరాధారం గా జీవితపథంలో నిలబడి—ఎక్కణ్ణుంచో సహాయాన్ని అర్థిస్తోంది కాబోలు!

నా కళ్ళనీళ్లు చూసి కాబోలు—ప్రభ, "ఎక్కడినుంచండీ?—ఆ ఉత్తరం?" అంది. మాట్లాడకుండా—ఆమె చేతికిచ్చాను; చదివింది

"ఈమె ఎవరు? మీకు జ్వరం వచ్చి నప్పుడు ఇక్కడికొచ్చింది—ఆమే కదూ!" ఔనన్నట్టు తలవూపా.

"నేను విన్నాను—ఒకప్పుడు మీరు ఆమెను ప్రేమించారని—నిజమేనా?"

"త—ప్పా?"

"కాదు—మానవుడు మానవుణ్ని ప్రేమించేందుకే కాని, ద్వేషించేందుకు కాదంటాను. కాని మీరు ఇక ముందు మాత్రం ఆమెతోడి సంబంధాన్ని తెంచుకోవాలి—" స్త్రీకి సహజంగా వుండే ఈర్ష్యా, అసూయల్ని ప్రదర్శిస్తూన్న ప్రభను చూసి జాలిపడ్డా.

కనకమూ, ఆమె దీనావస్థా అంతా కళ్ళకు కట్టినట్టయింది; ఒక్కసారి వెళ్ళి ఆమెను చూసి, ఓదార్చి రావటం నా విధిగా భావించా.

"ఒక్కసారి వెళ్ళి కనకాన్ని చూసివస్తా."

"ఒద్దు—మీరు వెళ్ళి మళ్ళీ ఆమె వలలో పడటమూ, ఆ పూర్వ విషయాలన్నీ జ్ఞాపకం చేసుకొని మనస్సు పాడుచేసుకోవటమూ జరుగుతుంది. మీరు వెళ్ళొద్దు. ఎవరి ఖర్మ వారిది. ఆమె తల్లిపోతే మనమేం చేస్తాం—?"

స్వార్థమయమైన మానవ జీవితంలో—తనకు హక్కున్న సౌఖ్యంలో భాగాన్ని ఇతర్లేమన్నా పంచుకుపోతారేమోననే భయంకాబోలు ప్రభది? అన్యోన్యతా, అభిప్రాయ సామ్యమూ—మా యిద్దర్లోనూచాలా విషయాల్లో భేదించటాన్ని గమనిస్తూనే వున్నా. ఒకరి విజ్ఞానమూ ఆత్మ వికాసమూ, అభిరుచులూ మరొకరికి వెగటు కనుకనే ఇన్ని రకాల వ్యక్తులు ఏర్పడి వుంటారు! ప్రభ కెందుకు నామీదంత అనుమానం? పాతిక్లైదీని చూసే పోలీసు విధంగా—నన్ను భావిస్తోంది. వినా ఆమె ఇష్టా ఇష్టాల్లో మెలగవలసిన వాణ్నేనా నేను? ఒక వ్యక్తి కష్టాలకు సానుభూతి తెల్పటం కూడా, మరొకరికి కంటక ప్రాయమైతే ఎట్లా?

ఆలోచించి—వెళ్ళటానికే నిశ్చయించుకొన్నా.

"వెళ్తారా?"

"వెళ్తాను—రెండురోజుల్లో తిరిగివస్తాను. నువ్వేమీ అపోహపడనక్కర్లేదు. నీకు నామీదవున్న హక్కుకన్నా, కనకానికే ఎక్కువ వుంది—ఎందుకనో నాకు తెలీదు; పాత స్నేహితురాల్ని చూసి

తీరాలి—”

ప్రభ ఏడ్చింది—కాని కనకమో? ఇంతకన్న ఎక్కువగా విచారిస్తూంటుంది కాబోలు! ఏమన్నాన్న ప్రభను వెనకనే వదిలి కనకాన్ని గూర్చిన కలతమనస్సుతో బయలుదేరా—

# 18

సూర్యాస్తమయ సమయానికి శ్రీనగరం చేరాను. ఎవర్నడగను— కనకం సంగతి? ఆమె మామగాడి పేరు నాకు తెలీదాయె. 'కరణం' అని మాత్రం గుర్తుంది. దారి తెలీని పాంథుడి అవస్థ నాకుపట్టింది.

చెరువునుంచి నీళ్ళు తెచ్చుకొనే అమ్మలక్కలూ, వీధిలో ఆటలాడుకొనే కుర్రకుంకలూ, తీరిగ్గా కూర్చొని చుట్టలు కాల్చుకొనే ఆసాములూ—నాకొత్త ముఖాన్నీ బస్తీ కళల్నీ కాబోలు తేరిపార చూస్తున్నారు. తమలో లేని నాగరికత నాలో వుందని అనూయపడుతున్నారు. ఎవర్నీ అడగటం నాకు యిష్టంలేదు. కాని అడగకుండా ఎల్లా తెలుసుకొనేది! తీరా ఆ కరణం ఇంటికివెళ్ళి, కనకం కోసం వచ్చానంటే—ఆ మామగాడు దుడ్డుకర్ర తీసుకొని వెంటపడితే—పొలిమేరల్లో పడి మైల్ రేస్ చెయ్యాల్సి వస్తుందేమో? వాడికోర మీసాల్నీ భీకరాకారాన్నీ తల్చుకుంటేనే నా అల్పప్రాణి అవటిల్లుతోంది.

బెంగాలీ లాల్చీతోనూ, గ్లాస్కో పంచతోనూ, నున్నగా దువ్విన క్రాపుతోనూ—ఒక యువకుడు నాకు ఎదురైనాడు—ఆకారాన్ని పట్టి బస్తీ మనిషిలాగు స్ఫురించాడు. అతని పెదవులమీద నాట్యం చేసే చిరునవ్వు ప్రత్యేకం నన్ను ఆకర్షించింది. పురుషుల్లో ఇంత అందగాడు వుంటాడా అనిపించింది. అతని చక్కని కను ముక్కు తీరు అతన్ని పలకరించమని ప్రోత్సహిస్తోంది. ఎరిగివున్న వాడిలాగు కనుబొమల్ని ఎగరేశాడు!

"కరణంగారి ఇల్లెక్కడో చెప్తారా?" అన్నా—. నన్ను తేరి పారజూచి, "మీ పేరు?" అన్నాడు. ఈ అసందర్భపు ప్రశ్న నాకు కష్టంగానే వున్నా, అతని సహాయం నాకు అవసరం కనుకనే తప్పని సరిగాచెప్పా. అతను నవ్వుతూ, "మీరా! నాతో రాండి. వెళ్దాం" అని వెనక్కు తిరిగి నాతోపాటు నడవసాగాడు. ఏమిటి—వీడు నన్ను ఎరుగా? కాలేజీలో నన్ను చూశాడా? పూర్వ పరిచయం వున్నట్టు సూచిస్తాడు. నాతో తాత్కాలికంగా స్నేహంచేసి మోస గిద్దామని ప్రయత్నిస్తున్నాడా?

"మీరు నన్ను ఎరుగుదురా?" అన్నా. "ఆఁ" అని తలవూ పాడు. నాకు ఆశ్చర్యమే అయింది; ఒక్కసారిగా అనేకరకాల ముఖాలు నాకళ్ళముందు తిరిగయ్—కాని, ఎక్కడా ఇల్లాటి ముఖాన్ని—నాకు కలలో చూసిన జ్ఞాపకం కూడా రాలేదు!

"ఎక్కడ చూశారూ?" అన్నా.

"క్షమించాలి—చూడలేదు కాని విన్నా మీది......పూరు కాదూ?" అన్నాడు. మా వూరి పేరు వీడికెల్లా తెలిసింది! చూడ లేదు కాని విన్నాట్ట! నేనేమన్నా పురాణపురుషుణ్ణనుకుంటు న్నాడా! నేను మ్యాపులోనైనా చూడని యీ వూళ్ళో వీడొక్క డికీ నే నెల్లా తెలుసోమరి!

"ఇప్పుడు కరణంగారి ఇంటికి వెళ్తే బాగుండదేమో—" అన్నాడు.

"ఏం?" అన్నా, నాకు కలిగిన అనుమానమే వీడికి ఎల్లా కలి గిందా అనుకుంటూ.

"వాళ్ళమామ వుంటాడేమో—?" చచ్చాం! జోతిష్కుడు కాదుకద? మెస్మరిజం చేస్తున్నాడా? "ఎవర్నిగూర్చి మాట్లాడు తున్నారు?"

"మీరు శనకం కోసంకాదూ—వచ్చింది? ఆమెను గూర్చే!" నా కీర్తి ఇంతవరకూ పాకిందా అనుకుంటున్నా—

"మీకెల్లా తెలుసు?"

నవ్వి, "ఆమె చెప్పిందిలెండి—" అన్నాడు. వాలాగే వీడి కూడా ఆమె స్నేహితురాలా ? నేనే ఓడిపొయ్యా—చూడ బోతే వీడికి అన్నీ తెలిసినట్టుంది. "మరి మీరు నన్ను ఎక్కడికి తీసుకు వెళ్తారూ ?" అన్నా.

"మీకేం భయంలేదు—రండి—మా ఇంటికి వెళ్దాం—"

ఎవరికోసమోవచ్చి—ఎవరింటికో వెళ్ళటం బాగాలేదు. ఐనా ఇంతకన్న చేసేదికూడా లేదు.

"అనవసరంగా శ్రమ కల్గిస్తున్నా—"

"ఫర్వాలేదు—అన్ని సౌకర్యాలూ చూస్తాను—కనకాన్ని కలు సుకునే ఉపాయంకూడా చెప్తా—"

"మీ ఇల్లెక్కడ ?"

"ఆ రావిచెట్టు కన్పించటంలా—అక్కడ...మా ఇంటి పక్కనే కరణంగారి ఇల్లు—"

ఆ మామగాడు నన్ను గుర్తుపట్టడుకదా ? ఏమైనా నాకు కావా ల్సిన సహాయం దొరికింది—వీడిమాటల్ని పట్టిచూస్తే నమ్మదగ్గ వ్యక్తి లాగే వున్నాడు. నన్ను తన ఇంట్లోని ఒక గదిలోకి తీసుకుపోయి కుర్చీలో కూర్చోపెట్టి, "వెంకాయ్" అని కేక వేశాడు. నల్లటి తుమ్మమొద్దు లాటి వాడొకడు ప్రవేశించాడు. నన్ను కొట్టేందుకు కాదుకదా!

"కాఫీ తీసుకురారా—" వాడు నిష్క్రమించాడు.

"ఇంతకుముందే తాగివస్తున్నా—"

"ఫర్వాలేదు లెండి—"

"ఇందాకట్నుంచీ తమ పేరు అడగనే లేదు—"

"మధుసూధనరావు—" కొంచెం పొడుగుదైనా, బలే ఘనం దైన, భేషైన పేరే అనుకున్నా. ఆ వెంకాయ్‌గాడు కప్పుల్తో హాజ రయ్యాడు.

"ఈ ఊళ్ళో కాఫీ హోటల్నున్నయ్యా ?"

"లేవు—మధ్యాహ్నం కాచుకున్న కాఫీని ఫ్లాస్క్‌లో పోసుకుంటాం—" మొహమాటంతోనే కాఫీతాగా.

కప్పుల్ని అందిస్తూ అతను అన్నాడు; "అరేయ్—పిచ్చితో చెప్పు: రాజుగారొచ్చారని...కరణం ఉన్నాడేమో కనుక్కురా—ఎప్పుడొస్తుందో అడుగు—" పిచ్చి ఎవరు! ఆపిచ్చితో నాకేంపని? ఇదంతా మయసభామర్మంలాగూ, మ్యాజిక్కులాగూవుంది నాకు! ఏమైనా అతను నమ్మదగ్గవాడేననే ధృఢనిశ్చయం లేక పోలేదు. వెంకాయ్ తిరిగివచ్చి అన్నాడు: "కరణం తాశీళ్ళ వసూలుకు వెళ్ళాడట—రాత్రికి రాడట—"

"ఎప్పుడొస్తానంది?" "పదకొండు—"

"సరే—నువ్వు వెళ్ళు" వెంకాయ్‌గాడు వెళ్ళిపొయ్యాడు. నాకు మాత్రం వాళ్ళభాష అర్థమవనే లేదు.

"విన్నారుగా?" అన్నాడు, అతను. "పిచ్చి ఎవరూ?"

నవ్వి, "ఆఁ...అంటే కనకమే లెండి...రాత్రికివస్తుంది. మీరు మాట్లాడుదురుగాని," అన్నాడు. సిగరెట్లు కాల్చుకుంటూ ఇద్దరమూ ఏవేవో లోకాభిరామాయణంలోని ఘట్టాల్నిగూర్చి మాట్లాడుకున్నాం. అతను చాలా సరదా మనిషి. ఎదుటివ్యక్తిని నవ్వించగలడు. మర్యాదతో మంచి స్నేహభావాన్ని రూపించాడు.

బాగా చీకటి పడ్డాక—"స్నానంచేసి—భోజనానికి లేవండి—" అన్నాడు.

"స్నానంచెయ్యను —ఆకలి అవటం లేదు" అన్నాను.

"చాలా మొహమాట పడుతున్నారు—నన్ను పరాయివాడిగా భావించొద్దని కోరుతున్నా—" ప్రథమ పరిచయంలోనే ఇంత ఆదరణను ఎందుకు చూపుతున్నాడో నాకు అర్థమవలేదు. తప్పని సరిగా అతనితోపాటే—వంట బ్రాహ్మడు వడ్డించిన మెతుకుల్ని నోట్లో వేసుకొని గదిలోకి జేరాం—

కొంచెంసేపు మళ్ళీ హస్కు జరిగాక—"ప్రయాణపు బడలికలో

అలసినట్టున్నారు. ఆమె రాంగానే లేపుతాను—పడుకోండి—" అన్నాడు మూలవున్న పక్కను చూపుతూ. "నిద్ర రావటంలేదు—"

"ఫర్వాలేదు పడుకోండి—" అని తలుపు దగ్గరిగావేసి అతను నిష్క్రమించాడు. ఆ గదిలో నేనొక్కణ్ణే అయిపోయాను. పడుకున్నా—నిద్రపట్టదు. టేబిల్‌మీద వున్న లాంతరు వెలుగు గది నంతట్నీ ఆక్రమిస్తోంది...మరోమూలనుంచి బిగ్‌బెన్ గడియారపు టిక్‌టిక్‌లూ, దూరాన పొలాల్లో నక్కల అరుపులూ విన్పిస్తున్నాయ్. కిటికీలోంచి చెట్ల ఆకుల్నితోసుకొస్తూన్న చల్లనిగాలి మెల్లిగావీస్తోంది

కనకం ఇక్కడి కెందుకొస్తుంది? మామగాడు రానిస్తాడా? ఎల్లావుందో ఆమె? ఊహా ప్రపంచంలో సృష్టించుకొన్న కాల్పనిక కనకాన్నిగూర్చి ఆలోచిస్తూ—నిద్రపట్టక పోవటంవల్ల, దీపం పెద్దది చేసి, ఏదో పుస్తకంతీసి చదువుతున్నా—ఒక్క అక్షరం కూడా అర్థమౌతున్నట్టుగా లేదు.

# 19

ప్రతి గాజులశబ్దం చెవిన పడేటంతవరకూ—నన్ను నేనే గుర్తించుకోలేని స్థితిలో వున్నా కాబోలు! "రాజూ!" అంది. సంవత్సరం పైనైంది ఆ కంఠాన్ని విని—వినా చాంట్లో చలనంలేదు!

పుస్తకాన్ని విసిరిపారేస్తూ, "కనకం! వచ్చావా?" అన్నా.

నా చెయ్యి పట్టుకొని, "ఔను—రాజా! ఇక్కడి కెందుకొచ్చావ్? ఈ లంకలోని రాక్షసుల మధ్యకు వచ్చేందుకు నాకోసం ఎంత ధైర్యం చేశావ్!" అంది. ఇక్కడ భయపడవలసిన విషయమేదో నాకు తెలియకపోవటంవల్లనే నా ధైర్యం నిలబడివుందనుకుంటూ. తల్లి మరణాన్ని గూర్చి మరచిపోయిందా?

"అమ్మ పోయిందా—కనకం?"

నిట్టూర్చి అంది: "పోనీ—రాజా! ఈ విశాల విశ్వంలో తల్లి లేనివాళ్లలో నేనొకతెను. మాటిమాటికీ ఆ విషయాన్ని జ్ఞాపకంచేసుకొని మనశ్శాంతిని భంగపర్చుకోలేను. చచ్చినవాళ్ళను గూర్చిచెప్పే ఔదార్యపుమాటలన్నీ నాకు బాధకలిగిస్తయ్. చెప్పేవాళ్ళవి, వేదాంతంతోనూ, అనుభవంతోనూ కూడినమాటలే అవ్వొచ్చు—కాని, అవ్వి నన్ను గాయపరుస్తయ్ కనుక, వాటిని వినలేను"—ఎంత విరక్తితో మాట్లాడింది? నాకే ఆశ్చర్యంగావుంది!

"ఇంత మొండితనాన్ని ఎల్లా సంపాయించావ్?"

నవ్వింది. "రాజా! అందరికీ తెలీదా—చచ్చినవాళ్ళు మళ్ళీ బతికిరారని! అంతా కలలాగు భావించి తప్పని సరిగా మరిచిపోయ్యేందుకు, లేని మొండితనాన్ని తెచ్చిపెట్టుకునేందుకూ ప్రయత్నించా—"

నేను నీరాశకే గురయ్యా...

"—ఇప్పుడు అనుకుంటున్నాను: జీవితాన్ని అనుభవించటం కూడా ఒక కళఅని; ఎన్ని కళలు నేర్చినా, ఇదితెలీని వ్యక్తి జీవితంలోని కష్టాలకు అధికబాధను అనుభవిస్తాడని—నువ్వు మాత్రం యీ కళకు ప్రత్యేకంగా కృషిచేశావని—"

నవ్వింది—వాడిన ముఖంలోంచే, "ఔను—జీవితం అనే ముళ్ళకంపల్లోంచి ఎక్కువ ముళ్ళు గుచ్చుకోకుండా నడవటం చేతకాకపోతే ఎట్లా? ఇన్నాళ్ళూ నేనుకూడా మిగతా వ్యక్తుల్లాగే వుండేదాన్ని—కాని మధుస్నేహం దొరికాక—"

వాడి ప్రస్తావన నాకు కష్టంకల్గించింది; ఆమె మాటను మధ్యలోనే అందుకొని, "అతనికీ నీకూ ఏం స్నేహం?" అన్నా.

"మన స్నేహం లాటిదే—!", నాగుండె లెక్కపెట్టలేనంత వేగంగా కొట్టుకుంది. మధు నాకు ఆజన్మశత్రువులాగు కన్పించాడు—

"...చాలా మంచివాడు, లక్షాధికారి. స్నేహానికి ప్రాణాన్ని ఇస్తాడు. ఎడారిలో ఎండిపోతూన్న నాజీవిత లతకు నీరుపోశాడు. ఈ లోకంలో ఇల్లా సహాయపడే ప్రాణి ఒక్కటివుంటే నాకు చాల్ను

నిపించింది. నాభావి జీవితభారాన్నంతట్నీ అతనిమీదనే వదిలేశా. అతని స్నేహం లభించాక దాదాపు 'విచారం' అనేమాటనే మర్చిపొయ్యా—అతని విశాలహృదయంలో ఈ అనాథకు గొప్పస్థానం ఇచ్చాడు. నాకు అతనొక దైవస్వరూపుడు..." ఆమెనూ, ఆమె మాటల్నీ చూస్తూంటే నాకు ఒళ్ళు మండింది. ఆమెమీద అసహ్యం పుట్టింది. నా ప్రాణ సమానంగా చూసుకొన్న స్త్రీ—ఒక వ్యభిచారిణిగా మారిందని తలుచుకుంటేనే—నా శరీరం కంపించింది.

"అంత మంచివాడా?" అన్నా వెటకారంగా!

"కాదా? మామ మీద నీకెంత కోపమూ, ఈర్ష్యావుండేది? నాకు తెలుసు రాజూ! నా వస్తువు, నా ప్రియురాలు, అని భ్రమిస్తూన్న యీ ప్రియులందరూ—ఆ ప్రియురాలికోసం ఇంకెవరైనా తిరుగుతూంటే సహించలేరు. ఇప్పుడు చూడు; నీమీద అతనికి ఎంత ఈర్ష్య ఏర్పడివుండాలి? కాని అతని ఆత్మవిశ్వాసంలో, అల్లాటి ఊహలకు తావులేదు...ఇంత ఉన్నతాశయాలుగల వ్యక్తి నా జీవిత మధ్యంలో ఎదురౌతాడని నేను కల్లోకూడా తలవలేదు..." ఇదేనా ఉన్నతాశయం? నాకు బహు చిరాకుగా వుంది.

"అయితే అతని ధనాన్ని చూసి, భ్రమించి అతని వలలోపడి, వ్యభిచారిణిగా, కులటగా, జారిణిగా మారావన్నమాట—" కోపంలోనే నాకు తెలీకుండా యీమాటల్ని అన్నా కాని, అన్నాక ఆమెను గాయపర్చా ననుకున్నా. నవ్వింది, మామూలుగానే!

"పొరపడ్డావ్! రాజూ! భర్త చాటున చేసేది పవిత్ర వ్యభిచారమూ—ఇది అపవిత్రమూను—ఇంతే భేదం! జీవితఘట్టాల్లో పరిణామమూ, మార్పూ రాకూడదా! ప్రేమించేందుకు అనేక కారణాలుండొచ్చు. ఒక్క ధనవంతుల్ని మాత్రమే ప్రేమించేవాళ్ళు వేశ్యలు! ఈ లోకంలో నేను అందర్నీ ప్రేమిస్తున్నాను. ఇతర్ల దృష్టిలో నేను ఎవరికైనా శత్రువునేమో నాకు తెలియదు కాని, నా దృష్టికి నాకు ఎవ్వరూ విరోధులు లేరు. మనస్సుల్నిపట్టి లోకంలో బంధుత్వాలూ,

స్నేహితాలు ఏర్పడుతాయ్ కాని, లేకపోతే—అందరు మనవాళ్ళేగా!
నువ్వు ఏమన్నా అనుకో—నన్ను ఏమన్నా అను, కాని, మధు చాలా గొప్పవాడు. ఈ లోకానికీ, ఈ మనుష్యులకూ అతను పనికి రానివాడైతే కావచ్చుకాని—నా ఆశయాలకు తగిన మిత్రుడు—"

"ఇవ్వే నా-ఆ-శ-యా-లు !"

"కాకూడదా? నీ ఆశయాలే—నావి అవ్వాలా? నాకు లేదా వ్యక్తిత్వం? స్వాతంత్ర్యం—" కొన్ని క్షణాలపాటు నిశ్శబ్దంగా వున్నాం. అతి ప్రయత్నంమీద నా ఈర్ష్యను చంపుకోగలిగా; నా తనుకొని భ్రమించిన కనకమే—ఈమె కాదనుకొన్నా.

"మధు—ఇక్కడ ఏం చేస్తుంటాడు?"

"అతనికి 'నా!' అనేవాళ్ళు లేరు. ఈ ఊళ్ళో పెద్ద ఆస్తివుంది—దాన్ని అమ్మేసి ఆ డబ్బుతీసుకొని పట్నం వెళ్ళిపోతాడు. నేనుకూడా అతనితో వెళ్తాను. అతని ధనాన్ని తినేవాళ్ళలో నేనూ ఒకతె నౌతాను—"

"పెళ్ళాడుతావా?"

"పెళ్ళి నాకు యిష్టంలేదు. అతనూ అదే అన్నాడు. పెళ్ళాడి నప్పట్నుంచీ ఒకరిమీద ఒకరికి విశ్వాసంపోతుంది. లేని అధికార వాంఛ అధికమౌతుంది. ఇది మానవత్వం కాని వస్తువు కాదు—'నా' అని భోషాణాల్లోనూ, ఇనప్పెట్టెల్లోనూ దాచుకునేందుకు! అతను... నాకు భాషలో ప్రావీణ్యతలేదు—అతన్ని వర్ణించేందుకు; నేనిప్పుడు అతని లాగు జీవితాన్ని గడపటాన్ని నేర్చుకుంటున్నా. అమ్మ మరణానికి నేనెంతో కృంగి, కృశించి పోవలసింది! కాని అతన్ని చూసి అన్నీ మరిచిపోగలిగాను.

"ఇప్పుడు మంచి మాటలు చెప్పి గోతిలో దింపేదాకా అల్లాగే వుంటుంది..." నాకున్న ఈర్ష్యను వెళ్ళగక్కే భాష ఇదేకాబోలు!

"రాజూ!...రాజూ!...మధును యేమీ అనొద్దు; అతను నాకు బాగా అర్థమయ్యాడు—చూడకపోవుగా నా భావిజీవితాన్ని?—"

మళ్ళీ వశానంతోనే ఇద్దరమూ ఊహా సముద్రంలోకి వెళ్ళిపోయాం —ఎన్నెన్ని తలపులు! ఆమె దీనవదనాన్ని చూస్తేనే నా హృదయం కంపించింది.

"ఇక్కడ సుఖంగావుందా—కనకం?"

"నా జీవితంలో అల్లాటి క్షణాలు వెనకనే గడిచిపోయాయో—లేక ముందున్నయ్యో? ఇప్పటి జీవితంలాటిది నా అగర్భశత్రువుకైనా వొద్దు రాజూ! ఈ జైలుఖానాలో నేనుండలేను. ఇక్కడిబండచాకిరికి నా చేతులెల్లా అయ్యాయో చూడు...!" చేతులుచాచింది; బండబారినయ్. ఈ ఒక్క చేతుల్ని చూచి, ఆమె దుర్భరావస్థను ఊహించుకుంటున్నా.

"రాజూ! నేను వీరింటికి, కూటికీ గుడ్డకూ మాత్రమే చాకిరీచేసే దాసీని! నేను ఒంటరిదాన్ననీ, నా వెనక వాళ్ళు సానుభూతి చూపే వాళ్ళెవరూ లేరనీ, చచ్చినట్టు తన మాటల్ని శిరసావహించి తీరవలసిన బాధ్యత నాకుందనీ—అపోహపడుతున్నాడు—మామ! అనాధను చేరదీసి తను లోకోపకారాన్ని చేసినట్టుగా గర్విస్తాడు. అసలుదాని ఒంటరి జీవితంకన్న నరకం ఇంకోటిలేదు. ఈ దేశంలో స్త్రీ అయి జన్మించటమే ఒక శిక్ష! అందులోనూ ఘోరపాపం చేసుకుంటేనే కాని సౌందర్యవతియైన స్త్రీగా జన్మించదు. అందరికీ నేను కావాలి! నన్ను పొందేందుకు అందరికీ అర్హతవుందా అనేప్రశ్న అనవసరం! నన్ను అక్రమించి సాధించాలనే ప్రతి పురుషుడి ఊహాను. ఇది నా జీవితంలో బుద్ధి తెలిసినప్పటినుంచే గమనించే దినచర్యేఅయిపోయింది ఆ మామ...వాడికన్న పశువు నయం...నన్ను నిర్బంధిస్తాడు. వాడి పాదాలక్రింద గతిలేనిదానల్లే పడివుండలట్టుగా నన్నింత తేలిగ్గా చూడ గలుగుతోంది? అంటాడు! తను నన్ను రక్షించాడట! అందుకు నేను కృతఘ్నురాల్నవ కూడదట! తనను వివాహమాడి సుఖించాలట! నా ఇష్టమూ, నా అనుమతీ అక్కర్లేదన్నట్టుగానే చూస్తాడు! ఇప్పటి దాకా ఎల్లాగో కబుర్లుచెప్పి కాలక్షేపంచేస్తున్నా. ఇంత నీచాతి

ప్రయాల్లోఉండే పురుషులతో ఎంతకాలం గడపగలను? ఈ దేశం లోని స్త్రీకి తనను తను రక్షించుకోవటమే మొట్ట మొదటి సమస్య. నా జీవితం రాణించనీ, క్షీణించనీ మధును వదలను. నదిలో మునిగి పొయ్యే వ్యక్తికి ఏది దొరుకుతే అదేగా ఆధారం? నువ్వన్నట్టు అతను కూడా మోసగిస్తే—నాది స్వయం కృతాపరాధమౌతుంది—ఇక్కడ నీచజీవితంనుంచి విముక్తనవుతేచాలు...”

“ముందు ఎక్కడికి వెళ్తావు?” అన్నా.

“ఏమో! ఎక్కడికి వెళ్తానో, ఏంచేస్తానో నాకే తెలీదు. దారీ డొంకాలేదు—నా జీవిత ప్రవాహానికి. మరుక్షణం చింతకూడాలేదు—రాజూ! నేను నీకు వింతమృగంగా కన్పించొచ్చు. కాని, నాకు మాత్రం నా జీవితం చాలా తృప్తికరంగా వుంటుంది—”

కనకం—నిర్ధారణలేక జీవితంలో గడ్డి దానిలాగు దారివెతుక్కుం టోందా? తన జీవితాన్ని, యవ్వనాన్ని, వ్యక్తిత్వాన్ని లోకానికి ఏ విధంగా అర్పించ బోతోందో ఆమెకే తెలీదా! పిచ్చిదానిలాగు తయారైందా? ఈ లోకంలో ఎవ్వరికీ, ఎందుకూ కొరగాక చింపిరి తలతో క్రుంగిపోయిన కనకాన్ని నాతోనే తీసుకు వెళ్దామనుకున్నా. కాని, నా జీవితమే నాకు భారమైనప్పుడు — వేరొకరి జీవిత భారాన్ని నిర్వహించేశక్తి నాలోలేదని నాకు తెలుసు. ఒకప్పుడు నాకు రంభగా, ఊర్వశిగా కన్పించిన కనకం—నన్ను ఊహల్లో, పోహల్లో—జాగ్రదావస్థలో, సుషుప్తావస్థలోకలవరపెట్టిన కనకం—నా జీవితం శకటాన్నే తారుమారుచేసి నన్ను నేను గుర్తించుకోలేని స్థితికి లాగినకనకం—ఈ వాతావరణంలో నలిగి ఎంత దీనంగా తయారైంది! ఏ సమయమూ లేకుండా, ఎవరి ఆదరణా నోచుకో కుండా పోయింది!

“నీకు తోడ్పడేవాళ్ళే లేరా?” అన్నా.

నవ్వింది—సంతోషానికీ, దుఃఖానికీ కూడా మామూలుగా నవ్వే నవ్వే అది. “ఇంత విశాల విశ్వంలో నేను ఎన్నోవంతు? నాలాటి

జీవులెన్ని నలుగుతే మాత్రం ఎవరికి లెక్క? మనం అపోహపడతాం—మన జీవిత కష్టాలకు సానుభూతిగా నిట్టూర్చి, హృదయపూర్వకంగా కన్నీరు కార్చే వ్యక్తులున్నారని. కాని నిజంగా కష్టాల్ని ఎదుర్కోవాల్సిననాడు మన ముఖమైనా చూసేవాళ్ళుండరు; ఒక జీవి అనుభవించే కష్టాల ఫలాన్ని—మరో జీవి అనుభవిస్తుంది. ఒకరు క్షీణిస్తే కాని, మరొకరు రాణించరు!—ఇది లోకచరిత్రే! నా కోసం తిరిగేవాళ్ళూ—నా పాదరేణువుల్ని కళ్ళకద్దుకుంటానన్న కోరికను వెల్లడించేవారూ కూడా సహాయపడరు; వాళ్ళకు నేను ఎంతవరకూ అవసరమో అంతవరకే ఉపయోగించుకొని—చీకిపారేసే మామిడి టెంకలాగు నన్ను విసర్జిస్తారు. తమ స్వార్థం తీరేవరకూ గాలిలో కలిసి కరిగిపోయ్యే సానుభూతి వాక్యాల్ని చదివి కళ్ళనీళ్ళు తుడుస్తారు; కష్టసమయానికి అంతా విధివిలాసమని పెదవి విప్పరు. ఈ కృతఘ్నతకు శిక్ష లేదు! ఇల్లాంటి శిక్షలేని నేరాలు అనేకం ఉండబట్టే—జీవితం వెగటుగా ఉంటుంది. మన కష్టాలకు—ఇతరులు సుఖిస్తూ వుంటే మన హృదయం సహించలేదు. అందుకనే వేదనపడతాం—"

ఆగింది. చెదరిన ఆమె ముంగురుల్ని పైకితోస్తూ—ఆమె మాటల్లోని సత్యాన్ని నా విజ్ఞానంతో పరిశోధిస్తున్నా—

"ఇంత ఆత్మవిశ్వాసాన్ని ఎక్కడ నేర్చావ్—?"

"లోకంలో—జీవితంలోని అనుభవం నీకు లేదా! నీ గడిచిన జీవితంనుంచి ఎన్ని అమూల్య పాఠాల్ని నేర్చుకోవచ్చో తెలుసా?... మధు అంటాడు నేను పిచ్చి పిల్లనట."

నాకేదో గుర్తువచ్చింది. "పిచ్చి అంటాడేమిటి? పిచ్చిక కాదు కదా!"

"పేరు మార్చాడు—పిచ్చమ్మనట! అదే 'పిచ్చి' అంటాడు—నిజంగా నేను పిచ్చిదాన్నా రాజా!" ఆ కళ్ళల్లోని అమాయక జ్యోతిని ఆమెను ఎరిగిన ఏ పురుషుడు మరిచిపోగలడు?

"కాకపోతే ఆ పేరెందుకు వస్తుంది?"

"నిజమే...నిజమే..." అని నవ్వింది.

నిశ్శబ్దంతోనే మరికొన్ని నిమిషాలు గడిపాం. ఆ పూర్వపు సంఘటనలన్నీ జ్ఞాపక మొచ్చాయ్. ఇన్నాళ్లుగా మనమ్మ మారు మూలలకు తరిమిన కాలం యీనాడు దగ్గరగా జేర్చింది—కాని పూర్వపు జీవితం మరిచిపోగలుగుతే ఎంత బావుండును!

"కనకం ! నన్ను మర్చిపోగలిగావా !"

"ప్రయత్నించాను కాని చేతకాలేదు. ఆ దుఃఖాన్ని కప్పుకోనేందుకు ప్రత్యామ్నాయంగా మరికొన్ని నూతనానుభవాలకు అలవాటు పడ్డా మరిచిపోవటం సాధ్యపడదు...నువ్వు మరిచిపోగలిగావా ?"

"మరిచిపోతే ఇల్లా ఎందుకు వుంటాను!"

"అంతే—నేను మాత్రం మానవ మాత్రురాల్ని కానూ ? నీకు చాతకాంది నా చేత నవుతుందని ఎల్లా అనుకున్నావ్ ?"

"ఆ రాత్రులూ—ఆ ఆనందమూ—ఆ చంద్రుడూ మళ్ళీ జీవితంలో తిరిగి వస్తయ్యా ? అన్నీ నిష్క్రమించి పొయ్యాయ్ కదూ !"

"నీకు తెలీదా—గడిచిన క్షణాలన్నీ తిరిగి రావని ? అలా వస్తే జీవితం మరీ దుర్భరమవదా ! జీవిత పరిమితే అతి స్వల్పం. అందులో సగం రాత్రులు—మిగతాది కష్ట సుఖాలూను ! ఇవన్నీ కోరగానివి. లోకానికి మనం ఉపయోగపడే నూతన మార్గాల్ని అన్వేషించేందుకు మాత్రం ప్రయత్నించు. వెనుకటి సుఖాన్నైతే కోరుతావు కాని—కష్టం ఎవరికిస్తావ్ ? గులాబీ పువ్వును అంటిపెట్టుకొని ముళ్లు లేవూ! వెలుగులో నడిచే వ్యక్తికి తెలీదా—అందులోనే నీడ వుందని ! నీకు తెలీదా ! ఇవన్నీను—!" నాకు తెలీదా ? తెలును—తెలిసినా తప్పటడుగుల్లోనే జీవితాన్ని సాగిస్తున్నాం. ఎందుకో పూర్వానుభవాలన్నీ హృదయపు టంచులమీదినుంచి పొంగి పొరలి—కన్నీటి రూపాన బయటపడుతున్నై. ఎందుకింత వేదన?

"కనకం ! నేనుకూడా నీతో రానా ?"

ఎందుకన్నా నీమాట ! ఏమో !

"వాళ్ళెనా? దేనికి?...ఇప్పుడొద్దు. ఎప్పుడో మంచిరోజులు వచ్చినప్పుడు కలుసుకుందాం. మా ఇల్లూ, నా ఊరూ, మావాళ్ళూ ...అందరూ జ్ఞాపక మొస్తూంటారు—ఇప్పుడెవరూ లేరుగా! అన్నింటినీ పోగొట్టుకొని ఒంటరిగా కూర్చున్న నా దగ్గరుండి ఏం చేస్తావూ? ఇద్దరమూ దుర్బల హృదయాలతో గతాన్ని తల్చుకుంటూ ఏడుస్తాం—వద్దు రాజా—వద్దు—"

"ఇంత దుఃఖమయ జీవితం ముందుందని కలగనలేదు కదా—మనం!"

"మానవ జీవితం అల్లాటిది కాదా! రాజా భూమిమీద పడ్డప్పుడే ఏడవటం మొదలు—తుదకు, చచ్చేవాడు—ఇంతమంది ఆత్మీయుల్నీ, సౌఖ్యాన్నీ విడిచిపోతున్నామె అనీ, ఇంకా బతికి వుంటే ఆనందాన్ని అనుభవించొచ్చేమోననీ—తలుచుకుంటూ ఏడుస్తూ చస్తాం. మధ్యమధ్య కన్నీళ్ళు తుడిచేందుకు కొద్ది సౌఖ్యం వున్నా—ఎక్కువ దుఃఖమేగా అనుభవించాల్సింది?—"

కొన్ని నెల్లలో ఆమెలో ఇంత పరిణామమా!

"రాజా—పెళ్లి—" ఆమె మాట పూర్తికాకపూర్వమే అందుకొని, సిగ్గుపడుతూ, "అయింది—" అన్నా.

"ప్రభేనా!"

"ఎవరు చెప్పారు?"

"మే మక్కడ ఉన్నప్పుడే ఆ మాటలు అనుకుంటున్నారు—"

నాకు తెలీని విషయం—కనకానికి ఎల్లా తెలిసిందో!

"ఈపాటికి నీకు మనశ్శాంతి కలగాల్సిందేనే...!"

"ఇంకా లేదు—"

"రాజా! ప్రభ మంచిది. ఆమె నీ జీవితాన్ని బాగుచెయ్యగలదు. పురుషుడి ప్రవర్తనకు మార్గదర్శకత్వం వహించే శక్తి స్త్రీలో వుంది. దాన్ని గ్రహిస్తే—సంసారంలో కొంత శాంతి దొరక్కపోదు—"

తిరిగీ నిశ్శబ్దమే మాకు గతయింది, సకల సౌఖ్యాల్నీ అనుభవిస్తుం దని నేను ఊహించిన కనకం—ఇంత దుర్భర జీవితానికి గురైందేమా నని ఆలోచిస్తున్నా.

"రాజా! రేపు వెళ్ళిపో—" తల వూపా.

దూరాన బుడబుక్కల పాట విన్పిస్తోంది. తెల్లవారుజామున వీచే చలిగాలి కిటికీ చువ్వల్ని తోసుకొని వస్తోంది.

"తెల్లారుతోంది—రాజా! మళ్ళీ వెళ్ళిపోవాలి. మనదీర్ఘ విరహానంతర సంయోగం మనసు బాధించింది—ఏమైనా మన విషాదజీవితంలోని ఒక్క ఘట్టమేగా—ఇది?... నేను వెళ్ళనా?"

విద్యుల్లతలాగు ఆమె నాకు అందదు. నీళ్ళను గుడ్డలో మూట కట్టలేని నా అసమర్థత నాకు తెలుసు... తెల్లవారుతే మళ్ళీ ఇవన్నీ మరిచి పోవాలి—

"వెళ్తావా?" "అన్నా. "ఒద్దా?"

"ఒద్దకపోతే ఎట్లా? నీకు కష్టం కలగదా? వెళ్ళు కనకం—నువ్వు సౌఖ్యపడటమే నాకు కావాల్సింది—"

"రాజా!...నా రాజా!" అని నన్ను దగ్గరకు లాక్కొంది. సానుభూతి చూపే హృదయానికిది ప్రతిఫలం కాబోలు!

# 20

"మీ నాన్నగారు మీతో చెప్పమన్నారు; 'ఎక్కడైనా ఉద్యోగ ప్రయత్నాలు చెయ్యమని'—" నాకు బుర్ర తిరిగిపోయింది.

"ప్రభా! నిన్నుకూడా యీ విషయంలో సలహా అడుగుదామని వుంది—చెప్పు: ధనసంపాదన వొక్కటేనా జీవితంలోసాధించాల్సింది!—"

"మీకు రోజు రోజుకూ మతి పోతోందనుకుంటా. సాధించేవి అనేకం ఉండొచ్చు. కాని కుటుంబ రక్షణ కోసమూ, ఉదరపోషణ

కోసమూ ధన సంపాదన అక్కర్లేదా ? మీరు ఆలోచించండి : మామ గారు పెదవారైనారు. కుటుంబభారం మీమీదవుంది. డబ్బు లేక పోతే—మనంత దౌర్భాగ్యులు ఇంకెవరైనా వుంటారా? లోకానికి కావాల్సింది—ఒక్క ధనవంతులేగా! ఈ జనం అంతా సూర్యుడితో పాటు మేలుకొని, సూర్యుడితో పాటే పని చేస్తున్నారంటే-ధనం కోసం కాదా ? 'పొట్ట' అన్నది వున్నాక దాన్ని నింపుకోవద్దా ! ధనంకోసం కాదా—ఇంతమందీ ఇన్ని పనుల్ని చేస్తోంది?—"

"ధన సంపాదన ఒక్కటే గుర్తైతే దొంగ సంపాదనా, వేశ్యా సంపాదనాకూడా మనం ఒప్పుకోవాల్సి వుంటుంది—"

తల వూపింది "ఔను, వాళ్లకు అంతకన్న ధనాన్ని సంపాయించే శక్తి లేదు; ఉన్నా లోకం వారికి అవకాశాన్ని ఇవ్వదు. ఏం చేస్తారు పాపం ? బీదరికంలోని బాధ తెలుస్తే అర్థమౌతుంది; యాచించటంకన్న తలవొంపు పని వుందా? వినా ఇంతమంది ఆత్మాభిమానాన్ని చంపుకొని తిరుగుతున్నారంటే—ఉదర పోషం కోసం కాదా ? బీదరికంలో పుట్టాను. బీదరికంలోనే పెరిగాను ; నాకు తెలుస్తుంది—ఆ బాధ; భోగిగా ఉన్నన్నాళ్ళూ కడుపు నిండుగా ఉన్నన్నాళ్ళు మీ లాగే మాటలు చెప్పొచ్చు..." ఇంక చెప్పలేక కంట నీరు పెట్టింది.

"నేనేమన్నాను ? ఇంతమాత్రానికే ఏడుస్తావ్ దేనికి ?"

"ఏమనాలి ? మీకు సంసార బాధ్యతే పట్టలేదాయె ! చదువుమాని ఎనిమిదేళ్ళయింది. కుటుంబ కష్టాలు అధికమౌతూన్నా మీకు లెక్క లేదాయె. మీకు సలహా ఇచ్చేపాటి విజ్ఞానం నా దగ్గర లేకపోయినా మన ముందుగతి ఆలోచించండి—" ఆలోచించా ; ఇరవై ఎనిమిదేళ్ళ జీవితం అప్పుడే గడిచి పోయింది ! నేను సంపాయించింది ఏమీ లేదు. గడ్డిపోచ ఎత్తు గౌరవంకూడా లేదు; ఇన్నాళ్ళూ, ఇన్నేళ్లూ వృథా ! ఇప్పుడు నా కృషి అవసరం. నా కష్టాని కొచ్చే ప్రతిఫలాన్ని వీరంతా అనుభవిస్తారా ? నేను తండ్రి సంపాదన్ను అనుభవించలా ? ఏమైనా— ఇదినావిధి !

"మీమీద ఆధారపడి—ఆశలుంచుకొన్న ప్రాణుల్ని చూడండి. మనం ధనవంతులంకాదు. సంపాదనలో కష్టమే ఉండొచ్చు. కాని కష్టంలేని సుఖం లోకంలో వుందా? మీరు చిన్నవారు కాదు. నేను చెప్పవలసిన దాన్ని కాదు. మామగారికి కష్టాన్ని కలిగి స్తున్నారు—" ఇన్నాళ్ళూ ఖర్చుపెట్టమే నేర్చుకొని కూర్చున్న నేను—యీనాటినుంచీ సంపాయించటం నేర్చుకోవాలి! ఇల్లు! బాధ్యత! భార్య! తల తిరిగింది—ఎల్లాగో బైటపడ్డా.

సంసారం బాగా అర్థమౌతోంది. సౌఖ్యంకన్న కష్టం ఎక్కువ. వైవాహిక జీవితంలో—ఒక మెషీన్‌లాగు పనిచేసే బాధ్యత ఏర్ప డది. ఇవన్నీ బంధనాలు—ఉరితాళ్ళు—నిడకన్నా ఘోరంగా వెంట పడే బాధ్యతలు—చెదిరిన మనస్సుతో పార్కులో ఒకమూలకుజేరా. ఇప్పుడు అర్థమౌతోంది—లోకంలో నన్నెవరూ ఎందుకు అత్యు పెట్టరో, నిరుద్యోగి వేదనతో హృదయం నిండి పోయింది. సంపా దన లేందే మర్యాదలేదు. స్నేహితులు నవ్వుతారు. దుర్భరం! నన్నెవ రేమన్నారు? తండ్రిమీద కోపం దేనికి? నా బాధ్యతను నాకు చూపారు. ఎవరి తప్పుంది? బతికినన్నాళ్ళూ తప్పదిది!

రాత్రి చాలా ఆలస్యంగా ఇంటికి వచ్చా.

ప్రభ కళ్ళనీళ్ళు పెట్టుకొంది. "నేను అన్నాననే కదూ—యీ పగలంతా ఇంటికి రాంది? మీ పాదాలమీద పడతాను—నన్ను క్షమించండి. ఇంకెప్పుడూ అనను. మీతో పాటే వుంటే తింటాను— లేకుంటే మానుతాను—"

"ఎవరి తప్పూ లేదు—ప్రభా! నేను బతికివుండటమే నా నేరం ...ఆలోచించాను: సంపాయించాలనే దృఢనిశ్చయాని కొచ్చా. ఉద్యోగప్రయత్నాలు చేస్తాను..."

ఆమె ఏమో ఆలోచించుకొని, "భోజనానికి రాండి—" అంది.

. "ఆకలవటం లేదు—" పమిటచాటున ఏడుస్తూ "నాకు బాధ కల్గిస్తున్నారు. నే నేం చేశాను? నా నేరానికి శిక్ష విధించండి—

అన్నయ్యా, నీళ్ళు మాని సాధిస్తారా—?" నామీద వాలింది.

"ప్రభా! పిచ్చిదాని వౌతున్నావ్—నాకు కోపం లేదు—నీ మాటల్తో నాకు జ్ఞానోదయమైంది. సంపాయించలేని భర్త—భార్యకే అలుసు! లోకానికే బరువు. నీ కోర్కెల్లో, ముచ్చట్లలో నేను దేన్నీ తీర్చలేకపోయ్యాను. ఇకముందన్నా నిన్ను సంతోష పెట్టేందుకు ప్రయత్నిస్తాను—పద...భోజనానికి..."

# 21

గట్టి ప్రయత్నంమీద నెలకు ముప్ఫై రూపాయిల జీతంవచ్చే చిన్న ఉద్యోగాన్ని సంపాయించ గలిగాను. యజమాని దగ్గర చాకిరీతోనూ ఇంట్లో సంసారపు గొడవతోనూ నా కాలం సరిపొయ్యేది. మూడు సంవత్సరాలదాకా కనకం ఏమైందోకూడా నాకు తెలీదు; కాని ఆమెను నేను మరిచిపోలేదు. ఎడబాటుకు బాగా అలవాటైపోయి వుండటంచేత—పూర్వమంత కలతకు గురవలేదేమో ననుకుంటా.

కాలచక్రానికి ఎంత మహత్తర శక్తి వుంది! మనం ఊహించుకో లేని విషయాలెన్నోకళ్ళ ఎదుట జరుగుతయ్; ఒకనాడు సకల సౌఖ్యాల్నీ అనుభవించిన భోగులు—పిలిస్తే పలికే దిక్కులేని రోగులౌ తారు. ఇది ఇప్పటినా జీవిత చరిత్రలో చేర్చుకున్న వేదాంతం...

మట్టిలో కప్పబడ్డ మణిలాగు ఇనాళ్ళుగా మరుగుపడ్డ కనకం—ఒక్కసారిగా ప్రజ్వరిల్లింది. ఆమె తన జీవితాన్ని నాట్యకళకు అంకిత మిస్తూన్న విషయం తెలుసుకునేదాకా—ఆమె విలువను గ్రహించలేక పొయ్యాను. చిత్రాల్లో నటించి ఆమె పేరు సంపాయిస్తోంది; అనాటి పిచ్చి కనకంలో ఇమిడివున్న కళా జ్ఞానమంతా యీనాడు అన్ని వైపులకూ వ్యాప్తమై తన ప్రతిభను ప్రకటిస్తోంది.

ఆమె నటించిన మొట్టమొదటి చిత్రాన్ని చూసి తన్మయులైపోయాను —తెరమీది ఆమె ప్రతిబింబం నన్ను పలకరిస్తున్నట్టే స్ఫురించింది. ఇప్పుడామె వయస్సు ఇరవై నాలుగు సంవత్సరాలే వినా—తెర మీది కనకం—నా కా మొందటిరాత్రి నూత్న అందాన్ని అందిచ్చిన కనకంలాగు వుంది! 'జీవితాన్ని ఆరు సంవత్సరాలు వెనక్కు నెట్టే సుకొంది—కళారాధకులకు యీ ప్రజ్ఞ వుంది కాబోలు! ఎంతమంది ప్రేక్షకులు ఆమెను యీ నాడు మొట్టమొదటిసారి చూసి, భ్రమిస్తూ ఎన్ని ఆశల్ని ఊహాప్రపంచంలో కల్పించుకొంటున్నారో! కళారా ధన లోకానికి ఎంత ఉపయోగపడుతోందోనన్న ప్రశ్న యీ నాడు నాకు స్ఫురించింది. పరిస్థితులు అనుకూలంగా వుంటేనే కాని వ్యక్తి గతమైన సామర్థ్యత తెలీదు కాబోలు!

దాదాపు ముప్పై వసంతాలు గడిచిపోయిన నా జీవితంలో— లోకానికి పనికివచ్చే పని నేను ఒక్కటైనా చెయ్యలేదు. మానవుడు తన కీర్తిని తన చెవులారా వింటూంటే ఎంత ఆనందాన్ని అనుభవి స్తాడో! తనను అత్యాధిక్యతతో చూచేవాళ్ళ నడుమ ఎన్నాళ్ళ యినా బతుకుదామనిపించదా? కనకం ధన్యురాలు—ఒక కళను ఆరాధిస్తోంది—ఇప్పటి ప్రజలకే కాకుండా, ముందు జన్మించ బోయ్యే ప్రజలక్కూడా ఆమె కళారాధనతో పనివుంది! నేను మాత్రం కనకంలాగు ఒక కళను ఎందుకు ఆరాధించరాదు? కాని నాలో ఏం విశేషం వుంది?

కొన్నాళ్ళనుంచీ నా దృష్టి సాహిత్యంమీద కేంద్రీకరింపబడ్డది. తమ అనుభవాన్నంతటినీ ఇమిడ్చి లోకచరిత్రనే 'కళ్ళకు కట్టినట్టుగా రచనల్ని సాగించిన మహానుభావులు జ్ఞాపకం వచ్చారు. కథలు రాసి సాహిత్య సేవ చేద్దామనే సంకల్పంతో, నూతనోత్సాహంతో ప్రయ త్నించసాగాను.

# 22

నా ఆరు సంవత్సరాల కృషి వృథా పోలేదు. కథారచనలో కొంత అనుభవాన్ని సంపాయించాను. చాలామంది స్నేహితుల దగ్గర్నుంచీ, ముఖ్యంగా కనకం దగ్గర్నుంచీ—నా కథలు బాగున్నాయనీ ఇంకా ముందు ముందు దేశానికి ఉపయోగించే కథలకోసం ఎదురు చూస్తూంటామనీ ఉత్తరాలు వచ్చేవి. ఈ కాలంలో కనకం నటించిన మరి నాల్గు చిత్రాల్ని చూడగలిగాను. నానాటికీ ఆమె కళాదృష్టి తీక్ష్ణత వహిస్తోందనితోచింది. అనేకపత్రికలు ఆమె నటనా కౌశలాన్ని ప్రశంసించాయ్. ఆమె పేరు అనేకమందికి అతి ముఖ్యమైపోయింది.

రెండు మూడు సార్లు మెడ్రాస్ వెళ్ళి ఆమెను దర్శిద్దామనిపించింది — సుదినాలసేవి ఆమె చూడగలుగుతూన్న యీ జీవిత ఘట్టాల్లో ఆమె ఎల్లా వుందో ఊహించుకోలేకుండాకూడా వున్నాను. కాని అనేక అవాంతరాలవల్ల నా ప్రయాణం పడనేలేదు. నన్ను రమ్మని కనకం రాసిన ఉత్తరాలే నన్ను ప్రయాణానికి మరింత ప్రోత్సహించినయ్. ఆ సంవత్సరం మెడ్రాస్ వెళ్లా.

ఇంటిదగ్గర ఆమెలేదు—ఎప్పుడో సాయంత్రానికికాని రాదట... నాకేమీతోచక స్టుడియోకు వెళ్ళా. కోమిసాల దవాలా బంట్రోతు గేటుదగ్గరే నన్ను ఆటంకపరిచాడు. లోపల జరుగుతూన్న షూటింగుకు నేను అడ్డమొస్తానని వాడికి తెలుసేమో! నాలాగే అక్కడిదాకావచ్చి ఆశాభంగంతో తిరిగిపోతున్నవాళ్ళు నా కళ్ళ పడక పోలేదు. కాని, నాకూ కనకానికీ వున్న స్నేహం వీళ్ళల్లో ఎవరికి తెలుసు! ఒకవేళ నాలాటి సామాన్యుడు చెప్తే మాత్రం ఎవరు నమ్ముతారు? హతాశా హృదయంతో పిచ్చివాడులాగు ఆ సాయంత్రం వరకూ ఊళ్ళో తిరుగులాడాను. ఆ అరవగోడుతో చెవులు గింగురుమంటున్నై.

రాబొయ్యే ముందు నేను రాసిన ఉత్తరం ఆమెకు అందలేదేమోనని ఆలోచిస్తూ తలొంచుకు నడుస్తున్నా. మౌంట్—బీచికి వెళ్ళే జనమూ—కార్లూ, ట్రాములూ, సైకిళ్ళూ—రణగొణధ్వని పిచ్చెక్కిస్తున్నాయ్. కారు బుర్రున వచ్చి నాకు సమీపంలో ఆగింది. ఒక్కసారిగా హడలిపోయి చూశాను—కొంచమైతే మీదిగా కూడా పొయ్యేది! ప్రాణగండం!

కారు డ్రైవరు, "ఏమయ్యా! హారన్ కొడితే వినపడదా! చెవుడా!" అంటున్నాడు. నాకు అతని మాటలమీద లక్ష్యంలేదు—కార్లోకి చూస్తున్నా—అప్పుడే కొన్న పేపర్ను ముఖానికి అడ్డం పెట్టుకొని చదువుతూన్న స్త్రీ వ్యక్తి—ఎవరా వీడని కాబోలు—నన్ను చూస్తోంది.

కనకం! వెదుకుతూన్న తీగ! ఎంత ఫ్యాషనబుల్ గా తయారైంది 'కనకం!' అని పెద్దకేక వేశాను పిచ్చివాడిలాగు. కారు ఆగటం తడవుగానే కారుచుట్టూ కొంతమంది జేరి గుసగుస లాడుతున్నారు. బింకంతో వాళ్ళందర్నీ తోసుకుంటూ ఆమె దగ్గరకు వెళ్ళాను. ఆమె నవ్వుతూ తలుపు తెరిచింది. వెళ్ళి ఆమె పక్కనే కూలబడ్డా; చుట్టూ జేరిన వాళ్ళందరూ తెల్లమొగాలు వేసి నోళ్ళు సగానికి తెరిచి నావైపు యీర్ష్యగా చూస్తున్నారు.

"ఇంటికి పోనీ—!" ఆజ్ఞాపిస్తున్నా, ఆరోజుల్నాటి కంఠమే అది! కారు బైలుదేరింది...ఆమె రూపులోనూ, దుస్తుల్లోనూ పొందిన విచిత్రపరిణామాన్ని కన్నార్పకుండా చూస్తున్నా. గాలికి రెపరెప లాడే పమిటా, చిందర వందరగా ఫాలభాగంమీద నాట్యంచేస్తూన్న ముంగురులూ, కొంటెగా చూసే పక్కచూపూ, చిరుపెదవులమీది వెన్నెల నవ్వూ—అన్నీ కలిసి పూర్వపు కనకం కన్న యీ కనకానికి ద్విగుణీకృత సౌందర్యాన్నీ ఆకర్షణనూ ఇస్తున్నాయ్...ఆమెకూడా ఒక్కక్షణంలో నారూపులో పొందిన పరిణామాన్ని కాబోలు చూసింది.

"ఎప్పుడొచ్చావ్—రాజూ?" ఎంత దయతో అడిగింది!

"ఈదయాన—" "వస్తున్నట్టు ఉత్తరమైనా లేదే?"

"రాశాను—అందలేదేమో?" కొంచెమాగింది— ఆ కళ్ళల్లోని మెరుపులోనే అనేక విచిత్ర మార్పులు—

"ఏమిటల్లా చూస్తావ్?" "ఎంత మారావ్—కనకం!"

"ఆరు సంవత్సరాల క్రితం చూశావ్ కదూ! అందుకని, అల్లా కన్పిస్తోందా?"

"తెరమీద చూస్తూనేవున్నాగా నిన్ను!"

"మరి అంతగా మారానా?"

"తెరమీది కనకానికీ, యీ కనకానికీ చాలా భేదముంది—"

"నాకు తెలీకుండానే నాలో మార్పు వచ్చిందన్నమాట—ఏమిటా మార్పు?" నవ్వింది.

"నీకు నానాటికీ యవ్వనం వృద్ధిపొందుతూన్నట్టుంది—కనకం! నీ కళ్ళల్లోని కాంతి కిరణ జాలపు సంఖ్య వృద్ధవుతోంది — ముఖ వికాసం......"

"ఆపు...వర్ణించొద్దు. దీర్ఘ వియోగానంతర సంయోగంలో అల్లాగే కన్పిస్తాలే. శ్రీకరంలో చూచినప్పటిలాగు లేననుకుంటు న్నావ్ కదూ? అప్పటికీ ఇప్పటికీ—నాకే పునర్జన్మ ఎత్తినట్టుగా వుంది—"

ఇంటి ముందు కారు ఆగింది—ఇందాక ఆ పెద్ద సౌధాన్ని బైటి నుంచే చూశాను—ఆమెతో లోన ప్రవేశించాను. అరుగుమీది ఆరు కుర్చీల్లోనూ ఏదీ ఖాళీలేదు. ఆమె చెప్పుల చప్పుడుకే అందరూ లేచి నిలబడ్డారు. నాకోసమేమో ననుకున్నాను కాని, ఆ ఆరుముఖాల్లోనూ ఒక్కటైనా నేను ఎరగనిదే. కనుబొమల్ని దగ్గరగా జేర్చి ఆమె అం టోంది; "కొంచెం సుస్తీగా వుంది—తలకాయ నొప్పి వస్తోంది. ఇవ్వాళికి ఎవరితోనూ మాట్లాడలేను—క్షమించాలి స్టుడియోకు రాండి—" చరచరా లోపలికి వెళ్ళిపోయింది; తెల్ల మొగాలువేసి

అందరూ నావైపు కొరకొరా చూస్తున్నారు. వాళ్ళల్లో కట్టేసుకున్న కుక్క మా అందరికీ సమాధానం చెప్తోంది. నేను వాళ్ళను గమనించ నట్టుగానే లోపలికి వెళ్ళిపొయ్యా—కనకం నేలను కాలితో తం తూంది.

"తలకాయ నొప్పా?" అన్నా. "ఆc మందిస్తావా?"

"నేనేం డాక్టర్నుగాను—" నా జ్వరంలో ఆమె ఇచ్చిన సమాధానమే ఇదని గుర్తొస్తోంది! నవ్వింది—"చూడు రాజూ! ఎక్కడికి వెళ్ళినా తప్పరు—నక్షత్రకులు! నాకోసం ఇంటి చుట్టూ ప్రదక్షిణాలు చేస్తారు. లక్షాధికార్లు కార్లేసు కొస్తారు—వాళ్ళ బొజ్జల్ని చూసీ, జరీ తలపాగాల్ని చూసీ బ్యాంకు చెక్ బుక్స్‌ను చూసీ—వాళ్ళ పాదాలమీద పడతాననే వాళ్ళ ఆశ! పద్మం చుట్టూ తిరిగే భ్రమరాల కైనా బుద్ధి వుంది—వీళ్ళకు లేదు...వాళ్ళ వేషాలు చూస్తూంటే—మూడో కన్ను వుండి దాన్ని ఉపయోగిస్తే బాగుండు ననిపిస్తుంది. తప్పనిసరిగా ఆ సమయానికి లేని అర్జంటు పనులూ, తల నొప్పులూ—అనేకం నన్ను ఆవరిస్తయ్—"

"నన్ను చూసినావా?"

"అన్నానా!...ఎంతమందో చూశావా వీళ్ళందరికీ నా స్నేహం కావాలట! ప్రొడ్యూసర్లూ, డైరెక్టర్లూ, ఎడిటర్లూ—ఇంటర్వ్యూలనీ బిజినెస్ అనీ, అభిప్రాయాగమనీ వేధించుకుతింటారు. వీళ్ళగొడవ మహా నవ్వొస్తుందిలే—రా—రాజూ! ఇల్లు బాగుందా?—"

ఇల్లంతా తిప్పింది—ఒకనాడు ఆసిపాస్తులులేని కనకం—యీనాడు పెద్ద భవనానికి అధికారిణి! ఆధునిక విద్యుచ్ఛక్తిలో అమర్చ బడ్డ సౌధం—ఎంత ఖర్చయిందో—ఇది కట్టడానికి! మేడమీదికి తీసుకువెళ్ళింది—పడకగది! కిటికీల్లోంచి వీచే చల్లనిగాలి—దూరాన కన్పిస్తూన్న సముద్రపుటలల కదలిక—సూర్యుడు అస్తమించినా వెలుగుమాయని సమయం—నన్ను నేనే మరిచి పొయ్యానా!

"కూర్చో ఇప్పుడేవస్తా—".

పది నిమిషాలు అంత గొప్పగదికి ఒక్కణ్ణే అయ్యాను. తిరిగొచ్చి అద్దంముందు నిలబడి కుంకుమతో బొట్టుపెట్టుకుంటోంది.

"పెళ్ళయిందా ?"

గిరుక్కున తిరిగింది—"ఆ...పెళ్ళి! పెళ్ళికాకపోతే బొట్టు పెట్టుకోకూడదా రాజా ? ఈ బొట్టులోనూ, ఆ జంధ్యంలోనే వుందా—పతివ్రత్యమూ, బ్రాహ్మణికమూను ? నీకూ్కడా విజ్ఞానం రోజురోజుకూ క్షీణిస్తోంది కాబోలు ! మానవ హృదయ వేదనను—మానవుడే గ్రహించలేని అధమస్థితిలో ఉన్నాడంటే—పశువుకు ఏ విధంగా అధికుడో అర్థమవటంలేదు—వితంతువంటే ఇంతమంది దృష్టికి దిష్టి పిడతలాగుండాలా ? ఏ అధికారమూలేని బానిసలకు బానిసగా ఉండాలికదూ ? జన్మహక్కయిన మానవత్వాన్నీ, వ్యక్తిత్వాన్నీ, సౌఖ్యాన్నీ చివరకు భగవంతుడిచ్చిన కురుల్నికూడా ఉంచుకునే హక్కు లేదుకదూ; నారీత్వాన్ని లాక్కునే శక్తి లేదేననేనా ? మీ అందరి ఏడుపూను ? లోకంలో జన్మించటం ఒక్కటే నేరమైనట్టు లేని హక్కుతో వితంతువుల జీవితాన్ని భగ్నం చెయ్యటమేనా మీరి ఆశయం ? భోగులకు—మాకేం తెలుస్తుంది ఆ బాధ ? కడుపు నిండిన మాటల్నీ, కడుపులో చల్ల కదలకుండా చెప్పే ఉపన్యాసాల్నీ ఏకరువు పెట్టటం కాదు. నలుగురూ నవ్వుతూ దూషించినంత మాత్రాన, నీచురాలుగా చూసినంత మాత్రాన ఆమె నారీత్వం ఏమైందీ ? పదిమంది బలవంతులు ఒక్క బలహీనుణ్ని చావబాదట మేగా న్యాయం ? నా శ్రేయస్సు కోరుతున్నామని బురఖాలు వేసుకొని తిరిగేవాళ్ళందరికీ నా వేషాలు ఇష్టంలేవు—కాని నా ఐశ్వర్యం అందర్నీ ఓడించగలదు. అర్హత, అనర్హలోనూ సుగుణ దుర్గుణాల్లోనూ ఎవరికి పని ? నే నిప్పుడు ఎంత ఆట ఆడినా ఫర్వాలేదు—అవునా ?" నుదుటి కుంకుమ రంగుతో కలిసిన ముఖవర్ణంతో నా వైపు చూస్తోంది—

"కోపం వచ్చిందా ?"

"లేదు." ఎంతలో ప్రసన్నత! అపాయంలేని వ్యక్తి! కిందినుంచి వచ్చిన టీని సేవించాం...నా పక్కగా కూర్చొని నా ముఖంలోకి చూస్తూ అంది: "రాజా! నిన్ను చూచినప్పుడల్లా వెనుకటి రోజు లన్నీ జ్ఞాపకమొస్తయ్. మానుతూన్నదీ, కొద్దిగా చెక్కు కట్టిందీ—పుండు మళ్ళా రేగుతుంది. ఏదో చెప్పలేని విచారంతో హృదయం నిండుతుంది...ఇప్పుడు నువ్వు హాయిగా వుంటున్నావ్ కదూ!"

మెత్తని కళ్ళతో నా హృదయాన్ని మేల్కొల్పుతోంది. ఆరు సంవత్సరాలనాటి కరస్పర్శ...ఆమె మాటలకు నాకూ అన్నీ జ్ఞాపక మొస్తున్నయ్. ఏం చెప్పలేను నా జీవితం సంగతి!

"నీతోక సరి...కనకం! నువ్వుకానీ, నేనుకానీ జన్మించకుండా వుండకపోతే—రెండు జీవులు ఇంతగా బాధపడేవి కావేమో! ఆ రోజులు మరిచేటంత తేలికవా? ఆక్షణాలన్నీ హృదయపుటాల్లో సువర్ణాక్షరాల్లో ప్రకాశిస్తూంటాయ్. జీవితంలో ఎంత అగాధ మేర్పడ్డా—ఆ గడిచిన రోజులు ఎంత దూరమైనా కన్పిస్తూనే వుంటాయ్. ఒక్కొక్కసారి నేనుఅనుకుంటాను: నేనొకభూభారమని... ఆనాటి చందమామే యీనాడూ ప్రకాశిస్తూన్నా మనలో ఎంతమార్పు! ఆ అనుభవమంతా గడిచిపోయింది......వెనక్కు తిరిగి చూసుకుంటే ఎన్నాళ్ళు ఎన్నేళ్ళు గడిచిపోయ్యాయోననిపిస్తుంది...ఆ అనుభవాలేవూ నీకు? మనకు తెలీకుండా వచ్చే యీ మార్పులు—చెప్పకుండా ఎదురయ్యే కష్టాల్ని తప్పనిసరిగా ఎదుర్కొంటూ—నలిగిన జీవితాన్ని ఎల్లాగో యీడ్చుకు పోవటమే కావాల్సిందనే స్థితికి కూడా దిగలేదా—మనం?...పూర్వపు క్షణాల్ని యీ క్షణాల్లో పోల్చి—అంత ఆనందం.లేదే అని ఏడుస్తాం. ఆభేదాన్ని గుర్తించ కుండా వుంటే ఇంత బాధ ఉండదు—హృదయాలున్న వాళ్ళందరూ వెనుకటి విషయాల్ని జ్ఞాపకంచేసుకొని—మనలాగే బాధపడతారు—కదూ!..."

కళ్ళు చెమ్మగిల్లుతున్నై. శరీరంలో ఆబాధ ఎక్కడో గుర్తించినా—లేదు దానికి మందు! గడిచిపోయిన క్షణాల విలువను యీనాడు

గురించలేకపోతుంటే ఇన్ని అదృష్టం ఇంకెక్కడుంది?

"పొరపడుతున్నావ్ — రాజా! గడిచిన కాలమే మంచిది. త్వరగా విముక్తి మార్గాన పడతాం. అవి మంచిరోజులే కావొచ్చు—కాని, వాటిని అంటిపెట్టుకున్న చెడ్డరోజుల సంగతేమిటి?..." మాట్లాడలేక కాబోలు—చిరుపెదవుల్ని నొక్కిపెట్టింది. ఇద్దరమూ నిశ్శబ్దంలో నే విచిత్ర సంఘటనల్ని జ్ఞాపకం చేసుకుంటున్నా మనుకుంటా. కళ్ళు రెండూ మూసి, అరచేతుల్లో ముఖాన్ని కప్పుకుంది—నాలాగే అంతా మరిచిపోదామని ఆత్మతో వ్యర్థంగా పోరాడుతోందా? ఈ ఆత్మపరీక్షలు మరింత బాధను కలిగిస్తాయ్.

"కనకం!" ముఖం ఎత్తింది; ఎర్రబారిన ఆ మెరకళ్ళు దీనదృక్కుల్ని ప్రసరింపజేస్తున్నయ్.

"మధు ఏడీ?"

గట్టిగా ఊపిరి పీల్చి అంది. "వస్తాడు—రాజా! నా కష్టాల్ని నిజంగా ఆచినవ్యక్తి అతనే! యీ విశాల విశ్వంలో కొరగాని తృణంగా పడివున్న నన్ను దారెపోతూ ఏరి, సాకపట్టి యీ స్థితికి లాక్కొచ్చాడు. అంత ఉదార స్వభావుణ్ని కలుసుకోగలుగుతాననుకో లేదు...నన్నుగూర్చి అడుగుతూ వుంటాడు..." మళ్ళి సాగించింది హాగ్దను! ఆమె కృతజ్ఞతను చాటే భాష అదేనని ఆమె అభిప్రాయం కాబోలు! నాదనుకొన్న కనకం—వాడిదై పోయింది! కిందినుంచి కుర్రవాడు ఉత్తరాలకట్ట తెచ్చాడు; దాదాపు యాభై వలపైకవర్లున్నయ్.

"ఏమిటవ్వి?" నవ్వింది నిర్లక్ష్యంగా.

"ఈ దేశంలో ఎంతమంది మూర్ఖులున్నారో నేను చెప్పగలను! నాలాటి అందగత్తె, నటీ అయిన ప్రతి వ్యక్తీ చెప్పగలదేమో? ఉత్తరాలు రాసిన వాళ్ళందరికీ నేను కావాలి; కనీసం నా ఫొటో కావాలి! అసలు వస్తువుకొరక్కపోయినా—ఆ ఛాయకోసం తంటాలుపడి, దాన్ని ఏదుకొనైనా తృప్తిపడదామనుకొనే మూర్ఖుణ్ణి!

వాళ్ళ పొగడ్తలకు నేను ఉబ్బి, వాళ్ళను ఆహ్వానిస్తా ననుకొంటారు! ఉత్తరాలు రాని—రానీ వూరు కుంటారేమో ననుకుంటే—రిజిస్టరు కూడా ఇస్తారు వీళ్ళందర్నీ ఏకం చేస్తే నా పాదాల్ని భూమిమీద ఉంచరేమో కూడా! నా పాదధూళికి కూడా విలువ వుంది...ఈ నాడు నా ముక్కూ, మొగమూ తెలియని వాళ్ళకు కూడా నామీద అభిమానం! జమీందార్లు జమీలోని భాగాల్ని నాకు కానుకలుగా ఇస్తానని ఆశలు చూపుతారు; కళ్ళముందు లక్షలమంది అన్నంలేక ఛస్తున్నా వాళ్ళకు కన్పించదు. కాని, వెయ్యిమంది మధ్యవున్న అందమైన ఆడది మాత్రం బాగా కన్పిస్తుంది! ఈ జన్మలో వీళ్ళెవరికీ గగన కుసుమానికి ఆశిస్తున్నామని తెలీదు కాబోలు!...ఇదిగో రాజా! నీ ఉత్తరం! నీది కూడా ఆ 'ఫాన్స్'లోకి పోయింది..."

ఉత్తరం అందిచ్చింది—దాన్ని విసిరి కొడుతూ, "నీ అందానికి నువ్వు చూపుకొనే అభిమానం—ఇదంతా!" అన్నా.

"సౌందర్యం అరుదైంది కనుక నే, సౌందర్యవంతులకు స్వాభిమానం ఉండక పోదు. కాని ఒకప్పుడు పనికిరాని నా అందానికి యీ నాడు ఇంత విలువ వచ్చింది! సౌందర్యాన్ని మాత్రమే ఆరాధించగల వాళ్ళు ఇంతమంది ఉండబట్టే దాని కా విలువ! అందమైన దాన్ని కాదా?" ఎట్లా అనను కాదని? "ఔను, అందగత్తెవబట్టే ఇంతమందిని ఏడిపిస్తున్నావ్—" అన్నా.

నవ్వింది...చంద్రోదయమై వెన్నెల వస్తోంది.

"స్నానానికి లే రాజా—!"

చెయ్యిపట్టి లాగింది—ఆమెను అనుసరించా, ఏదో ఆలోచిస్తూ.

# 23

భోజనాలయ్యాక, పోర్టికోలోనికుర్చీల్లో కూలబడ్డాం. చుట్టుపట్ల ఒత్తుగా పెరిగివున్న పచ్చికమీదినుంచీ, పూలమొక్కలమీదినుంచీచల్లని

పిల్లగాలి వీస్తోంది. పైన శశాంకుడు నీలాకాశంలోంచి తొంగితొంగి చూస్తున్నాడు. ఆ మొదటరాత్రి కనకంతో గడిపిననాటి వాతావరణం ఇలాంటిదే—కాని కొన్నేళ్ళ దూరం వుంది...దానికీ, దీనికీ !

నవ్వుకుంటూ ఏవేవో కబుర్లు చెప్తున్నారు. వాళ్ళిద్దరి స్నేహానికీ, సౌభాగ్యానికీ పైకి సంతోషపడుతున్నా—లోపల పీడించే జలసీచేత బాధపడుతూనే వున్నా. లోపలి విషాన్ని తెలిసికోని వాళ్ళల్లే—వాళ్ళు నన్ను ఆప్తబాంధవుడిలాగు ఆదరిస్తున్నారు. మానవ హృదయాలకు ఒక్కొక్క సమయంలో అయినవాళ్ళూ, కానివాళ్ళూ అనే విచక్షణ కూడా వుండదు కాబోలు! మధు నవ్వుతున్నాడు—నవ్వటంలో అతనికి ప్రత్యేకస్థానం వుంది! వాడు కనకాన్ని ఇన్నాళ్ళుగా తనదిగా చేసుకున్నాడన్న మాట జ్ఞాపకానికి వస్తున్నప్పుడల్లా...నాలో అణిగిమణిగిన కామం తలెత్తుతోంది. తన కనకాన్ని చూసుకొని అతను గర్విస్తున్నాడేమో ? కనకం వైపు చూశాను—బుగ్గలు సొట్టలు పడేట్టు నవ్వుతోంది—ఇదంతా నాబోటివాళ్ళకు ఆశల్ని పెడుతూ, లేని కొత్త కోర్కెల్ని రేకెత్తిస్తూ, అందకుండా ఊరించగలిగి ఎగతాళి చెయ్యటానికేనా ?

"మీ కథల్ని చదువుతూనే వున్నా—" నా సంగతి వచ్చేటప్పుటికి ఉలిక్కిపడ్డా.

"ఏమీ బాగుండటం లేదు—" అని కనకం మిగతా వాక్యాన్ని పూర్తి చేసింది. "ఎందుకనో తెలుసా!" కొంటెగా చూస్తోంది. మౌనంతో వినటమే నేను చెయ్యగలిగింది.

"అనుభవం లేనిది ఎందుకూ కథలు రాయటం! అసాధ్యమూ, అసంభవమూ అయిన సంఘటనల్తో యీ లోకానికీ, యీ వాతావరణానికీ, తగని పాత్రల్ని సృష్టించి—ఆదర్శం కోసమనీ, నీతికోసమనీ ఎందుకూ ఆ కథల్ని రాయటం? అతిసహజమైన పాత్రలో నీతి వుండకపోతే మాత్రమేం! పాత్రల సచ్ఛీలాలకోసం పాకులాడి, అష్టవంకర్లుగా కథ నడపకపోతే ఏం? అర్థంకాని వ్యర్థపదాల్తో ప్రేమా

అని గొంతెత్తి అరుస్తే ఎవడికెక్కాలి? లేనిబాధను ప్రవేశపెట్టు
కొని ఏడుస్తూన్నట్టుగా స్కెచెస్ పేరుతో చలామణీ చేసుకుం
టూన్న రచనలు చదివి ఏం నేర్చుకుంటారు—పాఠకులు? అమాయ
కపు పాఠకులు! నియమాలకు లోబడి, రచనల్ని అయిష్టతతోనే బం
ధించి—నీతితో నింపిన కధను పొగడుతారు—చదివి మోసపోతారు.
స్వానుభవాన్ని కూడా మరిచి రచయితతో తాళం వేసేవాళ్లూ, పది
మందీ బాగున్నాయ్ అంటున్నారని తాముకూడా బాగున్నాయ్ అనే
పిచ్చివాళ్ళు! అర్థంకాక వ్యర్థమయ్యే యీ కథల్ని రాయకపోతే ఎవ
రేడ్చారు? చేస్తూన్నదీ, చూస్తూన్నదీ, వింటూన్నదీ వ్యభిచారమే
అయినా—దాన్ని కథలో ప్రవేశపెట్టకూడదట! ఎందుకంటే—
దాన్ని చదివి చెడిపోతారట! అంతమాత్రాన పాడయ్యే శీలాలున్న
వ్యక్తులు ఎంతమందో? కథల్ని చదివి పాత్రల్ని అర్థంచేసుకొనే
వాళ్లుంటారు కాని...ఆపాత్రల్లాగే తమ జీవితాన్ని గడుపుదామను
కొనేవాళ్ళుంటారా? అల్లా వుంటే యీ రామాయణ పఠనాలూ,
భాగవతపఠనాలూ, మనలో అనేకమంది సీతల్నీ, రాముళ్ళనూ, భీష్ము
ల్నీ, కర్ణుల్నీ సృష్టించలేదేం? కథల్ని చదివి జీవితపథాన్ని నిర్ణయిం
చుకొనే వాళ్ళెవ్వరూ వుండరు; శిల్పంలేని రచనలతో యీ చెత్త
కథల్ని రాయటం దేనికి? మాటాడితే సాహిత్య సేవకులని సాకు
చెప్తారు—" ఆమె కోరేరకం కథల్ని అంతవరకూ నేను రాయనం
దుకు నన్ను నేనే తిట్టుకొన్నా. ఆవలింతలు అధికమయ్యాయ్.
ఒక్కసారి ఒళ్ళు విరుచుకొన్నా. నన్నొక్కణ్నే కింద కూలేసి
వాళ్ళిద్దరూ హాయిగా పైన పడుకుంటారు కాబోలు! మధుగాడు—
ఏడెల్లాగైనా వదిలే మార్గం లేదూ? మనది అనుకునేదాంట్లో భాగం
కావాలని కోరేవాళ్లూ, సంపాయించినవాళ్ళను చూస్తే ఇల్లాటి
భావాలే కలుగుతయ్ కాబోలు!

నా ఆవలింతలు చూసి కాబోలు—"పిచ్చి! అతన్ని తీసుకు—పో"
అన్నాడు. "ఎక్కడికి?" అన్నా నాకు అర్థంకాక.

"మేడమీదికి—" అని 'అల్లా చూస్తావేం!' అన్నట్టు చూస్తు న్నాడు.

కనకం నవ్వుతోంది—ఇద్దరి మధ్యా నేను నలిగిపోతున్నా—నా భావాల్లో ఏఒక్క భాగమైనా నాకు అర్థమైవుంటే అంత అవస్థ పడేవాణ్ణి కాదు; ఆశ్చర్యంలో చూస్తూన్న నన్ను గాజులు గలగల్లాడే మృదుహస్తాల్లో పట్టుకొని—"రా—రాజూ!" అంది. మధు నవ్వు నన్ను వెక్కిరస్తోంది. నన్ను ఒంటరిగా ఆమెతో పంపుతున్నాడు. హృదయపూర్వకంగానేనా! మానవ సహజమైన యీర్ష్య ఏమైంది! నాకు ఆత్మపరీక్షా! ఎదుటవున్నది కూడా తెలీటం లేదు—ఈ దేశం లోని యీనాగరికతలోని పరిణామ ఛాయా ఇది! నీతీ నియమమూ నన్ను నేలకొట్టుతున్నాయ్. నవ్వుతున్నాయి నిలబడ్డ నన్ను లాక్కు పోతోంది—నా ఆజ్ఞలేకుండానే నా శరీరం ఆమెను అనుసరించింది.

# 24

"నువ్వు నా భార్యవైనట్టయితే యీ క్షణాన నిన్ను చిత్రవధ చేసి వుందును!" ఈ లోకంలో ఇంతటి అన్యాయమైన, నీతిదూర మైన పని, కళ్ళ ఎదుట జరుగుతూంటే చూసి సహించలేని నా హృద యంనుంచే యీ మాటలు వెలువడ్డయ్. ఏదైనా ఆయుధం వుంటే ఆక్షణాన ఉపయోగించే వాణ్నేమో కూడా! ఆమెకు అధిక కోపం తెప్పించి కరకు పలుకుల పదునుతో ఆమె హృదయంలో కనపడని గాయాన్ని చేసి ఆమెను బాధిస్తే గాని—చల్లారదు అప్పటి నా 'కోప జ్యోతి'!

నన్ను మంచంమీదికి తోసి, పక్కనే కూర్చొని ఇంకా నవ్వు తూనే వుంది. "వేశ్యకూ నీకూ భేదంలేదు—" ఇంకా నవ్వుతూనే జారిపోతున్న పమిటను సవరించుకుంటూ కొంటెగా నా కళ్ళల్లోకి చూస్తోంది.

"ఇంత కులటవూ, పాపివీ, వ్యభిచారిణివీ అవుతావని—ఎప్పుడూ అనుకోలేదు—" ఇంకా నవ్వు ఆపనేలేదు. ఆమెకు కోపం తెప్పించటం—నాకు అసాధ్యమైన వాటిల్లో వొకటా? ఇంత శాంతాన్ని ఏ గాంధిగారి దగ్గర నేర్చింది?

"రాజా!...పిచ్చి...రాజా!" నామీదవాలింది; హస్తాల్లో మృదుత్వం లేదు; బరువైన లోహపుముద్ద పడ్డటుగా వుంది—ఆ స్పర్శలో ద్రావక ప్రభావం స్ఫురించింది—ఆమెను చూస్తూంటే అసహ్యం పుడుతోంది. ఆమెచెయ్యితీసి విసిరికొట్టి, "నన్ను ముట్టుకోకు; వాడికి బుద్ధిలేదు—నీకూ్కడానా?" అన్నా చేతనైనంత కోపాన్ని కళ్ళల్లో చూపుతూ.

"ఏముటోయ్—నీ అనుమానం ?"

"ఏమిటా? లోకం ఏమంటుంది? నీతీ నియమమూ అక్కర్లేదా? ఇది వ్యభిచార గృహమా?...చిన్నతనపు అమాయకత్వంలో తెలియక చేశావేమో...తప్పు కావచ్చు...తెలిసాక, యీ నాటికీ యీ పనులు...ఛీ...ఛీ!...లోకంలో మీలాంటి వాళ్ళున్నారనీ, ఇలాంటి సంఘటనలు జరుగుతున్నయ్యనీ ఎప్పుడూ అనుకోలేదు..." నిగ్రహమంతా నాలో మూర్తీభవించిందనుకుంటూ.

"ఇప్పుడనుకో—ఇంకా చిత్ర విచిత్రాలు లేవా లోకంలో!"

"ఎందుకుండవు! వ్యభిచారిణులకు బాగా కన్పిస్తయ్. నిర్మల ప్రేమకు హృదయంలో తావియ్యలేక, జీవితాన్ని పాడుచేసోకవటం నేర్చుకో నక్కర్లేదు. నేర్చుకోవాలి—ప్రేమించి, సౌఖ్యాన్ని అనుభవించటాన్ని...అంతేకాని..." నామాట పూర్తికాక పూర్వమే వికటాటహాసంచేసి, "ప్రేమ!...ప్రేమ!...యీలోకంలో వుందా అల్లాటిది?" అంది.

"నీకులేదు—నీ మొండి బండ హృదయానికిలేదు...వ్యభిచారిణులకు లేదు—"

"ఆ, నీకు వుందా? చూపగలవా?"

"నీ ఆత్మకు తెలీదా వుందో లేదో!" నాలో ఇది వుందో లేదో నా కళ్ళకే కన్పించనిది, ఆమెకెల్లా చూపగలను!

"తెలుసు—కవులకూ, కథకులకూ వుంది. లోకమంతా ఏకమై వుంది...వుందని బుర్రలూపుతూంటే మోసపోయ్యాను. చూశాను—ముప్ఫైసంవత్సరాలుగా అన్వేషించాను; ఆత్మనే పరీక్షించుకొన్నా—లోకాన్ని చూసి అనేక పరిశోధనల్ని చేశాను; ఎక్కడా కన్పించలేదు—వుందని రుజూచేసేవారుకూడా ఎదురవలేదు. ఇది కవులూ, కథకులూ కలిసి కొత్తగా కనిపెట్టిన పదమని నాకు తెలుసు. పోనీ నువ్వు దాన్ని అనుభవించావా!"

"ఒకప్పుడు నిన్నే ప్రేమించలేదా?"

"ఇప్పుడేమైంది—అది! ప్రేమ అనేది ఒకప్పుడు వుండటమేమిటి! మరొకప్పుడు వుండటమేమిటి? ఒకనాడు హృదయంలో నాకిచ్చిన స్థానాన్ని మెల్లిగా మరో స్త్రీకి ఇవ్వలేదా! నీలాంటి హృదయాలు కావూ—అందరివీను! మానవ ప్రవృత్తిలో భేదంకన్న సామ్యమే చాలా ఎక్కువ—లేకపోతే సైకాలజీ అనే శాస్త్రానికి స్థానమే లేదుగా!"

"అబద్ధం—సర్వాబద్ధం—ప్రేమ లేకపోతే ఇంతమంది దాని కోసం ఎందుకు పాకులాడుతారు?"

"అందరితో పాటేనని — విశ్వప్రయత్నం చెయ్యొచ్చు—కాని సాధించలేరు. యీ భూమి పుట్టాక ఎవరైనా సాధించారా? లోకచరిత్రనంతా తిరిచి చూసి చెప్పు. శ్రీరాముడు సీతను ఎంతగా ప్రేమించాడు—వారిది ఆదర్శప్రేమ అనిచెప్తారే! అట్లాంటి రాముడు నిండు గర్భవతిని—లోకాపవాదుకు వెరచి—హృదయాన్నీ, ఆత్మనూ చంపుకొని—సీతను అడవుల పాలు చెయ్యలా! అప్పుడేమైంది అతని ప్రేమ!—కవులంటారే—హృదయంతో ఆత్మతో ప్రేమించామని—వారికి చేతనౌతుందా అది!...అందమైన వస్తువుల్ని ప్రేమించగలరు...అంతేకాని, వాటి హృదయాల్నీ ఆత్మల్నీనా!...కథల్లో

చదివీ, సినిమాల్లో చూసీ, చెప్తూండగా వినీ—ప్రేమ వుందనే అపోహకుగురయ్యాను—నా జీవిత పరిమితి ఎంతో కాని ఆ అసలైన, నిసలైన ప్రేమ నాకు లభ్యపడలేదు. మనం ప్రేమను నిర్వచించలేకపోయినా—తెలీదా మన హృదయాలకు అది!..."

"మరి లేనిదానికి ఆ పేరెందు కొచ్చింది—?"

"ఇది వొక అయస్కాంతంలాగు ప్రజాబాహుళ్యం మీద పనిచేస్తుంది. దీంతో దాదాపు యువతీ యువకుల్నందర్నీ మోసంచేసి, వాళ్ళనొక గిరిలో ఉంచవచ్చు—శాంతికోసం మనం కనిపెట్టుకున్న పదాల్లో ఇదీ వొకటై వుండొచ్చు—" లేదా? ఇన్నాళ్ళూ మోసపొయ్యానా? ఒక్కసారి హృదయంలో తుపాను రేగింది. ఇల్లాంటి సమస్య నా బుల్లి బుర్రలో ఎప్పుడూ ప్రకాశించలేదు. ఇప్పుడు ఆలోచిస్తే—ఏమంది? నేను త్వరపడుతున్నానా? నా జీవితాన్నంతట్నీ వెనుక చూపుతో తరచి చూసుకుంటున్నా; నాకు తెలిసిన ఇతర జీవితాల్నీ కూడా వెదుకుతున్నా. ఆమెమీద ఈరాత్రి మొదటిభాగంలో వున్న కోపంలో చాలాభాగం సడలింది...

"ప్రేమ లేకపోతే జీవితాలు ఇంత అల్లకల్లోలంగాఎందుకుంటయ్?"

"ఇదంతా ప్రేమేనా? ఒక్క బాహ్య సౌందర్యాన్ని ప్రేమించటమేగా వీళ్ళకు చాతనయింది? ఐతే ఒక్క సౌందర్యవంతులు మాత్రమే దాన్ని అనుభవించగలరన్నమాట! ఆత్మల్నీ హృదయాల్నీ ప్రేమించగలవారెవరైనా ఎప్పుడైనా వున్నారా? వుంటారా? ఈ మానవులకు ఇది చాతనవుతే—ఎంతోమంది కురూపులకూ, అంగవైకల్యులకూ, నిర్భాగ్యులకూ, బీదవారికీ—అత్యున్నత స్థానాలు లభించి వుండవలసింది! దాంతోపాటు అనేకమంది భాగ్యవంతులకూ, సౌందర్యవంతులకూ—అధోగతి పట్టవలసింది!- జ్ఞాపకం తెచ్చుకో—ఆ మొదటినాడు నిన్ను కొట్టానే—ఆ ఒక్క దెబ్బతోనే పరుగెత్తిందా నీ ప్రేమ? నిజంగా ప్రేమిస్తున్నామనే వాళ్ళు దేహసౌఖ్యాన్ని కోరటం దేనికి? వాళ్ళ హృదయాల్ని, హృదయంతోనే ప్రేమిస్తూ—

ప్రేమించిన వస్తువును తాకకుండానే కాలం గడపరాదా? మనం భ్రమిస్తున్నాం. ఈరకం ప్రేమ ప్రతిరోజూ చాలాసార్లు వస్తూంటుంది. కాని యీ పదం జీవితానికి అవసరం; రక్షకులాగు అవసర సమయాల్లో అడ్డంపెట్టుకోవచ్చు—కాని దానికి లేని విలువను ఇచ్చి—భావ ప్రపంచంలో మాత్రమే దాన్ని చూసుకుంటూ మోసపోవటం దేనికి—?" గట్టిగా ఊపిరి పీలుస్తోంది. తీక్ష్ణంగా చూస్తోంది—'నీ ప్రశ్నలకు సమాధానం చెప్పగల సామర్థ్యత వుందిలే' అన్నట్టు! ఒక్కసారిగా నా మనస్సంతా పాడయింది! ఈ కొత్త సిద్ధాంతం నాలో పరివర్తన తెస్తోంది—కాని ఇంకా ఆలోచిస్తున్నా—

మళ్ళీ అందుకొంది. "చూడు రాజా! ప్రేమా—ప్రేమా అని అరుస్తూ నా చుట్టూ తిరిగే వీళ్ళల్లో ఎంతమంది నాకోసం తమ ప్రియమైన వస్తువుల్ని త్యాగం చెయ్యగలరు? ఇంట్లో భార్యలకు తెలీకుండా పగలంతా నా దయకోసం పాకులాడి, అనేకఆశల్ని పెడుతూ భావప్రపంచంలోని గాలిమేడల్ని చూసి ఆనందించుకుంటూ—చీకటి పడంగానే 'మళ్ళీ రేపు ప్రయత్నించవొచ్చులే—' అనుకొని భార్య పక్కన చేరటంలేదూ? పగటిపూట నామీదా, రాత్రి భార్యమీదా నా—వీళ్ళ ప్రేమ? వ్యభిచారానికీ దీనికీ తేడా యేమిటి?... స్థిరత్వం ఎక్కడుంది దీనికి? మనమే రోజురోజుకూ మారుతూంటే—మన సిద్ధాంతాలూ, ప్రేమలూ, నీతులూ మారటం అబ్బురమా? లేని దానికోసం గుడ్డివాళ్ళలాగు యీ గాఢాంధకారంలో తడుములాడుతే ఏం దొరుకుతుంది?—"

"మరి ప్రేమకూ, కామానికీ తేడాలేదా?" అన్నా నాకున్న కొద్ది అనుభవంతో.

"బతికి ఉన్నంతకాలమూ—హృదయాన్ని దేహంనుంచి విడతీసుకోలేముగా! కామం ఒకరిమీదా—ప్రేమ ఒకరిమీదానా? ఇది సంభవమేనా? ప్రేమకు ఎంత విలువ ఇస్తున్నా కామానికి దానికీ చాలా దగ్గరి చుట్టరికం—ఏమైనా వుంటే—ఆ ప్రేమకూ, కామానికీ మధ్యగా

వుండేది ఉండి వుంటుంది—ఆపదం ఏభాషలోనూ ఇంతవరకూ పుట్ట లేదు—"

"ప్రేమించుకొన్న ఇద్దరు—విఫల మనోరథాల్తో ఆత్మహత్యలు చేసుకున్నారనుకో—వాళ్ళ ప్రాణత్యాగానికి ప్రేమేగా కారణం!" ఎల్లాగైనా నా పంతం నెగ్గించుకోవాలని చూస్తున్నా.

నవ్వింది—నా అమాయకత్వానికి కాబోలు! "ఐతే వాళ్ళు దాన్ని అనుభవించారా! వాళ్ళది చేతకానితనం—బతికి సాధించలేనిదాన్ని చచ్చి ఏం సాధిస్తారు! పోనీ సాధించారనుకో—ఎక్కడ? పరలోకాల్లోనా? ఎల్లాగైనా యీలోకంలో సాధించలేకపోయ్యారుగా! మరి ఆ ప్రేమ యీలోకంలో వుందని ఎల్లా అంటున్నావ్? జీవితంలో వచ్చే అనేక అవాంతరాలవల్ల ప్రేమిద్దామని ఐయలుదేరినా సాగదు—"

కళ్ళు రెండూ మూసుకొని దీర్ఘాలోచనలో పడ్డా—లేదు—ప్రేమ లేదు! నాకు జ్ఞానోదయమైంది. నాలాటి జీవితానికి వంద జీవితాల పరిమితి వున్నా దీన్ని సాధించలేను; జీవితమధ్యంలో వచ్చి—జీవిత మధ్యంలో పొయ్యే యీ ప్రేమకు ఎందుకో ఇంత విలువనిస్తూ వచ్చింది! ఆమె చెప్పిన ప్రతిఅక్షరమూ నన్ను నిలవదీసి ప్రశ్నిస్తూనే వుంది. ఇన్నాళ్లూ భ్రమించి జీవితానికి ప్రేమకూ లేని సంబంధాన్ని కల్పించుకొని- ప్రేమ అనే సాకుమీద జీవితంలో ఎన్ని విలువైన క్షణాల్ని పాడుచేసుకున్నాను! గడిచిన క్షణాలు కొరగాకుండా పొయ్యాయ్. ప్రేమకు వన్నెచిన్నెలు కల్పించి రాసినకథలన్నింటినీ—ఇంటికి వెళ్లగానే, అగ్నిహోత్రుడిద్వారా— పోస్టేజీ లేకుండానే ఆ దేవతలకు పంపుతే ఉపయోగ పడతయ్యేమో ననిపిస్తోంది. ఇన్నాళ్లూ నాకు తెలీని యీపాఠాన్ని ఆమె ఎల్లా నేర్పింది! ఒక ప్పుడు కాదు—ఇప్పుడు కూడా కనకం— నా జీవితనౌక చుక్కానిని సరిగ్గా తిప్పింది; లేకుంటే ఇంకా ముందది- యీలోక సముద్రంలోని తుపానుల్లో వలిగి, సాగరగర్భితమైన మహోన్నత పర్వతాలకు ఢీకొని

పటాపంచలయ్యేదేమో! తమోబంధిత జీవితమార్గాన్ని తన హృదయ కాంతితో సరిచేసి పెడుతోంది—జీవిత దేవత!

కొంతసేపటికి తెప్పరిల్లి, "కనకం!" అన్నా పొడి గొంతుకతో. పైకి చూసింది—చెదిరిన శిరోజాల్ని పైకి తోసుకుంటూ. "ఇది వ్యభిచారం కాదా! నీకు మధువుండగా నేనెందుకు కావాల్సి వచ్చాను! ఒక్క వరలో రెండు కత్తులా!..."

"నేనుండగా నీభార్యెందుకు? నీభార్యవుండగా నేనెందుకు! ఒక్క వరలో రెండు కత్తులూ ఒక్కసారిగా పట్టవేమో! మానవ ఆనందంకోసం ప్రయత్నించటం—మానవుడి జన్మహక్కు; సహజ గుణం! దాన్ని అనేక కారణాలకు లోబడి చంపుకుంటాం—నీతితో నువ్వు నిలబడ్డ కొమ్మను నరుక్కోవటం దేనికి?...దీన్ని ఏమన్నా అను; నన్ను ఏమన్నా అను...కాని నేను కోరిన ఆనందానికి నీతి గీతి అడ్డంరావు- నాకు ఆత్మ స్వాతంత్ర్యంవుంది. నా సౌఖ్యానికి మధూ—మధు సౌఖ్యానికి నేనూ అడ్డంరాము... మేము యీలోకానికి పనికి రానివాళ్ళమే కావొచ్చు—యీ పరిణామం మాత్రం మనకు మరిరెండు శతాబ్దాలకు వస్తుందేమో!"

"మీరు రష్యాలో వుండాల్సినవాళ్లు—అక్కడైతే మీకు బ్రహ్మరథం పడతారు. ఇప్పుడు నేను ఇండియాలో రష్యాను చూస్తున్నాను —మీ రిద్దరూ వివాహం చేసుకోమని సలహాకూడా ఇస్తాను—" పరిహాసం చేస్తున్నానని నాకు తెలుసు!

"వివాహమా! ఇందాక నవ్వానలా! నేను నీభార్యనైతే చిత్రవధ చేస్తావా! ఎవరు నీకా అధికారాన్నిచ్చింది? మంత్రాలు చదివి నీకీ హక్కు ఇచ్చారుకదూ! అందుకనే నేను పెళ్ళి వొద్దంటాను." నేనేమీ మాట్లాడలేదు—గడియారం రెండు గంటలు కొట్టింది. నాల్గు గంటల్లో నన్ను మానవ వ్యక్తిగా తయారుచేసిన కనకంలో ఏశక్తి వుందో—నా కిప్పటికీ తెలీదు.

చంద్రుడు తెల్లని కాంతితో పరుగెత్తుతున్నాడు. తెల్లవారు

జామున ఏచేచలిగాలి ఆరంభమైంది. ఆమె కళ్ళల్లోకి చూశా. ఆమాయ
కపు కన్నుల్లో సీలింగ్ లైటూ, చంద్రుడూ ప్రతిఫలిస్తున్నారు. కొన్ని
కేలమందికి అలభ్యమై, అసాధారణమైన ఆశల్ని పెడుతూన్న యీ
భూలోక రంభను ఇంతసేపూ మరిచిపోయ్యాను కాబోలు!

"ఎక్కడ సంపాయించావ్—ఇంత అందాన్ని ?"

"నీకోసం—కొనితెచ్చుకున్నా"—తెల్లని పలువరుసకాంతి బైటి
వెన్నెల రూపుదాల్చింది.

"నాకోసమా ?" అన్నా.

"ఆ చంద్రుడూ, యీ ప్రకృతీ, నేనూ—ఇప్పుడు నీ కోసమే—
ముందేమౌతుందో కాని—"

ఎడమ అరచేతిలో చిన్న తలనుమోపి పడుకొని నాకళ్ళల్లోకి
చూస్తోంది—మాట్లాడి అలసిన ఆమెచిన్నినోరూ, చిరుపెదవులూ నన్ను
ఆహ్వానిస్తున్నయ్. "బొమ్మలో శకుంతలలాగున్నావ్—"

"శకుంతల పక్కన చెలికత్తె—కాని, యీ శకుంతల పక్కన—
దుష్యంతుడూను—" ఆమె మాస్తాల్లో నాకు తెల్లవారింది కూడా తెలి
యలేదు.

# 25

ఏమీ తోచక వరండాలో పచార్లు చేస్తున్నా. బైట ఎవరో నన్ను
పేరు పెట్టి పిలిచారు. ఎప్పుడో ఎక్కడో విన్నకంఠం అది—సరిగ్గా
గుర్తురాలేదు. బైటికొచ్చి చూశా—ఎవరూ ? మధే ! ఇక్కడి కెందు
కొచ్చాడు ? ఎంత మారిపొయ్యాడు ! ఎప్పుడూ ప్రసన్నతతో నవ్వు
తూండే అతని ముఖం—విషాద ఛాయల్తో నిండివుంది. కాంతిని ప్రస
రింపజేసే అతని విశాల నయనాల్లో-ఏమిటా దీనత్వం ! అతని శరీరమే
నలిగిపోయింది. ఆరు వసంతాల్లోనే ఇంత మార్పా ? నాకు తెలీకుం
డా నేనుకూడా మారిపొయ్యానా ? కాలచక్రానికి ఇంత మత్తవార

కర్తా! ఆశ్చర్యంతో చూస్తూ నిలబడ్డా.

నా కళ్ళల్లోకి చూస్తూ ఆతురతతో, "ఏమండీ గుర్తుపట్టలేదా!" అన్నాడు...నవ్వు: "బాగా మారిపోయ్యారు; రండి-లోపలికి_" తీసుకొచ్చి కుర్చీలో కూర్చోబెట్టా. ఆనాడు అతను నాకు శ్రీ నగరం లో చేసిన సత్కారమంతా జ్ఞాపకమొస్తోంది.

"మీతో అత్యవసరమైన పనివుంది. చెప్పలేను-వినా యీ కఠిన పదాల్ని తప్పనిసరిగా చెప్పి తీరాలి. కనకానికి వ్రణంలేచింది. ఎల్లుండి ఆపరేషన్ చెయ్యాలన్నారు. ఆపరేషన్ ఒద్దని గోలపెడుతోంది. చివరకు_మిమ్మల్ని తీసుకొస్తేనేగాని, చేయించుకోనని కూర్చుంది. మీరు తప్పకుండా రావాలి—చాలా ప్రమాదావస్థ_" యీ కనకానికేనా—కత్తికోత! ఆపరేషన్ టేబిలూ, మొండి గుండెలో_మత్తుగా పడివున్న రోగిని పరపరా కొయ్యటమూ_బాధను అనుభవించలేని రోగీ_ఆ రక్తమూ_అంతా కళ్ళకు కట్టినట్టవుతోంది!

"అంత అవసరమా—నేను!" అన్నా. నా చేతుల్ని పట్టుకొని అతనన్నాడు; "ఇవ్వే కాళ్ళనుకోండి. రాండి_ఆమె కన్నీటిని నేను ఒంటరిగా చూడలేకుండా వున్నాను. మన రెండు కత్తులమధ్యా ఆమె నరకబడకుండా మాత్రం చూడండి_మీకు తెలీటంలేదా—నా ఆర్తి!" కనకం కోసం యీమాత్రం త్యాగం చెయ్యగల సామర్థ్యత నాకు లేక పోలేదు. ప్రక్కనే వెలలు. ఇంటిదగ్గరుండి నేను మాత్రం చేసేదేమిటి! ఆమెను ఆడగాల్సిన అవసరం కూడా లేదు.

"వెళ్దామా!" తలవూపా.

"ఈ మెయిలుకే ఎక్కుదాం. మీకు ఏం లేక పోయినా ఫర్వాలేదు. డబ్బువుంటే_సగం సమస్యలు తీరుతయ్యనే మాట మరువకండి_" అని హెచ్చరించాడు. ఇంట్లో పరాయి గ్రామానికని సాకుచెప్పి బయలుదేరా. దారిపొడుగూనా కనకం సంగతే చెప్తున్నాడు. కనకం బాధ మధులో తేగలిగిన పరిణామాన్ని చూసి_కనకం స్థితి నా బుద్ధికి తోచినంత వరకూ ఊహించుకొని_ఆమెకు సానుభూతిని చూపుతున్నా

నా జ్వరంలో నాకెంత సేవచేసింది? గడచిన ఆరోజులు తిరిగి జ్ఞాపకం వచ్చి బరువైన హృదయంతో ప్రయాణాన్ని సాగించాం.

# 26

"వొచ్చావా రాజా! ఇంక నాకు భయం లేదు. ఈలోకం లోంచి విరమించటానిక్కూడా జంకను! నా శ్రేయస్సు కోరే మానవులిద్దరూ—మీరుండగా నాకేం భయం? రాజా! ఇట్లారా—ఇక్కడ కూర్చో—" పక్కనే కూర్చున్నా. ఏమిటి అమాయకపు ఆనందం! మేము పదిమందిమి వున్నా ఆమెకేం సహాయం చెయ్యగలమో? ఆ బాధనా పంచుకో లేము. ఆమె మరువగలదా ఆబాధను! ఐనా ఏదో తృప్తి—అర్థంకాదది. ఎంత మారిపోయింది! పక్కటెముకలు లెక్కించేందుకు వీలుగా బక్కచిక్కిన శరీరంలో ముఖ కళలో, కళ్ళల్లో, చిరుపెదవుల్లో, తెల్లని పలువరుసలో, తీర్చి దిద్దిన కనురెప్పల్లో—అంతటా మార్పే! గుంటలుపడ్డ కళ్ళల్లోంచి చూసే జాలి చూపులో—ఆ కొంటెతనం లేదు! పట్టు బలవంతాన కటికవాని దగ్గరకు లాక్కుపోతూంటే—ఆవు చూసే చూపులవి! ఆమె సర్వస్వాన్నీ హరించి—ఆమె నొక జీవచ్ఛవంగా ఇక్కడ విసిరి పారేసింది కాబోలు—కాలచక్రం! ఎంతెంతవారికి ఎంతెంత దుర్గతి!

"ఇదా నీ స్థితి—కనకం!" అన్నా.

నవ్వింది—నిర్లక్ష్యంగా! "నా స్థితేమిటి? ప్రతి మానవుడికీ ఎప్పుడో వొకప్పుడు యీ స్థితి రాదా——రాజా! ఎప్పుడూ యవ్వనమే నిలబడి వుంటుందా?...ఎన్నేళ్లయింది నిన్ను చూసి! ప్రాణం లేచి వొచ్చినట్టుంది; నా రాజా! నువ్వెంత మారావయ్యా! ...మీలాటివాళ్ళు నా పక్కన వుంటేనే చాలు! పిచ్చివాన్నలు——ఇద్దరూ—ఇద్దరే! కళ్ళనీళ్లు పెడతారు దేనికి? నేనుపోతే—మీ కళ్ళనీళ్లెవరు తుడుస్తారు? చాలు—యీ విశ్వాసానికి నా ఆత్మ ఆనం

దిస్తుంది—" ఆయాసంతో ఊపిరి గట్టిగా పీలుస్తోంది.

"ఇద్దరూ ఇలాగే—ఇక్కడే కూర్చోండి—నేను నిద్రపొయ్యేదాకా—ఇద్దర్నీ చూసి కళ్ళు మూసుకుంది.

# 27

ఆపరేషనైతే ఐంది కాని, ఇంకా ఆమెకు స్మృతి రాలేదు. నేను చూస్తూన్న యీ పది రోజుల్లోనే దినదినమూ ఆమె క్షీణిస్తూనే వుంది. దిక్కుమొగాలు వేసుకొని, అతి ఆతురతతో—ఆమె స్మృతికోసం ఎదురుచూస్తూ—ఆమె మంచానికి ఇరుపక్కలా కూర్చున్నాం.

బరువైన కనురెప్పల్ని తోసుకుంటూ—ఆమె కన్నులు బైటికొచ్చాయ్—బాధతో కాబోలు మొఖం చిట్లించింది. డాక్టర్ వచ్చి పరీక్షించి—మా ఇద్దర్నీ అవతలికి పిలిచి అన్నాడు: "రోగి చాలా అపాయస్థితిలో వుంది. ఎక్కువ మాట్లాడి శ్రమ కల్పించకండి. టెంపరేచర్ సరిగ్గాలేదు. పల్స్ కూడా పడిపోతోంది......" కళ్ళనీళ్ళు పెడుతూ డాక్టర్ చేతుల్ని పట్టుకొని,

"మీరు ఎంత కోరితే అంత ఇస్తాను—మీకు చేతనైనంతవరకూ ఆమెకు తగిన చికిత్స చెయ్యండి—" అన్నాడు మధు.

డాక్టర్ మునిపళ్ళతో పెదవి విరిచి, "ప్రయత్నిస్తాను—" అన్నాడు. మళ్ళీ ఇద్దరమూ వచ్చి రోగి పక్కన చేరాం.

డాక్టర్ వొంచి, "ఆకలవుతోందా!" అన్నాడు.

ఆమె తలవూగించింది. "బత్తాయి వొలిచి ఇవ్వండి—ఈ పక్క గదిలోనే వుంటాను—అవసరమైతే పిలవండి—" అని డాక్టర్ మెల్లిగా జారుకొన్నాడు. వొలిచిచ్చిన తొనల్ని తింటోంది—కాని, ఆమె ముఖంలో ఏదో భయంకర పిశాచం తాండవిస్తోంది. ఆరిపొయ్యే దీపంలాగు—కళ్ళు క్షణ క్షణానికి కాంతిని కోల్పోతున్నాయ్. గంట గడిచాక, ఇద్దరి చేతుల్ని పట్టుకొంది. ఆ స్పర్శలో ఎంత

గాఢత వుంది. బళ్ళో మాస్టారి భయంచేత వెళ్ళేందుకు ఇష్టంలేని కుర్ర వాడు తల్లి కొంగు పట్టుకొని వేళ్ళాడినట్టుంది. "మధూ!" అంది— దీనమైన స్వరంతో. ఆమె శరీరానికి ఆమెను భరించే శక్తి పోయింది కాబోలు! "ఆ" అన్నాడు పొడి గొంతుకతో.

"నాకు బతుకుతానని ఆశలేదు. ఈ డాక్టర్లు మందులిచ్చేవాళ్ళేగా! —నన్ను మరిచిపొయ్యేందుకు ప్రయత్నించు. నా జీవితంకోసం నీజీవితం నాశనం చేసుకోబోక— నేనీలోకంలో అనుభవించాల్సిన కష్టాల్నీ సుఖాల్నీ కూడా అనుభవించాను. ఇంకనాకు యీలోకంతో పనిలేదని పిస్తోంది. ఆ మృత్యు ముఖంలో శాంతి వుందని నమ్ముతున్నా. పిచ్చివాడులాగు అయిపొయ్యావ్ ...నాకు ఒక్కటే కోరిక వుండేది —యీలోకంలో స్త్రీకి జన్మహక్కైన మాతృత్వాన్ని మాత్రం అనుభవించలేకపొయ్యాను. ప్రతి స్త్రీ కోరేది ఇదేనేమో! పోనీలే—ఎంతవరకూ ప్రాప్తమో—అంతవరకే అనుభవించాను—" ఆయాసంతో తిరిగి నిరాశతో నిట్టూర్చింది. మధు కంటివెంట ఏకధారగా నీరు కారుతోంది.

"రాజా!" అంది. ఆమెవైపు చూశా.

"ఒకప్పుడు అనుకున్నాను—దిక్కులేని చావు చస్తానేమోనని. కాని మీరున్నారు...నాకు అదే తృప్తి—నా జీవితాన్ని పాతికవేలకూపాయలకు భీమా చేశాను—నేను పోంగానే ఆడబ్బు నీకు వస్తుంది—మాఊళ్ళోని మాయిల్లు తిరిగి కొనెయ్. ఆ ఇంటిమీదా, నేను పెంచిన తోటమీదా—నా మనసు తీరలేదు. ఆ ఇంట్లో నువ్వుండు—ఊళ్ళో ఒక లైబ్రరీకూడా కట్టించు—రాజా! నా జీవితమంతా ఒక్కసారి కళ్ళకు కట్టినట్టవుతోంది...పొయ్యేనాడుకూడా మరిచిపోలేం కదా—దాన్ని!" ఆగింది; కాని, ఊపిరి ఎగతంతూన్నట్టు అధికంగా ఆయాసపడుతూ, జాలిగా, బాధగా మావైపు చూసింది. కాని మేమేం చెయ్యగలం! చేతకాని తనంతో కూడుకొన్న దుఃఖానికి గురయ్యాం —అంపశయ్యమీది భీష్ముడు జ్ఞాపకాని కొస్తున్నాడు—

మళ్ళీ కళ్ళు తెరిచింది—స్పష్టంగాలేని మాటల్లో అంటోంది; "తెలిసో... తెలియకో... ఏమైనా తప్పులు... చేసివుంటే... ఇద్దరూ నన్ను క్షమిం...చండి —" నమస్కరించింది. భక్తా! విశ్వాసమా! కృతజ్ఞతా!

సూర్యుడు అస్తమించాడు; గడియారం అనుగంటల్ని లెక్కపెట్టుకుంటూ కొడుతోంది—ఆ గంటల్ని వినటం—ఆమెకు అదే తుది సారి! ఆ నిర్జీవపు శరీరాన్ని, తోలు తిత్తినీ, బొమికల గూడునూ మాకు వదిలి—ఆమె ప్రాణి మాకు కన్పించకుండానే ఎగిరిపోయింది! ఆమె ఆకృతిని చూడగలిగే తుది క్షణాలవి!

# 28

"చూడండి—యీ పత్రికలన్నీ ఆమె ఫోటోనువేసి—పొగడుతూ ఎల్లా రాశాయో! ఇవన్నీ చూసి ఎవరు సంతోషపడతారు? ఎన్ని చేసినా ఆమె మళ్ళీ మనకు కన్పించదుగా! ఆమెకోసం సానుభూతిగా కార్చే కన్నీరుకూడా ఎవరికీ కాకుండా భూమిలో పడి ఇంకిపోవాల్సిందే! ఈ ఇల్లు చూడండి—స్మశానవాటికలాగు ఎంత కళాహీనంగా వుందో! ఇదుగో—ఆమె డైరీ—ఏమేమో రాసుకొంది!—ఆమె తనకుగాను కొనుక్కున్న యీ సామాన్లు ఎవరిక్కావాలిప్పుడు? ఆమె యీ లోకంలో లేకపోయినా—ఆమె నటనా, కంఠస్వరాన్నీ మాత్రం శాశ్వతంగా ఉండేట్టు శాస్త్రకారులు సెల్యులాయిడ్ మీద ముద్రించుకొన్నారు; ఎంత బతుకు బతికింది! మనం మాత్రం ఎందుకూ కాకుండా నిల్చిపోయ్యాం..." హృదయవేదనను విప్పి చెప్పుకుంటున్నాడు. నేను అనుకుంటే వాకన్న అనేక రెట్లు కృంగిపోతున్నాడు.

"మీరు అధికంగా కలవరపడుతున్నారు. ఇది శాశ్వతవియోగమే అయినా భరించి తీరాలి. చచ్చినవాళ్ళు బాగానే వుంటారు; కాని, ఆ చావంతా బతికున్నవాళ్లదే అవుతుంది. వూరుకోండి...ఆమె వస్తు

గాఢత వుంది. బళ్ళో మాష్టారి భయంచేత వెళ్ళేందుకు ఇష్టంలేని కుర్రవాడు తల్లి కొంగు పట్టుకొని వేళ్ళాడినట్టుంది. "మధూ!" అంది— బలహీనమైన స్వరంతో. ఆమె శరీరానికి ఆమెను భరించే శక్తి పోతోంది కాబోలు! "ఆ" అన్నాడు పొడి గొంతుకతో.

"నాకు బతుకుతానని ఆశలేదు. ఈ డాక్టర్లు మందులిచ్చేవాళ్ళేగా! —నన్ను మరిచిపొయ్యేందుకు ప్రయత్నించు. నా జీవితంకోసం నీజీవితం నాశనం చేసుకోబోక—నేనీలోకంలో అనుభవించాల్సిన కష్టాల్ని సుఖాల్నికూడా అనుభవించాను. ఇంకనాకు యీలోకంతో పనిలేదనిపిస్తోంది. ఆ మృత్యు ముఖంలో శాంతి వుందని నమ్ముతున్నా. ఒక్క పిచ్చివాడులాగు అయిపొయ్యేవ్...నాకు ఒక్కటే కోరిక వుండేది —యీలోకంలో స్త్రీకి జన్మహక్కైన మాతృత్వాన్ని మాత్రం అనుభవించలేకపొయ్యాను. ప్రతి స్త్రీ కోరేది ఇదేనేమో! పోనీలే—ఎంతవరకూ ప్రాప్తమో—అంతవరకే అనుభవించాను—" ఆయాసంతో ఆగి నిరాశతో నిట్టూర్చింది. మధు కంటివెంట ఏకధారగా నీరు కారుతోంది.

"రాజా!" అంది. ఆమెవైపు చూశా.

"ఒకప్పుడు అనుకున్నాను—దిక్కులేని చావు చస్తానేమోనని. కాని మీరున్నారు...నాకు అదే తృప్తి—నా జీవితాన్ని పాతికవేల రూపాయలకు భీమా చేశాను—నేను పోంగానే ఆడబ్బు నీకు వస్తుంది— మాఊళ్ళోని మాయిల్లు తిరిగి కొనెయ్. ఆ ఇంటిమీదా, నేను పెంచిన తోటమీదా—నా మనసు తీరలేదు. ఆ ఇంట్లో నువ్వుండు—ఊళ్ళో ఒక లైబ్రరీకూడా కట్టించు—రాజా! గత జీవితమంతా ఒక్కసారి కళ్ళకు కట్టినట్టవుతోంది...పొయ్యేనాడుకూడా మరిచిపోలేం కదా— దాన్ని!" ఆగింది; కాని, ఊపిరి ఎగతంతూన్నట్టు అధికంగా ఆయాసపడుతూ, జాలిగా, బాధగా మావైపు చూసింది. కాని మేమేం చెయ్యగలం! చేతకాని తనంతో కూడుకొన్న దుఃఖానికి గురయ్యాం —అంపశయ్యమీది భీష్ముడు జ్ఞాపకాని కొస్తున్నాడు—

మళ్ళీ కళ్ళు తెరిచింది—స్పష్టంగాలేని మాటల్లో అంటోంది; "తెలిసో... తెలియకో... ఏమైనా తప్పులు... చేసివుంటే... ఇద్దరూ నన్ను క్షమిం...చండి —" నమస్కరించింది. భక్తా! విశ్వాసమా! కృతజ్ఞతా!

సూర్యుడు అస్తమించాడు; గడియారం అనుగంటల్ని లెక్కపెట్టుకుంటూ కొడుతోంది—ఆ గంటల్ని వినటం—ఆమెకు అదే తుది సారి! ఆ నిర్జీవపు శరీరాన్ని, తోలు తిత్తినీ, బొమికల గూడునూ మాకు వదిలి—ఆమె ప్రాణి మాకు కన్పించకుండానే ఎగిరిపోయింది! ఆమె ఆకృతిని చూడగలిగే తుది క్షణాలవి!

# 28

"చూడండి—యీ పత్రికలన్నీ ఆమె ఫొటోనువేసి—పొగడుతూ ఎల్లా రాశాయో! ఇవన్నీ చూసి ఎవరు సంతోషపడతారు! ఎన్ని చేసినా ఆమె మళ్ళీ మనకు కన్పించదుగా! ఆమెకొరకై సానుభూతిగా కార్చే కన్నీరుకూడా ఎవరికీ కాకుండా భూమిలో పడి ఇంకిపోవాల్సిందే! ఈ ఇల్లు చూడండి—స్మశానవాటికలాగు ఎంత కళాహీనంగా వుందో! ఇదుగో—ఆమె డైరీ—ఏమేమో రాసుకొంది!—ఆమె తనకుగాను కొనుక్కున్న యీ సామాన్లు ఎవరికి కావాలిప్పుడు! ఆమె యీ లోకంలో లేకపోయినా—ఆమె నటననూ, కంఠస్వరాన్నీ మాత్రం శాశ్వతంగా ఉండేట్టు శాస్త్రకారులు సెల్యులాయిడ్ మీద ముద్రించుకొన్నారు; ఎంత బతుకు బతికింది! మనం మాత్రం ఎందుకూ కాకుండా నిల్చి పోయ్యాం..." హృదయవేదనను విప్పి చెప్పుకుంటున్నాడు. నేనే అనుకుంటే నాకన్న అనేకరెట్లు కృంగిపోతున్నాడు.

"మీరు అధికంగా కలవరపడుతున్నారు. ఇది శాశ్వతవియోగమే అయినా భరించి తీరాలి. చచ్చినవాళ్ళు బాగానే వుంటారు; కాని, ఆ చావంతా బతికున్నవాళ్ళదే అవుతుంది. వూరుకోండి...ఆమె వస్తు

వుల్ని చూస్తూన్నప్పుడల్లా పట్టరాని దుఃఖం వస్తుంది. కాని మనం పురుషులం—కన్నీటిని కనురెప్పల్లోనే ఆపేసేందుకు ప్రయత్నించాలి.'

గడియారం ఒంటిగంట కొట్టింది.

ఏమో ఆలోచించి, "మీరు నాతో వస్తారా!" అన్నాడు.

"ఎక్కడికి ?"

"ఆమె సమాధి దగ్గరకు—"

"ఈ అర్ధరాత్రి అక్కడి కెందుకూ !"

"అక్కడ కొంతసేపు కూర్చుందాం—మనశ్శాంతి వుంటుందేమో!"

ఏమిటో యీ ప్రభువులు, ఎంత దీనంగా అడుగుతున్నాడు! నా హృదయాన్ని ద్రవీభూతం చెయ్యగల భాషను నేర్చుకున్నాడు! ఒక్క ఆప్తురాలి మృత్యువే జీవితాన్ని తారుమారు చెయ్యగలిగింది!

"నరే పదండి—" మౌనంతో—మా కాళ్ళ చప్పుడును మేమే వింటూ మెల్లిగా నడవ నారంభించాము.

అతి ప్రశాంత వైరాగ్య స్మశానవాటిక. ఈ సమాధుల్లో ఎంత మంది రాజుల శరీరాలు భూస్థాపిత మయ్యాయో ! ఎంతమంది దేశ సేవకుల దేహాలు యీ మట్టిలో కలిసిపొయ్యాయో! అన్నివైపులా సమాధులు! ఒట్టి సమాధుల మధ్య నిలబడ్డాం—భోగులైనా, రోగులైనా—మృత్యుదేవత సమాన కరుణనుచూపి ఇక్కడకు తీసుకుంటుంది కాబోలు ! దేశాన్ని, ప్రజల్ని ఉర్రూతలూగించిన మహావ్యక్తులు కిక్కురుమనకుండా నిశ్శబ్దదేవతను ఆరాధిస్తూ శాశ్వత నిద్రలో నిమగ్నమయ్యారు!

అక్కడ పడివున్న ఆ కపాలాల్నైనా మనం ఒకప్పుడు ప్రేమించి, ఆరాధించింది ! ఈ పుర్రె—అన్నీ బొక్కలు!...దీని వికృతాకారాన్ని కప్పిపుచ్చే మాంసమూ, చర్మమూ ఉంటేనేకాని చాతకాదు—ప్రేమించటం ! ఎక్కడి మానవుడు—ఎక్కడి బొమికలగూడు ! ప్రాణంతోపాటే పోయింది కాబోలు—ఏటికా విలువ ? ఎన్నివేల చరిత్రలు యీ భూగర్భంలో దాగివున్నవో ? ఈ వాటిక యీ

లోకంలోనే వినా—యీ అశాంతిమయ ప్రపంచానికీ—ఈ శాంతి మయ లోకానికీ ఎక్కడి పోలిక ?

చంద్రుడు వెలవెల పోతున్నాడు. చెట్లు చల్లగాలికి మెల్లిగా తిలలాపుతున్నాయ్—ఎందుకీ మృతదేహాలకు చల్లగాలి ! దూరాన నక్కలు అరుస్తున్నయ్. నిశ్శబ్దతను చీల్చుతూ ఏదో సమాధిమీద కూర్చొని సన్నని గొంతుతో గుడ్లగూబ అరుస్తోంది.

మెల్లిమెల్లిగా చీకట్లు కమ్ముకుంటున్నయ్. ఆకాశంలోంచి ఒక్కొక్క నక్షత్రమే కన్ను మూసుకున్నా కన్పించని చీకటిలోకి తొంగితొంగి చూస్తోంది. ఆమె సమాధిమీద కూర్చొని లోలోపల విలపిస్తున్నాం. ఎవరికోసం ? ఎందుకు ! ఏమిటీపిచ్చి ! ఒకనాటికి మనమైనా ఇంతేనేమో ! మనకోసం ఎవరేడుస్తారో ! నాకళ్ళముందే ఎంతెంతమంది—సాగిపోతున్నారు !

ఉన్నట్టుండి, మధు, "చూడండి—చూడండి—" అనిచెయ్యెత్తి ఆ మైదానంవేపూ—ఆ పెద్దచెరువువేపూ చూపుతున్నాడు. ఏముందీ!

"ఏమిటీ?" అన్నా.

"కనపటంలా?—అదుగో—కనకం !"

కనకం ! ఎక్కడ? నా కళ్ళముందేగా ఆమె నిగతజీవిఅయింది! మేమిద్దరమూ కలిసి ఈ ఉదయాన్నేగా ఆమె సుకుమార గాత్రం మీద, కాలితో తొక్కి మలినం చేసిన మట్టిని పోసింది! ఈ సమాధినీ, సిమెంటురాళ్ళ కట్టడాన్నీ చీల్చుకొని—యీగోతిలోంచి లేచి వచ్చిందా ? చచ్చినవాళ్ళు—ఎక్కడనా, ఎప్పుడనా ఎందుకనా—బతుకుతారా ? నేను ఎక్కడా ఇది సంభవమైనట్టు విన నైనాలేదే ! దయ్యాలా ? భూతాలా ? కలా ? నిజమా ? భ్రమిస్తున్నానా ? బతికే వున్నానా? నన్ను నేను గిల్లుకున్నా—బాధగానే వుంది—బతికే వున్నా !

"భ్రమ—మధూ ! భ్రమ...ఇంటికి వెళ్దాం—పా—"

వికటంగా నవ్వాడు—"ఇంటికా ? ఏముందీ—ఆ ఇంట్లో?

ఆమె నా జీవితాన్ని తనతో తీసుకుపోయింది!...చూడండి—అదుగో—ఎల్లా పిలుస్తోందో! చిక్కిపోయింది! ఆ కమనీయ హస్తాన్ని ఎత్తి గాలిని తోసేస్తూ రమ్మని పిలుస్తూంది. మాట్లాడేందుకు ఆమె పెదవులు కదలవు కాబోలు!—రాండి—వెళ్దాం...నా కనకం! ఉదయాంనుంచీ బతికే వుందనుకుంటున్నా. ఆమె మృతిని కలగా కూడా భావించా...కాని భ్రమకాదు—నాది...రాండి...పాపం—ఆ చలిలో, మంచులో ఎంతసేపు నిలబడుతుంది? ఆమెకు విసుగుపుట్టదూ? రారూ?...రారూ?..."

హామ్లెట్ నాటకమా? దయ్యమా? కళ్ళు నలుపుకున్నా—గట్టిగా మూసుకున్నా—సాధ్యమైనంతవరకూ తెరిచి చూశా......ఏముందా శూన్యంలో? చుట్టూవున్న చీకట్లో అతనికేం కన్పిస్తోంది? మూడో మనిషైనా వుంటే ఎవరు భ్రమిస్తోందీ తెలుస్తుందేమో! నా చెయ్యి పట్టుకున్నాడు! దేనికీ ఆతృత? నన్ను ఎక్కడకు లాక్కు వెళ్తాడు?

"మధూ!...మధూ!...ఏమయ్యా—భ్రమిస్తున్నావ్? ఇంటికి వెళ్దాం—నీ నీడను చూసి నువ్వే భ్రమపడుతున్నావ్—రా—నాకోసం రా—" వెనక్కు లాగుతూన్న నా చేతిని విసిరికొట్టాడు.

"నన్ను పోనీ—నీకు ధైర్యం లేకపోతే నువ్వు రాబోకు. కనపట్టంలా? పాపం—నిన్నటికన్నా, మొన్నటికన్నా నీరసంగా వున్నా—మనకోసం ఇక్కడికి పరుగెత్తుకొచ్చింది. చూడు...చూడు...ఇంకా చెయ్యివూపుతోంది...వస్తా...కనకం! వస్తా...నన్ను నీతోకూడా తీసుకువెళ్తావుకదూ? నిలబడలేవ్? ఎంతసేపు చూస్తావ్ పాపం? నీకోసం కాదా—నేను బతికింది? ఎగిరి ముఖంమీద పడుతూన్న నీ ముంగురుల్ని పైకి తోసేందుకు ఎవరూ లేరని చూస్తున్నావా...!..." ముందుకు సాగిపోతున్నాడు. నాకు తల తిరిగిపోతోంది. నా శరీరంలోని ప్రతి అవయవమూ వాటి పట్టును తప్పిపోతున్నాయ్. భూకంపం వస్తోందా—ఇల్లా కూలిపోతున్నాను?

ఏమిటిదంతా—నాటకం కాదుకదా! ఎందుటాకుల్ని తొక్కుకుంటూ—ఎక్కడికి యీ మధు వెళ్తోంది!

"మధూ...మధూ......వెళ్ళిపోతావా!—ఆ శూన్యంలోకి—మాసిపోతున్నావ్...ఆగు...ఆగవూ—నామాట వినవూ! ఇంటికి రావూ...! ఒద్దు...వెళ్ళొద్దు...మధూ!...మధూ!..." గొంతంతా చించుకుంటూ అరిచా. నామాటల్ని చిలకపలుకుల్లాగు ప్రకృతి పలుకుతోంది.

తూలిపోతూన్నా. ఏమౌతోందో—ఎక్కడున్నానో—అంతా అగమ్యగోచరంగా వుంది. నాముందు భయంకర తమోరాక్షసి నృత్యం మాత్రం కన్పిస్తోంది. ఈ స్మశానవాటిక గర్భానికి నేనుకూడా వెళ్ళి పోతున్నానా!...ఇదేనా నా అంత్యదశ! ఈ దిక్కులేని చావేనా—నాకు రాసింది? ఇదేనా మృత్యు ముఖంలోని బాధ! అనందం! అమాయకత్వం! అంతా చీకటి!!!

## 29

మూడు రోజులా హాస్పటల్లో గడిపాక కాని, నాకు స్వేచ్ఛ రాలేదు—అంతా మరిచిపోదామని ప్రయత్నిస్తూ ఇంటిముఖం పట్టా.

ఇంటికొచ్చాక— "ప్ర—భా!" అన్నా.

"పడుకోండి—చాలా నీరసంగా వున్నారు—"

"కనకం పోయింద—" సానుభూతిగా తల పంకించింది.

"ఇల్లా అయిపోయ్యా కేం! నువ్వు చిక్కిపోయ్యావ్—"

ఔనన్నట్టు తల ఊపింది.

పక్కగదిలోంచి బిడ్డ ఏడుపు విన్పిస్తోంది.

"ఏమిటది!"

"మీ కూతురు ఏడుస్తోంది—"

"నా నా...నా నా! చూపవూ!"

మెల్లిగా చెయ్యిపట్టుకొని పక్కగదిలోకి తీసుకెళ్ళింది. ఉయ్యాల్లో పడుకొని—రెండుకళ్ళనూ తెరచి ఇంటి వాసాల్ని లెక్కేస్తోంది! జపాన్ రబ్బర్ బొమ్మలాగు చిన్న ఆకృతి! ఏ రక్తంనుంచి తెచ్చుకుందో—ఆ పాదాల ఎరుపును? ఏ లేత అరటిఆకుల మృదుత్వాన్ని కౌగిలించిందో— యీ శరీర మృదుత్వంకోసం! ఏ నీలాలనుంచి తెచ్చుకుంది—యీ మెరిసే కళ్ళను! ఏ గాంధీగారి దగ్గర్నుంచి తెచ్చుకుంది—యీ బోసినోటినవ్వును!

ప్రభ ఇప్పుడు అనుభవిస్తున్న మాతృత్వానికేనా—యీ లోకంలో కనకం అనర్హురాలైంది! ఏదో ఆనందంతో హృదయం నిండిపోయింది!—ఎంతలో దుఃఖం! ఎంతలో ఆనందం! ఇదేనా లోకచరిత్ర!

“ప్రభా!” ఆమె మాట్లాడలేదు. చెమ్మగిలిన ఆమె కళ్లు ఆమె ఏదో బాధకు గురవుతున్నట్టు చెప్తున్నయ్.

“పాపం! ఆమె పోయిందా!...అమ్మాయికి ఆమె పేరు పెడదాం—” అంది. ఎంత సానుభూతి! బతికి వుండగా శత్రువులైన వ్యక్తులు—చచ్చాక మిత్రులౌతారు కాబోలు!

తల వూపా. “కనకం!...కనకం!—”అని బిడ్డను తాకాను— దానికి అన్నీ తెలిసినట్టూ—మాటలు తనకు అర్థమైనట్టూ—బోసి నోటితో జవాబు చెప్తోంది.

# 30

అద్దంలో చూసుకొన్నాను. తలవెంట్రుకలన్నీ నెరిసిపోతున్నై. దాదాపు అర్థశతాబ్దపు జీవితం గడిచిపోయింది. దేహంలో కండలు తక్కువ. అక్కడక్కడ నరాలూ, బొమికలుకూడా పైకి కన్పిస్తున్నయ్. నాకు తెలీకుండానే—తెలిసినా ఒక కలలాగు—ఎంత కాలం గడిచిపోయింది! ఎన్నెన్ని వింతలు సాగిపోయినై!

పది సంవత్సరాల క్రితం పోయిన కనకాన్నిగూర్చి ఇప్పుడు విచారంలేదు. కాని ఆమె పేరున కట్టించిన యీ పుస్తక భాండాగారాన్ని చూచినప్పుడు గడిచిపోయిన అనేక విషయాలు జ్ఞాపకానికి వస్తుంటాయ్. కనకం మనసుపడ్డ యీ ఇల్లు ఆమెకు కాకపోయినా— మేము ఉంటున్నాం. తీరని కోరికల్తోనే అందరూ మృత్యువును ఎదుర్కోవలసి వుంటుందేమో ?

ఇన్నాళ్ళా మధు ఎక్కడా కన్పించలేదు. అతని విషయాన్ని పత్రికల్లోకూడా ప్రకటించాను. ప్రభుత్వానికి చెప్పుకున్నాను. నన్నొక కృతఘ్నుడిగా తలచి—అతని మృతకళేబరంకూడా నాకళ్ళపడలేదు.

మా యీ కొత్త 'కనకాన్ని' చూసినప్పుడెల్లా ఆమె జ్ఞాపకం వస్తూంటుంది. ఈ ముసలితనంలో లోకంలో ఎవరికీ పనికిరాకపోయినా—ఆమె నాతో ఆడుకుంటూంటుంది.

ఒక్కొకనాడు యీ దక్షిణ దిశ కిటికీ దగ్గిర కూర్చొని- యీ పూలతోటలోకి చూస్తూంటాను. ముప్పైఏళ్ళనాడు కనకంతో గడిపిన ఆ మొదటిరాత్రి జ్ఞాపకం వస్తూంటుంది.

ఒక్కొకరాత్రి—కనకం—యీ దొడ్లో తిరుగుతూన్నట్టు— నన్ను రమ్మని పిలిచినట్టూ—నాకు స్ఫురిస్తుంది. 'రాజా' అని ఆమె పిలుస్తూన్నట్టుకూడా తోస్తుంది—అంతా భ్రమే అనుకొని వేదాంత పుస్తకాన్ని చదవటంలో నిమగ్నుణ్నవుతూ వుంటా.

— ఐపోయింది. —

మెల్లిగా చెయ్యిపట్టుకొని పక్కగదిలోకి తీసుకెళ్ళింది. ఉయ్యాల్లో పడుకొని—రెండుకళ్ళనూ తెరచి ఇంటి వాసాల్ని లెక్కెస్తోంది! జపాన్ రబ్బర్ బొమ్మలాగు చిన్న ఆకృతి! ఏ రక్తంనుంచి తెచ్చుకుందో—ఆ పాదాల ఎరుపును? ఏ లేత అరటిఆకుల మృదుత్వాన్ని కౌగిలించిందో— యీ శరీర మృదుత్వంకోసం! ఏ నీలాలనుంచి తెచ్చుకుంది—యీ మెరిసే కళ్ళను! ఏ గాంధీగారి దగ్గర్నుంచి తెచ్చుకుంది—యీ బోసినోటినవ్వును!

ప్రభ ఇప్పుడు అనుభవిస్తున్న మాతృత్వానికేనా—యీ లోకంలో కనకం అనర్హురాలైంది! ఏదో ఆనందంతో హృదయం నిండిపోయింది!—ఎంతలో దుఃఖం! ఎంతలో ఆనందం! ఇదేనా లోకచరిత్ర!

“ప్రభా!” ఆమె మాట్లాడలేదు. చెమ్మగిలిన ఆమె కళ్లు ఆమె ఏదో బాధకు గురవుతున్నట్టు చెప్తున్నయ్.

“పాపం! ఆమె పోయిందా!...అమ్మాయికి ఆమె పేరు పెడదాం—’’ అంది. ఎంత సానుభూతి! బతికి వుండగా శత్రువులైన వ్యక్తులు—చచ్చాక మిత్రులౌతారు కాబోలు!

తల వూపా. “కనకం!...కనకం!—”అని బిడ్డను తాకాను—దానికి అన్నీ తెలిసినట్టూ—మాటలు తనకు అర్థమైనట్టూ—బోసినోటితో జవాబు చెప్తోంది.

# 30

అద్దంలో చూసుకొన్నాను. తలవెంట్రుకలన్నీ నెరిసిపోతున్నై. దాదాపు అర్థశతాబ్దపు జీవితం గడిచిపోయింది. దేహంలో కండలు తక్కువ. అక్కడక్కడ నరాలూ, బొమికలుకూడా పైకి కన్పిస్తున్నయ్. నాకు తెలీకుండానే—తెలిసినా ఒక కలలాగు—ఎంత కాలం గడిచిపోయింద! ఎన్నెన్ని వింతలు సాగిపోయినై!

పది సంవత్సరాల క్రితం పోయిన కనకాన్నిగూర్చి ఇప్పుడు విచారంలేదు. కాని ఆమెపేరున కట్టించిన యీ పుస్తక భాండాగారాన్ని చూచినప్పుడు గడిచిపోయిన అనేక విషయాలు జ్ఞాపకానికి వస్తుంటాయ్. కనకం మనసుపడ్డ యీ ఇల్లు ఆమెకు కాకపోయినా—మేము ఉంటున్నాం. తీరని కోరికలతోనే అందరూ మృత్యువును ఎదుర్కోవలసి వుంటుందేమో ?

ఇన్నాళ్ళూ మధు ఎక్కడా కన్పించలేదు. అతని విషయాన్ని పత్రికల్లోకూడా ప్రకటించాను. ప్రభుత్వానికి చెప్పుకున్నాను. నన్నొక కృతఘ్నుడిగా తలచి—అతని మృతకళేబరంకూడా నాకళ్ళపడలేదు.

మా యీ కొత్త 'కనకాన్ని' చూసినప్పుడల్లా ఆమె జ్ఞాపకం వస్తూంటుంది. ఈ ముసలితనంలో లోకంలో ఎవరికీ పనికిరాకపోయినా—ఆమె నాతో ఆడుకుంటూంటుంది.

ఒక్కొకనాడు యీ దక్షిణ దిశ కిటికీ దగ్గర కూర్చొని- యీ పూలతోటలోకి చూస్తూంటాను. మూపైఏళ్ళనాడు కనకంతో గడిపిన ఆ మొదటిరాత్రి జ్ఞాపకం వస్తూంటుంది.

ఒక్కొకరాత్రి—కనకం—యీ దొడ్లో తిరుగుతూన్నట్టు—నన్ను రమ్మని పిలిచినట్టూ—నాకు స్ఫురిస్తుంది. 'రాజా' అని ఆమె పిలుస్తూన్నట్టుకూడా తోస్తుంది—అంతా భ్రమే ననుకొని వేదాంత పుస్తకాన్ని చదవటంలో నిమగ్నుణ్నవుతూ వుంటా.

— ఐపోయింది. —

లక్ష్మీ పవర్ ప్రెస్, తెనాలి